# జీవనజ్యోతి

*
*

రచన:

కొత్త రామకోటయ్య

*
*

ది వరల్డ్ టీచర్ ట్రస్టు ప్రచురణ
విశాఖపట్టణం - 2.

# శుభాశంసనము

కొందరిని చూచినచో ఆనందము, కొందరిని చూచినచో ఆదరము, కొందరిని చూచినచో ఆశ్చర్యము, కొందరిని చూచినచో నుత్సాహము, కొందరిని చూచినచో ప్రేమ కలుగును. వారియం దేమున్నదో అదే వారిని చూచినపుడు కలుగును. ఇందరిలో ఎవరిని చూచిన ప్రేమ కలుగునో వారు నాకు చాల సన్నిహితులు. నాకు ప్రేమపాత్రులు రామకోటయ్యగారు. నాకు చూడగా నితడు జీవులపై మాతృప్రేమ రూపుగట్టి దిగివచ్చినట్లు కనిపించును. బాధలో నున్నవారియందు వీరికిగల ప్రేమ తల్లుల కున్నదా యనిపించును. ఈ భావము నేను వ్యక్తము చేయు సందర్భ మిదివరకు కలుగలేదు. రామకోటయ్యగారు మొట్టమొదట కనుపించి మా నడుమ కొంత కాలక్షేపము జరిగినపుడు వారు "హాలికులైన నేమి?" అనిపించినది. తల్లిప్రేమ కలవారు ప్రజల కన్నము పెట్టునట్టి హాలికులుగా గాక అధికారులుగా నుందురా? వీరు దున్ని పంట పండించి ఇచ్చునట్టి పొలములు మరియు వేరుగా నున్నవి.

రోగార్తుల దేహములే క్షేత్రములుగా ధ్యానమున దున్ని మాస్టరుగారి నామ మంత్రము విత్తనముగా నాటి ఆరోగ్యమను పంట పండించుచున్నాడు. తాను స్వయముగా వేటూరి ప్రభాకర శాస్త్రియను మాగాణి పొలమునకు భూస్వామియై విశ్వప్రేమను, ఆధ్యాత్మికానందమును పండించుకొని భుజించుచు ధారాళముగా దాన ధర్మములు చేయుచున్నాడు. తన కుటుంబమునకు కావలసినవి మనస్సున లేవు గనుక ఈయనకు సంసారమే లేదు. భగవంతుని ఆదేశము ప్రకారము తిరుగుచు నెవ్వరి కేది వాంఛనీయమో వారికి

జ్ఞాని నందించుచుండును. శుకునకు భార్యా బిడ్డలు లేరు. వీరి కున్నారు. అంతవరకే భేదము. ఇట్టి విచిత్ర పురుషున కిట్టి విచిత్ర సంకల్పము కలిగినది. నా జీవిత మార్గ మాయనకు నచ్చినది. "మీ జీవితమున ప్రభాకరశాస్త్రి గారిని నేను చూచుచున్నాను." అని ఈయన పలుమారు పలికిరి. అగునో, కాదో వారి కనిపించి నపుడు నాకేల సంకోచము? నాకు వారి జీవిత మార్గము నచ్చినది. వారికి నా జీవిత మార్గము నచ్చినది. ఈ గ్రంథ రచనను గూర్చి నా యభిప్రాయ మేల? వారి సంకల్పమును సర్వ విధముల ఆమోదించుచున్నాను. వారిని, వారి కుటుంబమును, వారి జగత్ కుటుంబమును మాష్టరుగారు చిరకాలము చల్లని మార్గమున నడిపింపవలెనని ఆశీర్వదించుచున్నాను.

ఇట్లు,

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

# పరిచయము

కొన్ని సంవత్సరముల క్రిందట వేసవి కాలమున ఒకనాటి మధ్యాహ్నమున ఒక సిరాడంబరులైన వృద్ధులు మాస్టరుగారి యింటికి వచ్చిరి. ఆయన అనుభవమున, జ్ఞానమున తత్త్వదర్శన మున కూడా వృద్ధులు. మాస్టరుగారు వారి నాదరించి లోని కాహ్వానించి కుశల ప్రశ్నలు పలికి కూర్చుండబెట్టిరి. కొంత సేప యిన తరువాత ఆయన "అరవింద యోగీంద్రులు ఆంగ్లమున రచించిన "సావిత్రి" అను గ్రంథము మీ దగ్గర నున్నదా? దానిని చదువవలెనని యున్నది. మీ దగ్గర నున్నచో నాకొక మారు ఇప్పింపుడు." అనిరి. మాస్టరుగారు చిరునవ్వుతో "అది ఇరువది యవ శతాబ్దపు ఆంగ్ల పవిత్ర గ్రంథం. వేద వాఙ్మయమున ఋగ్వేద మెట్టిదో ఆంగ్లమున ఈ గ్రంథ మట్టిది. దాని నర్థము చేసికొనుటకు పెద్దలు తపస్సు చేయు చున్నారు. ప్రొఫెసర్లకు, విద్వాంసులకు నర్థము కాలేదని అంగీకరించు చున్నారు. రేపు మీకా గ్రంథమును తెప్పించి ఇచ్చెదను." అనిరి. ఆ మరునాడు గ్రంథమును స్వీకరిం చుచు రామకోటయ్యగారిట్లనిరి. "ఎవరికి నర్థము కాలేదనుచున్నారు! నే నింగ్లీషు మూడవ తరగతి పండితుడను. వృత్తి చేత కర్షకుడను. ఇది నా కర్థమగునా?" దానికి మాస్టరుగారు ఇట్లనిరి: "మీకిది తప్పక దర్శన మిచ్చును. ఇట్టి గ్రంథములు బోధపడుటకు కావలసి నది పాండిత్యము కాదు. మీ వలన ఈ గ్రంథమునకు జరగవలసిన పని యున్నది. మీరు చదువు చున్నపుడు కలిగిన భావములను తెనుగున రచింపుడు"

ఆ గ్రంథమును తీసికొని తమ గ్రామమునకు పోయిన రామకోటయ్యగారు రెండు మాసముల తరువాత తిరిగి వచ్చిరి. తెరచి చదువుట ప్రారంభించినది మొదలు గ్రంథము చక్కగా

విప్పారు చున్నదనియు, తమ మనస్సున నేవేవో అనుభవములు పొడగట్టుచున్నవనియు చెప్పిరి. అప్రయత్నముగా సులభశైలిలో తాము వ్రాసిన తెనుగు భావముల పుటలను వినిపించిరి. అది అరవిందుల సావిత్రికి సరళమైన, సులభమైన, సూటియైన అనువాదమని స్పష్టమైనది. అది అట్లని అంత వరకు రామకోటయ్యగారికే తెలియదు. తదుపరి ఆ గ్రంథమును పూర్తిగా అనువదింపుమని మాస్టరుగారు ఆదేశించుటయు, రామకోటయ్యగా రనువదించుటయు జరిగినవి.

ఆ రామకోటయ్యగారే ఈ గ్రంథమును రచించినవారు. అందరము వారిని రామకోటయ్య తాతయ్యగారు అంటాము. ఆయన నిరాడంబరత్వము చూచి మోసపోయిన వారికి ఆయన గ్రంథ రచన చేయగలరా యనిపించును. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు వీరికి గురువు, దైవము. ఆంధ్రలోకమున ప్రభాకర శాస్త్రిగారి పేరు వినని వారెక్కువమంది యుండరు. ఆయన నిజ స్వరూపము తెలిసినవారు కూడ నెక్కువ మంది యుండరు. ప్రభాకరశాస్త్రిగా రన్నచో ఆంధ్ర సాహిత్య పితామహుడని మాత్రము సాహిత్య పరులకు కొంత తెలియును. వారి ఆధ్యాత్మిక తేజః స్వరూపము, యోగ మార్గ దేశిక స్వరూపము పండితులకు తెలియదు. పామరులలో కొందరు భాగవతోత్తములకు తెలియును. మాస్టర్ సి. వి. వి. యోగ మార్గమునకు ప్రకాశము కలిగించిన చంద్రుని వంటి ప్రేమమయ స్వరూపులు ప్రభాకరశాస్త్రిగారు. వారి యుపదేశమే గాక నిత్య జీవితము గూడ ప్రేమమయ పరమోపదేశము.

పూర్వ మొకనాడు ప్రభాకర శాస్త్రిగారు రామకోటయ్యగారికి పోతన పద్యములను వినిపించుటయు, రామకోటయ్యగారు కర్ణపుటముతో గ్రోలుటయు జరిగినది. అందేమి తేజోవాహిని ప్రసారమైనదో మిగిలిన వారికి తెలియదుగాని, నాటి నుండి రామ

కోటయ్యగారికి ప్రభాకర శాస్త్రిగారు కులదైవము. మన మాస్టరు గారికి రామకోటయ్యగారన్నచో ప్రభాకరశాస్త్రిగారి చల్లని వెలుగునకు ప్రతిబింబము. "ఒక పుణ్యాత్ముని ధ్యానించుట గాని, వారి నారాధించుట గాని, వారి పుణ్య కథలు చెప్పకొనుటగాని, వారి సాన్నిధ్యమును కల్పించుకొనుటయే! అట్టి వారికి ఆ పుణ్యము, ఆ సాంగత్యము సిద్ధించును. నిరంతరము ఆత్మ తృప్తితో, ఆనందముతో జీవించువారి సాంగత్యము చేయుట వలన గూడ ఇదియే సిద్ధించును." అని మాస్టరుగారు తమ ప్రసంగమున నొకనాడు రామకోటయ్యగారి నుద్దేశించి పలికి యుండిరి.

ప్రభాకరశాస్త్రిగారు రామకోటయ్యగారికి ఒక మంత్రము ప్రసాదించిరి. అది "నమస్కారమ్స్ మాస్టర్ సి. వి. వి." అను మంత్రము. ఈ సి. వి. వి. ప్రభాకరశాస్త్రిగారి జీవిత జ్యోతి. ఆయన కుంభకోణమున సన్నిధిచేసియున్న యోగావతారమూర్తి. తన నామము నుచ్చరించి నమస్కరించిన వారిని తనంతవారుగా చేయుదునని మాట ఇచ్చియున్నారు. దాని నిదర్శన స్వరూపమే ప్రభాకరశాస్త్రిగారు. 19, 20 శతాబ్దములలో రాజయోగమార్గమునకు సి. వి. వి. సూర్యునివంటివాడు. ప్రభాకరశాస్త్రిగారు చంద్రుని వంటివాడు. ఒకరు జ్యోతిర్మయులు, ఒకరు ప్రేమమయులు. ఈ అనుగ్రహమును సి. వి. వి. గారియొద్ద మంత్ర రూపముగా పొందిన ప్రభాకరశాస్త్రిగారికి దశాబ్దములుగా వైద్యుల కలవిగాని ఒకమహా వ్యాధి నివారణమై ఆరోగ్యవంతుని చేసినది. వ్యాధి పోయి సి. వి. వి. నామము శాశ్వతముగా మిగిలినది. ఆ మంత్రమును స్మరించి, ఉపదేశించి పలువురను ఇహ పర వ్యాధులనుండి విమోచన చేసిన ప్రభాకరశాస్త్రిగారు రామకోటయ్యగారిని కూడ తమ మంత్రమయ దేహములోని కాకర్షించిరి. ప్రస్తుతము రామకోటయ్యగారు అదే యజ్ఞార్థమును నిర్వహించుచు తమతో ప్రేయసులో కూర్చున్న వారికిని, ప్రసంగించినవారికిని, బాధలను నివారించుచున్నారు.

రామకోటయ్యగారు చదువక పోయినను, చదువులలోని మర్మము గ్రహించినవారు. వైద్య విద్య నభ్యసింపకున్నను తన గురుస్మరణమే వైద్యముగా ప్రయోగించి, తన భక్తి విశ్వాసములు అనుపానములుగా వినియోగించి వ్యాధులు నివారించుచున్నారు. జీవులలో దేవుని చూచు భాగవత మార్గము వారిది. వారికి మన మాస్టరుగారు కృష్ణమాచార్యగారి జీవిత సంగ్రహము వ్రాయవలె నను సంకల్పము కలిగినది. రచన పూర్తిచేసి మాస్టరుగారికి చూపించిరి. మాస్టరుగారు అంగీకరించి దీని ప్రచురణకు ఆశీస్సు లిచ్చిరి. ఈ గ్రంథమును పఠించినవారు మాస్టరుగారి మార్గము నవగతము చేసికొని తమ జీవితమునకు ఆరోగ్యకరము, నిత్యానంద కరము అగు మార్గమును పొందగలరని గ్రంథకర్త సంకల్పము. సమస్యలు లేని సమన్వయము, నిర్వచనమున కతీతమైన నిత్యానం దము ఈ మార్గమున గల ముఖ్యాంశములు. ఈ మార్గమును ప్రకాశింపచేయుటకే వారు ఈ రచన చేసిరి. ఇంకను మాస్టరుగారి అనుయాయులను కలిసికొని వారి యనుభవములుకూడ స్వీకరించి ఈ గ్రంథమున చేర్పుమని రామకోటయ్యగారు నాతో చెప్పిరి. తదనుగుణముగా నేను కొంతమందిని కలిసికొని అనుభవములను సంగ్రహించి ఈ గ్రంథమున జతపరచితిని. నేను వ్రాసిన ఈ భాగ ములను చూచి రామకోటయ్యగారు, "ఇదంతా నేనే వ్రాసినట్లు న్నది" అని ఆశ్చర్యపడిరి. రామకోటయ్యగారి సంకల్పసిద్ధి ఎట్టిదో దీనివలన తెలియుచున్నది.

ఈ గ్రంథమున మాస్టరుగారి జీవితమందలి కార్యక్రమముల లోని ముఖ్యాంశములు వర్ణింపబడినవి. అందు ముఖ్యముగా మాస్టరు గారు అనుయాయులకిచ్చిన యోగ మార్గము, ఆధ్యాత్మిక జీవన విధానము, వేద మార్గ ప్రతిష్ఠాపనము, వ్యాధులు మొదలగు బాధలు గలవారితో సంభాషణ, సల్లాప, సహవాస పద్ధతులతో,

తగు మాత్రము వైద్య ప్రక్రియతో నిర్వహించు వ్యాధి నివారణ విధానములు చక్కగా వివరింపబడినవి. ఇంకను మాస్టరుగారి ప్రవచనములలో శ్రోతలు పొందు సర్వ సమన్వయానుభవములు. వేద పురాణ విజ్ఞాన సులభ వివరణము, ప్రాచీన, నవీన, శాస్త్ర సమన్వయము, ప్రాక్ పశ్చిమ ఆధ్యాత్మ జీవన సమన్వయము మున్నగునవి వివరింపబడినవి. ఈ గ్రంథమును పఠించువారికి విజ్ఞానము, మనోవికాసములే గాక ఆచరణము, జీవిత సమన్వయము ప్రారంభమైనచో గ్రంథకర్త చేసిన ప్రయత్నము సఫలమైనట్లు భావించెదము. అందరును మాస్టరుగారి మార్గమునే అవలంబింప వలెనని వీ రాశించుటలేదు. అందరవలంబింపదగిన శాశ్వత సుఖమయ మార్గము మాస్టరుగారి జీవితమున చదువరులకు లభించునని మాత్రమే వీరి ఆశయము. మార్గము శాశ్వతము, కాలాతీతము. వ్యక్తుల పేర్లు వచ్చుచు పోవుచుండును. మార్గము నవలంబించిన వ్యక్తులకు మార్గముతోపాటు శాశ్వతానంద మున్నది. దానినుపదేశించుటకు దిగివచ్చు వ్యక్తులును, వారి జీవిత గ్రంథములును నిమిత్తములుగా మాత్రము మిగిలినవారికి మార్గము గోచరించునని పెద్దలు చెప్పుదురు. దానినే ఈ గ్రంథకర్త సమన్వయించుచున్నారు.

CH. S. N. రాజు



# ప్రవేశిక

వ్యాసభగవానుడు నాలుగు వేదములను విభజించి, పదునెనిమిది పురాణములు, వేదాంత సూత్రములు, మహాభారతము వ్రాసెను. ఇన్ని వ్రాసినను ఆయనకు తృప్తి కలుగలేదు. నారద మహర్షి చేత భాగవత మార్గోపదేశము పొంది, భాగవతము రచించిన తర్వాతగాని ఆయనకు తృప్తి కలుగలేదు. భాగవతమనగా భగవంతుని గూర్చి చెప్పునది. భాగవతులలో భగవంతుడు వ్యక్తమగును గనుక, భాగవతుల గుణకీర్తనముల వలన భగవంతుని యనుభూతి లభించును. వారి జీవిత సన్నివేశములయం దిమిడియున్న కళ్యాణ గుణములను స్మరించుచున్న కొలదియు మనస్సు పవిత్రమగుచుండును. మనస్సునందలి సంశయములు, దుఃఖములు తొలగును.

లోకమునందు ధర్మము తగ్గి, అధర్మము పెరిగినపుడెల్ల భగవంతుడు అవతార మూర్తియై భూమిపై నవతరించును. ఇట్లు అవతరించినవారే క్రీస్తు, బుద్ధుడు, రాముడు, కృష్ణుడు మొదలగువారు. వీరెవ్వరును ఒకే దేశమునకుగాని, ఒకే కాలమునకుగాని సంబంధించినవారు కాదు. మానవజాతి సమస్తమునకు వెలుగు ప్రసాదించుటకై శరీరము ధరించిన ఒకే వెలుగుయొక్క వేర్వేరు రూపములు. ఇది గ్రహించకపోవుట వలననే, వారి సమకాలికులు వారిని అర్థము చేసికొనలేకపోయిరి. వారు శరీరము విడచిన చాల కాలము తరువాత వారి యుపదేశములు మానవులయందు పని చేయుట ప్రారంభించినవి. ఇది చరిత్ర నేర్పిన యనుభవ పాఠము. మానవునియందున్న యీ తత్వమును గమనించిన వాల్మీకి మహర్షి రామాయణమున శ్రీరామచంద్రుని కళ్యాణ గుణములను, వ్యాస భగవానులు భారత భాగవతములలో శ్రీకృష్ణుని దివ్య లీలలను

గానముచేసి గ్రంథస్థము చేసిరి. వీని ప్రయోజన మొక్కటే. భగవంతునియు, భాగవత శిఖామణులయు కళ్యాణ గుణ కీర్తనము మరల మరల చేయుటవలన మనస్సులు పవిత్రీకరణము చెందును. వ్యాస వాల్మీకుల నాటినుండి నేటివరకును అట్టి ప్రయత్నములే ఎన్నియో జరిగినవి. మానవాళి యున్నంతవరకును ఇట్టి ప్రయత్నములు నిత్య నూతనములుగా జరుగుచునే యుండును. అట్టిదే యీ గ్రంథరచనా ప్రయత్నము కూడ!

మాస్టర్ E K. గారు మన నడుమనే శరీరముతో తిరుగుచున్నను, శరీరమున బంధింపబడని యొక వెలుగు రవ్వ. ఈర్ష్యా ద్వేషములు, కామ క్రోధములు, స్వార్థము మొదలగు కలి లక్షణములచే పీడింపబడుచున్న మానవ జాతిలో మరల ప్రేమ జ్యోతిని వెలిగించుటకు దిగివచ్చిన యొక ప్రేమమూర్తి. మానవులు తమకు తాము భగవంతుని యంశలేయైనను, జాతి, మతము, కులము, అంతస్థు మొదలైన అడ్డుగోడలను తమకు తామే నిర్మించుకొని చిక్కుపడి యున్నారు. అట్టి స్వయంబంధితులకు బంధ విముక్తి కలిగించుటకు అవతరించిన రక్షకుడాయన. కలుషితమైన ఆహార విహారములతో, సంకుచితమైన మనోభావములతో, వ్యామోహములు, భ్రమలు ఆవరించిన హృదయములతో పతన మగుచున్న మానవులను ఉద్ధరించుటకు వచ్చిన ఒక భవరోగవైద్యుడాయన.

వైజ్ఞానికముగా, శాస్త్రీయముగా, ఆర్థికముగా, సాంకేతికముగా అన్ని రంగములలోను మానవుడు అభివృద్ధి సాధించుచున్నను తృప్తి సంతోషములు కరవై నిర్జీవముగా బ్రతుకును సాగించుచున్న ఈ కాలములో జవమును, జీవమును పోయుటకు ఏతెంచిన ఒక మహా ప్రాణశక్తి ఆయన.

మాస్టరుగారిలో అణువణువునా ప్రజ్వరిల్లు వెలుగును, నేను అడుగుపెట్టిన తావులందెల్ల నాకు సాధ్యమైనంతవరకు వెలిగించవలెననిపించినది. ఆయన వాక్కులను లోకమునకు వినిపించవలెననిపించినది. ఆయన కథలను, జీవిత సన్నివేశములను సోదరులకు తెలియ

జేయవలె ననిపించినది. ఆయన శిష్యుల కథలనుండి, వారి అనుభవ ములనుండి మాస్టరుగారి సాన్నిధ్యమును లోకమునకు తెలియ జేయవలె ననిపించినది.

మాస్టరుగారు అనేక కార్యక్రమములను నిర్వహించు చున్నారు. ఆ నిర్వహణముల తీరు, తీర్పు అందరికిని తెలియజేయుట యవసరము. మాస్టరుగారి జీవితములోని కొన్ని సన్నివేశములను తెలియజేయుట వలన, చాల మంది సాధకుల హృదయములలో నున్న సంశయములు కరగిపోయి, వారి జీవితములకు చక్కని మార్గము లేర్పడును. మాస్టరుగారి చికిత్సా విధానమును చక్కగా పది మందికి వివరించినచో, అస్వస్థతతో బాధపడుచున్న ఎంతో మందికి స్వస్థత చేకూర్చుకొను నవకాశము కలుగును. మాస్టరు గారి యోగ మార్గమును అందరికిని తెలియజేసినచో, యోగసాధన యందలి సులువు, సూక్ష్మములు సాధకులకు తెలిసి, యోగస్థితి సిద్ధించు నవకాశము కలుగును. కనుకనే ఈ గ్రంథమునందు ఆయా విషయములు చిన్న చిన్న కథలుగా, ఉదాహరణములతో వ్రాయుట జరిగినది. మొట్ట మొదటగా మాస్టరుగారి జీవిత చరిత్ర యందలి కొన్ని సన్నివేశములు, తరువాత మాస్టరుగారితో నాకు గల పరిచయము, నా అనుభవములు, సోదరుల అనుభవములు, యోగ మార్గము, శిక్షణా విధానము, వైద్యసేవ, ఉపదేశములు మొదలగున వెన్నియో అంశములు వ్రాయుట జరిగినది. మాస్టరు గారు ఒక మహాసముద్రము. అందలి అలలే నేను దర్శించిన విశేష ములు. నాకు దర్శన మందినంత వరకు నేను వ్రాసితిని. దానినుండి ఎవరికి వారు మాస్టరుగారితో వారికి గల సన్నిహితత్వమును బట్టి గ్రహించవలసిన దే!

ఈ గ్రంథ రచనా సందర్భమున సహకరించిన మిత్రులు CH. సాంబశివరావు గారికి మాస్టరుగారి శుభాశీస్సులు.

— కొత్త రామకోటయ్య

# విషయసూచిక

# మాస్టరుగారి జీవిత సన్నివేశాలు

1926 వ సంవత్సరము ఆగస్టు 11వ తేదీ జననము. జన్మ స్థలము గుంటూరు జిల్లా, బాపట్ల గ్రామము. తండ్రి శ్రీమాన్ అనంతాచార్యులు. వీరు వేద వేదాంగాది సర్వశాస్త్ర పారంగతులు. మహా బలశాలి. వ్యాయామ పటిష్ఠ దేహము కలవారు. మల్ల విద్యలో వందలమంది శిష్యులు. గురు సాన్నిధ్యమున యోగాభ్యాసము చేసి సిద్ధులు పొందినవారు. తల్లి శ్రీమతి బుచ్చమ్మ. వీరికి నలుగురు పుత్రులు. అందు పెద్దవారు మన కులపతి.

తండ్రిగారి ప్రాణ విద్యాభ్యాసము నిమిత్తముగా చిన్నతనమున మద్రాసు నివాసము. బాల్యమున తరచుగా తిరువళిక్కేణిలో పార్థసారథిస్వామి ఆలయమునకు వెళ్ళడం, తెప్ప ఉత్సవము మొదలగు వైభవాలను దర్శించటం జరుగుచుండేది. స్వామి దర్శన సమయాలలో సంతోష పారవశ్యం కలుగుచుండుట యిప్పటికిని గుర్తున్నది.

1930 నుండి మరల బాపట్ల నివాసము. చోరగుడి రామదత్తు గారి యింటిలో అద్దె కుండేవారు. తండ్రిగారికి స్నేహవర్గ మెక్కువ. వారందరు గారాబంగా చూచేవారు. రామకృష్ణయ్య అను వేద పండితుడు "వేదము లెన్ని? వేదాంగము

లెన్ని? ఉపనిషత్తు లెన్ని? శాస్త్రము లెన్ని? వాని పేర్లేమి?" అని ప్రశ్నించి చెప్పి వల్లె వేయించు చుండేవాడు. ద్రైతా సీతా రామయ్య అను పండితుడు ఈ బాలునికి పురాణకథలు చెబుతూ "ఈశ్వర చంద్రవిద్యాసాగర్ ఆఫ్ బాపట్ల" అని మెచ్చుకొను చుండేవాడు. హేమమ్మ అన్న వృద్ధవితంతువు ఏకాకిని. ఆమె ఎప్పుడూ ఈ బాలు నెత్తుకొని తిప్పుచుండేది. ఉద్యోగము చేస్తూన్న ఆమె ఏకపుత్రుడు బెజవాడలో అకస్మాత్తుగా మరణించాడు. ఆ దుఃఖము మరచిపోవుటకు ఈ బాలునితో వినోదించేది.

ఈ బాలుని పెద్ద తండ్రి శోభనాద్రాచార్యులు. కోర్టులో గుమాస్తాపని చేయుచుండేవారు. సాయంకాలము కోర్టు నుండి వచ్చి, స్నానము చేసి కుర్రవానిని భుజముపై ఎక్కించుకొని బజారుకు తీసికొని వెళ్లి బిళ్ళలు, పండ్లు కొనిపెట్టేవారు. ఇట్లు ఆట పాటలతో కొన్ని సంవత్సరాలు గడచినవి.

1934లో తల్లి ప్రసవమునకై తెనాలి నివాసము. అచట సోదరుడు వేదవ్యాసు జన్మించాడు. అదే సమయమున ఈ బాలునికి కామెర్ల వ్యాధి వచ్చినపుడు మొట్టమొదటగా హోమియోపతి వైద్యము జరిగినది. ఇక బ్రతుకడు అనుకొని గండము తప్పింది. (పసితనమున ఒకసారి న్యుమోనియా వ్యాధి వచ్చినపుడు కూడ బ్రతుకడని బయట అరుగుమీద పెట్టినారు. చిట్టచివరి ప్రయత్నముగా తండ్రిగారు త్రాచుపాము గరళము తెచ్చి ఒక చుక్క గొంతులో వేశారు. ఆ మరునాడు ఉదయానికి గండము తప్పింది). కామెర్ల వ్యాధి సమయమున మగతగా నుండి కన్ను మూసినపుడు వేణుగోపాలుడు కనిపించేవాడు. అయిదు మాసముల తరువాత మరల బాపట్లకు తిరిగి వచ్చారు. విద్యాభ్యాసమునకు తండ్రిగారు బడిలో చేర్చక సొంతముగనే చెబుతుండే వారు. సాటి పిల్లలు

బడికిపోయి రావడం వింతగా చూచేవారు. పొరుగింటి వృద్ధురాలు చిలకమ్మ "ఏమిరా బడికిపోవా? పెద్దవాడవై గాడిదలను కాసెదవా?" అని అడిగినపు డెల్ల కొంచెము కష్టముగా నుండేది.

1938వ సంవత్సరంలో తండ్రిగారు వైద్యవృత్తి నిమిత్తము విజయవాడకు నివాసమును మార్చారు. అప్పటినుండి పితృ సాన్నిధ్యమున యోగాభ్యాసము ప్రారంభమైనది. ఆసనములు, ప్రాణాయామము, బ్రాహ్మీ ముహూర్తమున స్నానము, ధ్యానము క్రమబద్ధముగ జరిగేవి. పుష్కలమైన ధనార్జన చేస్తున్న తండ్రిగారు సమస్త వస్తుసంపదతో బిడ్డలను కాలు కందకుండ పెంచారు. పండ్లు, పాలు, పెరుగు, మీగడ, గోధుమలతో పిల్లల పెంపకము జరిగింది. పిల్లలను బడికి పంపక యింటివద్దనే సంస్కృతము, తెనుగు, ఆంగ్లము అభ్యసింప జేయసాగారు. భగవద్గీత, ఆయుర్వేదము, ఉపనిషత్తులు, వేద మంత్రముల అధ్యయనము నిరంతరము జరుగుతుండేది. 1938–1940 మధ్య హూణ విద్యాభ్యాస ప్రయత్నములు జరిగినవి. స్వయంకృషిపై వానకాలపు చదువుగా ఉండేది. ఒకనాటి మధ్యాహ్నము గ్రీష్మమున కులపతికి నిద్రలో వారి తల్లిగారు స్వప్నమున కనిపించి యిలా చెప్పారు. "ఇకనుండి భార మంతా నీది. తమ్ములను పెంచి పెద్ద వారిని చేయవలెను. నేను ఎలాగూ ఎక్కువ కాలము బ్రతుకను." మరల వారము రోజుల తరువాత మాగన్నుగ సగము నిద్రలో ఉండగా, తల్లి మరణించటం, ఆమెను తీసుకొనిపోవటం, దహన సంస్కారము, దహనమునకు ముందు ఆమె మరల లేచి నలు దిక్కులు పారజూడటం, కుమారునికి ఉపనయనము జరిగినందున అతడు కర్మకాండ జరిపించు చున్నందుకు తన ఆత్మ సంతోషించెనని చెప్పటం కన్నులకు కట్టినవి.

1940 వ సంవత్సరమున ఒక సోదరి జన్మించింది. జన్మించిన పండ్రెండవ దినమున తండ్రి పిలిచి ఇలా చెప్పారు. "మీ తల్లికి

ప్రసవ కాలమున రక్తము నష్టమైనది. గుండెకు నీరు పట్టినది.
బ్రతుకుటకు అవకాశము తక్కువ.'' అటుపైన విజయవాడలోని
పెద్ద వైద్యులందరూ ప్రయత్నము చేసినా ఆమెను బ్రతికించ లేక
పోయారు. స్వప్న వృత్తాంతము నిజమైనది. రాత్రి 1-30 గంటలకు
తల్లి మరణించినది. అటుపైన ఒకనాటి తెల్లవారుజామున స్వప్న
మున తల్లి కనిపించి యిలా చెప్పినది: "మీ తండ్రి పూర్వజన్మలో
క్షత్రియులు. నేను కొలది కాలములో క్షత్రియుల ఇంట
జన్మిస్తాను. నీవు చాల విద్యావంతుడ వవుతావు. నీ భారము
చూచే బాధ్యత నాది. తండ్రిగారు స్థాపించవలె ననుకొన్న విద్యా
లయమును నీవు స్థాపించు. కుటుంబ బాధ్యతలు నెరవేర్చుటలో
నీవు కొన్ని మంచి అవకాశములు వదలుకోవలసి ఉంటుంది.
ఎన్నో మహాత్కార్యములు సాధిస్తావు. ఈ విగ్రహము నీదగ్గర
ఉంచు." ఆమె ఒక సుందరమైన వేణుగోపాలుని విగ్రహము,
చక్కగా రంగులు తీర్చి దిద్దిన విగ్రహము నిచ్చి ఇలా అన్నారు.
"శ్రద్ధగా ఇతడు చెప్పినట్లు వింటూ ఉండు. క్రొత్త విగ్రహములెన్ని
వచ్చినా దీనిని మాత్రము దాచుకో! మాసినపుడు నేనే రంగులు
వేసి యిస్తాను."

తల్లి చనిపోయేసరికి చెల్లెలికి 2వ నెల. ఆమె రెండున్నర
సంవత్సరములు పెరిగి చనిపోయినది. 1943లో కులపతి బెనారస్
మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్ళి తప్పారు. కాశీలో కేదార ఘట్టమున
స్నానము చేస్తున్నప్పుడు ఈత రాదని చెప్పినా నమ్మక,
మిత్రులు ఇతనిని గంగలో విడిచారు. ఇతడు మునుకలు వేస్తూ
ఉండగా ఈతకొట్టుచున్న దృఢకాయుడైన ఒక సర్దారుజీ పట్టు
కొని ఒడ్డు చేర్చాడు. మరల 1944లో హాజరై మెట్రిక్యులేషన్
పాసయ్యారు. 1944-46 గుంటూరు హిందూ కళాశాలలో ఇంటర్
మీడియట్ చదువుతుండగా పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యుల సాన్నిధ్య
మున కవిత్వము వ్రాయడం ప్రారంభమైనది. తాను, మిత్రులు

కలిసి ఆంధ్ర సాహిత్య మండలి అనే సాహితీ సంస్థను స్థాపించారు. "అర్పణ" అనే ఖండ కావ్యమును మొదటి కృతిగా ప్రచురించి పూర్ణప్రజ్ఞాచార్యుల చేతను విశ్వనాథ సత్యనారాయణగారి చేతను ఆశీఃపూర్వకములైన మెచ్చుదల పొందారు.

1946–1949 విశాఖపట్టణము ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో తెనుగు B. A. (Hons.) చదివి ప్రథమ కక్ష్యలో, ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. 1947 మే నెలలో వివాహం జరిగినది. 1947 లో విద్యార్థి దశలో ఒకనాడు వైస్ ఛాన్సలర్ కట్టమంచి రామలింగా రెడ్డి యూనివర్సిటీ హాస్టలు పర్యవేక్షణకు వచ్చారు. సమయము వేచి మన కులపతి, "అర్పణ" ఖండకావ్య ప్రతిని బహూకరించారు. రెడ్డి గారు వేడుకపడి అచ్చటనే నిలబడి పుస్తకము తెరచి, "గుంటూరు సీమ" అను శీర్షిక క్రింద "ఘనుడాంధ్ర శుకుడు వేమనయోగి వర్షించు జ్ఞానామృతము గ్రోలి ఘనత చెంది" అను పాదమును చదివి వీపు తట్టి "చాల బాగున్నదిరా! ఒకమారు మా యింటికి రారా!" అన్నారు. రెండు మాసములలో కులపతి "ఋతు గానము" అను ఖండ కావ్యము రచించి తీసికొని పోయి వారికి వినిపించారు. వారు మెచ్చుకొని ఆశీస్సులతో పీఠిక వ్రాసి యిచ్చారు. అందు "The University is proud that it has within its compound, a poet of the caliber of Krishnamacharya" అని వ్రాశారు.

1949 జూలైలో గుంటూరు హిందూ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా చేరారు. క్రొత్తగా కాపురము పెట్టిన రోజులు. పూజామందిర మేర్పరచుకొనే ప్రయత్నమున ఒక చక్కని గాయత్రి పటము లభించింది. దానిని తెచ్చి నిత్యపూజ ప్రారంభించారు. ఒకనాటి వేకువ గాయత్రీ ధ్యానము చేస్తూండగా పట్టుబట్ట కట్టుకొని వీరాసనమున కూర్చున్న ఒక స్థూలకాయుడగు వ్యక్తి శరీరము నడుము నుండి క్రింది భాగము మాత్రము కనిపించి

పడి. ఆనాటి నుండీ కనులు మూసి ధ్యానము చేసేటప్పుడు అదే దృశ్యము స్పష్టతరముగ కనిపించసాగింది. పది రోజులలో మొత్తము శరీరము కనిపించింది. ముఖము స్పష్టముగ దర్శన మిచ్చింది. శాంత గంభీరమైన వదనము; పెద్ద కళ్లు, మీసములు. వా రెవరో కులపతికి తెలియలేదు. ఎచ్చటనో చూచిన ట్లనిపించి నది. రెండు వారములలో గూడవల్లి గ్రామము హెడ్ మాస్టర్ రాజగోపాలరావు గారు కులపతి యింటికి వచ్చారు. వారి స్కూలులో జరుపుచున్న రవీంద్రనాథ్ ఠాగూర్ వర్ధంతి ఉత్సవములలో కుల పతిని ఉపన్యసించ మని ఆహ్వానించారు. నాటి సాయంకాలము గూడవల్లి హెడ్ మాస్టర్ గారి యింట ప్రేయరులో పాల్గొన్నారు. అచ్చట ఒక పెద్ద పటము దగ్గర అందరూ చేరారు. ఆశ్చర్యము! ఆ పటములోని వ్యక్తియే అనుదినము ధ్యానమున కనిపిస్తున్న వారు. ఆనాటి ప్రేయరులో అపూర్వమైన అనుభవమును పొందిన కులపతి, ఆ పటములోని వ్యక్తిని గూర్చి ప్రశ్నించగా, రాజ గోపాలరావు గారు ఇలా చెప్పారు. "వారు పరమ గురువులు. వారి పేరు మాస్టర్ సి. వి. వి. అదే మా మంత్రము. వారు కుంభ కోణమున ఉండేవారు." వారిచేత ఆ మంత్రము వ్రాయించు కొని ఆనాటి నుండి కులపతి సి. వి. వి. ప్రేయరు ప్రారంభించారు.

1958 వ సంవత్సరమున కొందరు మిత్రులు ఒక సాంస్కృ తిక సంస్థను స్థాపించుకొని ప్రతి ఆదివారము ఉపన్యాసము లిచ్చే వారు. వినేవారు లేక బాధపడుచు, ఒకనాడు కులపతిని ఆహ్వానించి జ్యోతిశ్శాస్త్రమును గూర్చి ఉపన్యసించ మన్నారు. మెంబర్లలో ఆస్తికులు, నాస్తికులు, రాజకీయ వాదులు, నానా గోత్రముల వారున్నారు. ఆనాటి ఉపన్యాసమునకు కులపతి మిత్రులు చాలమంది వచ్చారు. ప్రతి ఆదివారము కులపతి ఉపన్యాసములు జరుగుచుండగా సంఖ్య పెరిగిపోయింది. కార్యకర్తలు ఏర్పరచిన చిన్న గది చాలలేదు. వారి కోరికపై కులపతి దివ్యజ్ఞాన సమాజ

మునకు పోయి డాక్టర్ A. S. చలపతిరావు గారితో సంప్రదించి ఉపన్యాసము లక్కడ ఏర్పరచారు. చేరిన రోజునే ఉపన్యాసానంతరము కులపతి దివ్యజ్ఞాన సమాజ గ్రంథాలయమును చూశారు. గ్రంథములలో "SECRET DOCTRINE" అను గ్రంథ రాజము వారిని అయస్కాంతము వలె ఆకర్షించింది. దాని నిమ్మని కోరగా ఒక వృద్ధుడైన దివ్యజ్ఞాన సభ్యు డిలా అన్నారు. "అది అర్థము కాదు. ఇప్పటికి మేమే దానిని చదవడానికి యత్నింపలేదు. చిన్న పుస్తకము లున్నవి. ప్రారంభకులకు పనికి వస్తాయి. వానితో మొదలు పెట్టు." కులపతి మౌనము వహించి వెడలిపోయారు. మరుసటి ఆదివారమున "SECRET DOCTRINE చదువుటకు వీలున్నదా?" యని చలపతిరావుగారిని అడిగారు. ఆయన "మీరుచదువుతా నన్నచో నాకేమి అభ్యంతరము? తీసికొని పొండి" అని వెంటనే తీసి యిచ్చారు. కులపతి ఆ గ్రంథము ఆదరముతో అందుకొని విషయానుక్రమణికను పరికించగా అన్నీ కొంతకొంత తెలిసిన విషయముల వలె నున్నవి. అప్పటికి నాలుగు సంవత్సరముల నుండి సాయంకాలముల యందు కొందరు యువకులను చేర్చి కులపతి మహాభారతము బోధించుచు ఉపన్యసిస్తున్నారు. అందనేక విషయములు అప్రయత్నముగ రహస్యములతో వివరించబడుతూండటం వారందరెరిగినదే! ఆ విషయము లన్నీ "SECRET DOCTRINE" శీర్షికలలో కనిపించినవి.

గ్రంథము నింటికి గొనివచ్చి అధ్యయన మారంభించారు. ఏ వాక్యమున కా వాక్యము గొప్పగా దర్శన మిస్తున్నది గాని గ్రంథ స్వరూపము ఆకళింపునకు రావడం లేదు. అయినా పట్టుబట్టి చదివారు. నలుబది అయిదు దినములు గడిచినాయి. వారి కుటుంబము పుట్టినింటికి వెళ్ళగా వారొక్కరే యింట నున్నారు. గ్రంథము చదువ నారంభించినది మొదలు ఏవో వెలుగులు కనిపించడం, రాత్రు లందు యింటిలో చాలమంది వ్యక్తులు తిరుగు

తున్న ట్లనిపించటం, ఎచ్చటికైనా పోతున్నపుడు కూడా ఎవరో వెంట వస్తున్నట్లు అలికిడి కావడం, ఎవరో వెనుకనుండి భుజము తట్టినట్లుండటం జరుగు చుండేవి.

దిన మంతా చదువుతూ కూర్చుండి వంటచేసు కొనటానికి, భోజనాదికము చేయుటానికి బద్ధకించారు. రాత్రి ఒంటి గంటకు ఆకలి మిక్కిలిగా వేసినది. బయలుదేరి నైట్ హోటలుకు వెళ్ళి పూరీ, కాఫీ తీసుకొని వస్తున్నారు. గుంటూరు బ్రాడీపేట రెండవలైను ఒకటవ అడ్డరోడ్డు దాటుతుండగా "SECRET DOCTRINE" లోని విషయములు మనస్సులో మెదలుతున్నవి. కుడిప్రక్క ఎవ్వరో మెల్లగా నడుస్తున్నట్లు అలికిడియైనది. బాటలో లైట్లు లేవు. అమావాస్య రోజులు. అంతా చీకటిగా ఉంది. నెరసిన గడ్డము, మెడలమీదకు పెరిగిన జుత్తు కలిగిన ఒక వ్యక్తి కుడిప్రక్కగా నడుస్తున్నాడు. ఖద్దరు లాల్చి, భుజమున చిన్న చిరుగు ఉన్నది. జేబు దగ్గర సిరా మరక ఉన్నది. కులపతి మొగము వంక చూస్తూ కొన్ని అడుగులు నడచి చిన్న సకిలింపుగా నవ్వి, "Would you like to give me something to eat"? అని ప్రశ్నించాడు. "Sure, please follow me" అని అప్రయత్నముగ కులపతి అన్నారు. ఇరువురు నైట్ హోటలుకు వెళ్ళారు. అతనికి కావలసిన టిఫిన్, కాఫీ ఇప్పించి వెనుదిరిగి మరల అదే దారిని నడుస్తున్నారు. ఎవ్వరూ లేని చీకటి చోటులోనికి వచ్చినంతనే "So you are reading Secret Doctrine?" అని ఆ వ్యక్తి ప్రశ్నించాడు. చాల ఆశ్చర్యమైనది. ఈయన ఎవరు? థియసాఫికల్ సొసైటీమెంబరా? తనను చాల రోజులనుండి కని పెడుతున్నాడా?" ఇలా క్షణములో వెయ్యి ఆలోచనలు మెరసినాయి. ఇంతలో అతడు ఆ ప్రశ్నను రెట్టించాడు "Yes Sir! I am trying to read it!" అని వినయముగా జవాబిచ్చారు. "Read! begin with the chapter of Holy of Holies, you will

understand the book better'' అని ఆ నూతన వ్యక్తి మరి రెండడుగులు నడచి ఆగి ఇలాఅన్నాడు, 'Read Bhagavadgita.' దానికి కులపతి ''Sir! I have already studied it!'' అన్నారు. ''No! again read Bhagavadgita !'' అని ఆయన రెట్టించారు. బ్రాడీపేట రెండవలైను మూడవ అడ్డరోడ్డు వచ్చింది. ఆయన 'I will proceed my own way' అని అడ్డరోడ్డులోనికి తిరిగారు. అప్పటినుండి నేటివరకు ఆ వ్యక్తితో సహచరత్వము నడుస్తున్నది. నిత్యజీవితమునకు, కుటుంబమునకు సంబంధించిన విషయములలో కూడ ఆ వ్యక్తి జోక్యము, సలహా ఉంటుంది.

గుంటూరులో కొందరు మిత్రులు ఒక జ్యోతిష, ఆధ్యాత్మిక పరిషత్తు స్థాపించారు. దానికి ధనబలము లేదు. వారు కులపతి సహాయ మర్థించారు. ''మిహిర'' అను పేర ఒక జ్యోతిష ఆధ్యాత్మిక మాస పత్రిక స్థాపించారు. కులపతిని సంపాదకులుగా ఉండమని కోరగా, ఏడు మాసములు సంపాదకత్వము వహించి నిర్వహించి చూపారు. ఎనిమిదవ మాసంలో వారు విడిచి పెట్టడం, ఆ పత్రిక నిలిచి పోవడం జరిగాయి.

''మిహిర'' మాస పత్రిక ప్రతులు మద్రాసులో అడయారుకు పంపబడుచుండేవి. అచ్చటకు వచ్చిన బెల్జియమ్ వాస్తవ్యుడగు నొక వృద్ధ యోగి ఆ పత్రికలను చదవటం జరిగింది. ఆయన పేరు అల్బర్ట్‌శళీ. నీలగిరిలో ఆశ్రమము స్థాపించుకొని అగస్త్య మహర్షిని ధ్యానిస్తూ పరమ గురువుల ఆధ్యాత్మిక మార్గమున జీవితమును మలచుకొంటున్నాడు. బెల్జియమ్, ఫ్రాన్సు, స్విట్జర్లాండు, హాలెండు దేశములలో అతనికి అసంఖ్యాకమైన శిష్యవర్గమున్నది. అతడు ''మిహిర'' పత్రికలోని కులపతి వ్యాసములు చదివి ఉత్తేజితుడై ఉత్తరము వ్రాశాడు. అప్పటినుండి వారిద్దరికి ఆధ్యాత్మికానుబంధము పెరిగినది. కొలది మాసములలో అతడు

గుంటూరు వచ్చి కులపతిని దర్శించి అనేక ప్రణాళికలను సంప్రదించి వెళ్ళాడు. జ్వాల్‌కూల్ మహర్షి సందేశాలు ఆయన శిష్యురాలైన Alice A. Bailey రచనల ద్వారా లోకమునకు అందించబడినాయి. వానిని ప్రచారము చేసి కార్య రూపమున పెట్టించటం ఆల్బర్ట్ శకీ జీవితాశయము. పరమ గురువు మైత్రేయుల ఆధ్యాత్మిక అంతర్జాతీయ ప్రణాళిక ననుసరించి ప్రాచ్య పాశ్చాత్య సమన్వయ సాధనకు ఉపకరించుట అతని జీవితాశయము. అతడు కులపతితో ఒక రాత్రి అంతా సంప్రదించాడు. వారిరువురూ ప్రాచ్య పాశ్చాత్య సమన్వయమునకు యావజ్జీవము శ్రద్ధ వహించటానికి ఒప్పందము చేసికొన్నారు.

గుంటూరు హిందూ కళాశాలలో పనిచేస్తున్న కాలములోనే గుంటూరు మండలము రోమన్ కేథలిక్ చర్చికి బిషప్‌గారైన ఇగ్నేషియస్ ముమ్మడికి కులపతితో పరిచయము కలిగింది. అది అతి సన్నిహిత మయింది. బిషప్ గారి కోరికతో బైబిలులోని Psalms గ్రంథమును 'దావీదురాజు కీర్తనలు' అను పేర తెనుగులోనికి రాగతాళ యుక్తముగా అనువాదము చేసి కులపతి ఇచ్చారు. దానిని వారు ముద్రించారు. ఆ దినములలో Secret Doctrine పారాయణము పూర్తియై Isis Unvield అధ్యయనము జరుగుచుండేది. గుంటూరులోని పుర ప్రముఖులైన దివ్యజ్ఞాన సభ్యులు కొందరు కులపతి యొద్ద Secret Doctrine అధ్యయనము చేశారు. థియసాఫికల్ సొసైటీలో ప్రసంగముల రూపమున పాఠములు జరుగు చుండేవి.

విశ్వ విద్యాలయమున B. A. (Hons) చదువుచున్న దినములలో యూనివర్సిటీ లైబ్రరీలో మంత్రశాస్త్ర గ్రంథములను కులపతి మొట్టమొదటగా చూచారు. Sir John Woodroffe సంస్కరించి ప్రచురించిన మంత్రశాస్త్ర వాఙ్మయము నంతను సొంతముగ అధ్యయనము చేసి వ్యాఖ్యానములతో అవగతము

చేసికొని Notes వ్రాసికొన్నారు. ముఖ్యముగ శారదా తిలక తంత్రము అనే గ్రంథము వారి నాకర్షించింది. గుంటూరులో వృత్తిలో ప్రవేశించినప్పటి నుండీ అందలి ప్రధాన మంత్రములను దీక్షా పూర్వకముగా పునశ్చరణ చేశారు. ఒక్కొక్క మంత్రము నలుబది దినములు దీక్ష చేశారు. ఆహారమున రుచులు మాని నాలుగు సంవత్సరములు వేలపింఢీ, పాలు మాత్రమే తీసికొన్నారు. రుద్ర మంత్రములలో అఘోరాస్త్ర మంత్రము దీక్ష పూర్తి అయిన నాటి రాత్రి పండ్రెండు గంటలకు "అశ్వత్థామ" నాటక రచన మారంభించి ఉదయము అయిదు గంటలకు పూర్తి చేశారు. ఈ నాటికలో రౌద్రాస్త్ర మంత్రముల సంపుటీకరణ మున్నది.

1952 నుండి శ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారి సన్నిహిత సాంగత్యము వలన సాహితీ సమితిలో సభ్యులై అనేక సాహిత్య గోష్ఠులలో, ఉత్సవములలో పాల్గొన్నారు. జయదేవ కవి సంస్కృతమున రచించిన "పీయూషలహరి" అనే గోష్ఠి రూపకము (Musical Play) ను తెనుగులోనికి అనువదించి 1955లో ప్రకటించారు. విశ్వ విద్యాలయమున విద్యార్థిగా ఉన్న దినములలో ఒక కార్తిక పూర్ణిమ నడిరేయి మెలకువ వచ్చింది. గవాక్షము నుండి మూడు వైపుల ఆవరించియున్న సముద్రముపై వెన్నెల పడుచున్న దృశ్యము చూస్తూ కూర్చున్నారు. బృందావనమున గోపకన్య చేయుచున్న అన్వేషణము ననుసరించి అప్రయత్నముగ కొన్ని పద్యములు దొర్లినవి. అదియే "రాసలీల" గ్రంథ రచనము ప్రారంభము. అది ఇప్పటికి కొన్ని వేల పద్యముల కావ్యము. రచన ఇప్పటికీ సాగుతూనే ఉంది.

ఆధ్యాత్మిక ప్రణాళిక ననుసరించి 1962 డిసెంబరులో తమ వృత్తికి మూడు సంవత్సరములు సెలవుపెట్టి Ph.D. పరిశోధన పేర విశాఖపట్టణము వచ్చారు. వీరి రెండవ కుమారుడు వరాహ

మిహిరునకు అపస్మార వ్యాధి (Epillepsy) ఉండేది. ఏ వైద్యము నకు అది కుదర లేదు. వీరు విశాఖపట్టణము వచ్చిన వెనుక హోమియోపతి సిద్ధాంతమును స్వయముగా అధ్యయనము చేసి కుమారుని వ్యాధి నివారణ చేశారు. దానితో హోమియో వైద్య మారంభమయింది. విశాఖపట్టణము District Homoeopathy Association వారు నడుపుతున్న వైద్యబోధన యందు "మెటీరియా మెడికా" ను బోధింపుమని కులపతిని కోరారు. దానితో ఉత్సాహవంతులైన కొందరు యువకుల శిష్యత్వము లభించింది. ఉచిత హోమియో వైద్యము ప్రారంభమైనది. గోవర్ధన్, నరసింహారావు, సత్యనారాయణ మొదలగు ప్రథమ శిష్యులతో నగరము నలుమూలలా పర్యటిస్తూ మందు లిచ్చేవారు. రోగార్తుల సంఖ్య పెరిగిపోయినది. తమ ఇంటి వద్దనే ప్రతిదినము ఉచిత వైద్యసేవ ప్రారంభించారు. కొంత కాలమునకు గోవర్ధన్ యింటివద్ద రెండవ వైద్యాలయము ప్రారంభింప బడినది. నేటికి ఉచిత వైద్యాలయముల సంఖ్య పెరిగిపోయి నగరములందు, పల్లెలయందు కూడ స్థాపించటం జరిగింది.

1963లో ఆల్బర్ట్ శశీ కులపతిని నీలగిరిలో నున్న తన ఆశ్రమమున కాహ్వానించి ఒక నెల దినములు ప్రాచీన భారతీయ ధర్మమును ప్రసంగముల రూపమున నుపదేశ మొందాడు. ఈ ప్రసంగములను, సస్వరముగ వేదాధ్యయనమును టేపురికార్డు చేసికొని అతడు ఐరోపా ఖండమునకు గొనిపోయి తన వివిధ దేశముల శిష్య వర్గముచే అధ్యయనము చేయించాడు. కులపతి, మాస్టర్ సి. వి. వి. చిత్ర పటములను వారి వారి పూజామందిరములలో నిల్పి ధ్యానము సాగించాడు. మరియు కులపతి నిర్దేశించిన ధ్యాన యోగ ప్రణాళిక ననుసరించిన ఆంగ్ల మంత్రములను వారందరిచే దీక్ష చేయించాడు. కులపతి రచించిన "Spiritual Astrology" అను ఆధ్యాత్మిక, సాంకేతిక గ్రంథమును ముద్రణము

చేయించి పాశ్చాత్య దేశములలో జిజ్ఞాసువులకు వెదజల్లాడు. అల్లే అముద్రిత గ్రంథమైన "Spiritual Psychology" అను కులపతి రచనను కూడ వ్యాప్తి చేశాడు. ఈ రెండు గ్రంథములను ఫ్రెంచి భాషలోనికి అనువదించి అందించాడు. ఆ దినములలో తన శిష్య వర్గము, తాను కలసి ఆల్బర్ట్ శశీ కులపతిని పాశ్చాత్య దేశములకు ఆహ్వానించి ప్రవచనములు చేయించ దలచాడు. 1971 లో తానే భారత దేశమునకు వచ్చి విశాఖపట్టణమున కులపతిని కలిసికొని, వారము దినము లున్నాడు. అప్పుడిలా అన్నాడు: "నేను కడు వృద్ధుడ నైనాను. ఈ శరీర మింకెక్కువ కాలము నిలువదు. కనుక మిమ్ము దర్శించి మీ దగ్గర కొన్ని రోజులు గడిపి వెళ్ళదలచాను." చెప్పి నట్లే ఆయన తిరిగి బెల్జియమ్ వెళ్ళిన కొలది దినములకే జెనీవాలో దేహము చాలించాడు. అటుపైన వారి శిష్యులు పట్టుబట్టి 1972లో ప్రథమముగా కులపతిని బెల్జియమ్, ఫ్రాన్సు, స్విట్జర్లెండ్, హాలెండ్, ఇటలీ, లక్జంబర్గ్ దేశములకు ఆహ్వానించారు. వారిచే ఆధ్యాత్మిక విద్యల గూర్చి ప్రసంగములు చేయించి ఆనంద పరవశు లయ్యారు. వారి మూలమున మాస్టర్ సి. వి. వి. మంత్రము ఉపదేశము నొంది ఆ మార్గమునకు చెందిన వారయ్యారు. అందు పలువురు వేదాధ్యయనము, గాయత్రి, త్రికాల సంధ్యావందనము అభ్యసిస్తున్నారు.

1960 సంవత్సరమున గుంటూరులో కొందరు యువక శిష్యు లతో కలసి జనవరి 11, 12, 13 తేదీలలో గురుపూజా మహో త్సవములు చేశారు. అదియే గురు పూజలకు నాంది. అందరూ కుటుంబము యావన్మందితో ఉత్సవమున పాల్గొని పరమ గురువుల నందరి నారాధించటం ప్రారంభించారు. అప్పటి నుండి ప్రతి సంవత్స రము అవే తేదీలలో గురుపూజా మహోత్సవములు జరుగు తున్నాయి. ఆ మూడు దినములు కొన్ని వేలమంది సమావేశమై పూజలలో పాల్గొనటం జరుగుతుంది. ఆ కుటుంబములకు సంబంధించిన

వివాహములు, ఉపనయనములు, అన్నప్రాశనము, అక్షరాభ్యాసము మున్నగు వేడుక లన్నియు ఆ ఉత్సవములలోనే జరుగుతాయి. ఆధ్యాత్మిక ప్రసంగములు, సంగీత, సాహిత్య, లలితకళా విన్యాసములు అహోరాత్రములు జరుగుతాయి. ఇన్నివేల మందికీ భోజన, భాజనాదికముల ఏర్పాటు లన్నీ పుష్కలముగా జరుగుతాయి. 1962 నుండీ కులపతి విశాఖపట్టణ వాస్తవ్యులైరి గనుక గురుపూజలు విశాఖపట్టణములోనే జరుగుతున్నవి.

వృత్తుల నుండి భారతీయుల దృష్టి నౌకరీల పైకి వ్యామోహపడి ప్రసరించటం — బ్రిటీష్ వారికి దాస్యము చేయుచున్న కాలమున మెకాలే విద్యా విధానము వలన కలిగింది. నాటి నుండీ భారతదేశము వారు తమకు లేని పేదరికమును, దారిద్ర్యమును ఆహ్వానించుకొన్నారని కులపతి నిర్ణయము. దీనికి పరిష్కారము ఆర్థిక, రాజకీయ ప్రణాళికలలో లేదు. ఉద్యోగముల వేటలో తమ వయస్సును కాల్చుకొనుట మాని, యువకులు కుల క్రమాగతములైన వృత్తు లవలంబించాలి. బస్తీలలో వృత్తులు, ఆహారము, ఇల్లు, వస్త్రము మున్నగు ముఖ్యావసరములను తయారు చేయగలిగినవి కావు. కనుక ఈ ముఖ్యావసరములు తీరిన తరువాతనే బస్తీల వృత్తులు పనికివస్తాయి. అలా కానిచో దేశ దారిద్ర్యమునకు తోడ్పడతాయి. చదువులకు, ఉద్యోగములకు అని వంక పెట్టుకొని కుటుంబములు గ్రామములలో జీవనోపాధులు విడిచి బస్తీలలో గుమిగూడుట జరుగుతున్నది. ఇది సోమరితనమునకు లక్షణము. ఇట్లు కనుగొనిన దేశ జాతీయ సమస్యల మూల సూత్రములతో కులపతి తన అనుయాయులైన యువకులకు ఈ దిగువ ప్రణాళిక నేర్పరచారు.

1. నేటి విద్యా విధాన మందలి ఉన్నత విద్య నభ్యసించటం మాని 5) శాతము యువకులు వృత్తుల నభ్యసించాలి. వానికి

సరిపడిన లోకజ్ఞానపు చదువు చాలును. దీనికి డిగ్రీలతో నిమిత్తము లేదు.

2. ఈ యువకులు తమ పిల్లలను కూడ కాలేజీల, విశ్వవిద్యాలయముల ఉన్నత విద్య చెప్పించుటలో నెక్కువ సంవత్సరములు, ధనము వ్యర్థము చేసికొనరాదు.

3. వృత్తులను నేర్పు ప్రత్యేక విద్యాలయములు స్థాపించుకొన వలయును.

4. యువకులు స్వతంత్రముగా నిత్యోపకరణములను తయారుచేయు పరిశ్రమలను స్థాపించుకొన వలయును. ఉద్యోగములలో చేరరాదు.

5. ఇట్టి విద్యావంతులైన యువకులలో కొందరు తమ కుటుంబములతో గ్రామముల లోనికి మరలి వెళ్ళి గ్రామోద్ధరణకై వాతావరణము కల్పించాలి. అవశ్యకమైనచో కొన్ని కుటుంబములు కలిసి చిన్న చిన్న ఆదర్శ గ్రామములను నిర్మాణము చేసుకోవాలి. ఈ ప్రణాళిక ననుసరించి కులపతి తన కుమారులను, మరికొందరు యువకులను కార్యక్రమములోనికి దింపిరి. అప్పటికే సంస్కృత వాఙ్మయమున M. A. పట్టభద్రుడైన జ్యేష్ఠ కుమారుడు అనంతకృష్ణచే "వాణి ప్రింటర్సు" ముద్రణాలయమును స్థాపింప చేశారు. రెండవ కుమారుడు వరాహ మిహిరుడు, మరికొందరు యువకులు కలసి "హటీక్ యిండస్ట్రీస్" అను పేరున శాస్త్రీయ ఆయుర్వేద సమ్మతముగా నిత్యోపకరణములు తయారు చేయు సంస్థను నెలకొల్పారు.

6. ప్రాచ్య పాశ్చాత్య ఆధ్యాత్మిక సమన్వయమునకు, ఆర్థిక, సాంఘిక పరిపుష్టమైన ఆధ్యాత్మిక సోదరత్వ జీవనమునకు అనుకూల్యతను సాధించుటకై 1972లో "The World Teacher

Trust" స్థాపించారు. [ఇప్పటికి బెల్జియం, ఫ్రాన్సు, స్విట్జర్లెండు దేశములలో ఈ సంస్థయొక్క దేశీయ కేంద్రములును, ఆశ్రమములును పని చేస్తున్నవి.] తమ ఉద్యమమునకు జీవితము సంకితము చేయుటలో Caltex Company లో ఉన్నతోద్యోగమును పరిత్యజించిన P. S. S. Varma గారిచే అంతర్జాతీయ వాణిజ్య సంస్థ యగు 'Mithila Exports' ప్రారంభింప జేశారు. కులపతి సందేశములను గ్రంథముల రూపమున అంతర్జాతీయ ప్రసారము చేయుటకై 'Mithila Publishing House' స్థాపించబడింది. కుటుంబ మంతయు కులపతి ఉద్యమమునకు అంకితమైన చింతలపాటి వెంకట సూర్యనారాయణరాజుగారి పుత్రులగు Ch. S. N. రాజు, సత్తిబాబులచే W. T. T. గ్రంథ ప్రచురణ సంస్థ నిర్వహింపబడు తున్నది. ఈ సంస్థల సమీకరణము వివిధ ప్రాంతముల అభివృద్ధి, విస్తారతల ప్రయత్నములకై M. R. L. రావు అను యువకుడు తన జీవితము అంకితము చేశాడు. అనేక వైద్యాలయములతో వృద్ధి చెందుతున్న హోమియో వైద్యసేవ ప్రణాళికలో కొన్ని వందల మంది యువకులు, యువతులు, బాలురు, వృద్ధులు అన్ని నగరములలోను కృషి చేస్తున్నారు. కులపతి ప్రణాళికకు కావలసిన విద్యావిధానము ప్రాథమిక దశలో సమకూర్చుటకు జీవితము సంకితము చేసిన ఎమ్. కృష్ణస్వామి పల్లెలలోను విశాఖలోను జనకులము విద్యాలయములు నెలకొల్పాడు. ఖర్గపూరులో పి. కామేశ్వరరావు, విశాఖలో ఏ.ఎల్.ఎన్. రావు, కె. కామేశ్వరరావు. విజయవాడలో పి. పురుషోత్తం, జి. వి. వి. నాగేశ్వరరావు, గుంటూరులో జి. ఎల్. ఎన్. శాస్త్రి, హైదరాబాదులో పి. జగన్మోహనరావు నిరంతర కృషి చేస్తూ సంస్థలను నిర్వహిస్తున్నారు. ఆదర్శ గ్రామ నిర్మాణమునకై సింహాచలము సమీపమున చినముసలివాడ గ్రామము దగ్గర "W. T. T. Housing Colony" ప్రారంభింప బడింది.

వేద వాఙ్మయము సామాన్య ప్రజలకు అందుబాటు చేయుటకై ఋగ్వేద సూక్తములు టీకా తాత్పర్యములతో రహస్యోపదేశములతో బోధిస్తూ కులపతి గ్రంథ రూపమున రచన చేస్తున్నారు. ఇవి అందరి కందుబాటులో ఉండేటట్లు చిన్న గ్రంథ మాలలుగా వెలువడుతాయి. అట్లే రామాయణము, భారతము మొదలగు పురాణములకును, ఉపనిషత్తులకును ప్రకాశకమైన బోధన, గ్రంథ రచన అనుదినము సాగుతున్నది. ఇందు మరియొక విశేషము : వేదము నందలి, ఉపనిషత్తుల యందలి ధర్మ స్వరూపము యొక్క సమన్వయము భాగవతమున వ్యాసునిచే సంతరింపబడినది. అది స్వయం సంపూర్ణమైన, ఆచరణీయమైన వేదగ్రంథమనియు, దాని రహస్య వివరణము నిత్య జీవితమునకు మార్గము నిచ్చుననియు నిదర్శన పూర్వకముగా స్థాపించిరి. భాగవత రహస్యార్థ ప్రకాశమును పలు సంపుటముల గ్రంథముగా రచించి ప్రచురించుచున్నారు. సంప్రదాయ రహస్యములు జాతీయ జీవనమునకు వెన్నెముక వంటివి. వానిని తల్లిదండ్రులు పిల్లలకు బోధించుకొనునట్లుగా తెనుగున 'బాలశిక్ష'ల రూపమున కులపతి అందిస్తున్నారు.

భారత భూమి యందు అవతార పురుషులు, గురువులు నెలకొల్పిన సంస్థలు వారి సామర్థ్యము పైననే ఆధారపడి యుండి, వారి అనంతరము మూలపడుట జరుగుతున్నది. ఇట్లు జరుగరాదని కులపతి సంకల్పము. కనుకనే బోధనలు చేయుటకన్న వ్యక్తులను తయారు చేయుట, వారికి నైతికము, సంస్కారమయము అగు రెండవ జన్మ కల్పించుట వీరి సంకల్పము.



# మాస్టరుగారితో పరిచయం

మన మాస్టరుగారు, కృష్ణమాచార్యులుగారు మాకు చిర పరిచితులు. ఈ పరిచయం ఎంతకాలం నుంచి? అంటే సరైన జవాబు మాకు తెలియదు. కారణం మనవి చేస్తాను.

గురుపాదులు (శ్రీ) వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని మొట్ట మొదటగా నేను తిరుపతిలో కలుసుకున్నాను. అప్పుడు శాస్త్రిగారు "ఏమయ్యా! ఇది వరకు నీవు, నేను చాలాసార్లు కలిసి పనిచేశాము కదా!" అన్నారు. "మనం ఇదివరకెప్పుడూ కలుసుకోలేదు. నేను తిరుపతి వచ్చి మిమ్మల్ని కలుసుకోవడం ఇదే మొదటిసారి." అన్నాను నేను. ఆయన నవ్వి, "మనం ఇంతకుముందు చాలాసార్లు కలుసుకున్నాం. తర్వాత కూడా చాలాసార్లు కలుసుకుంటాం, కలిసి పని చేస్తాం. జాగ్రత్తగా ఆలోచించి చూడు!" అన్నారు. ఆ మాటల్లోని అంతరార్థం గ్రహించడానికి నాకు చాలా కాలం పట్టింది. శాస్త్రిగారు నాతో 1950 వరకు కలిసి ఉన్నారు. అంత వరకు వారితో కలిసి నేనూ యోగకార్యక్రమాల్లో పాల్గొన్నాను. 1950 లో శాస్త్రిగారు భౌతిక దేహాన్ని త్యజించారు. అయినా, ఆయన సాన్నిధ్యాన్ని మేము నిరంతరమూ అనుభవిస్తూనే ఉన్నాము. ఇప్పుడు మేము ఏపని చేస్తున్నా, ఏగ్రంథం వ్రాస్తున్నా ఆయన ఆశీర్వచనం, ఆయన అనుగ్రహం, ఆయన

సంకల్పమే! ఇది కేవలం అనుభవించ వలసిందే! స్మరించినంత మాత్రంచేత ఆయన సాన్నిధ్యం మాకు ఇప్పటికీ లభిస్తూనే ఉంది.

ఇలాంటి అనుభవమే మాకు కృష్ణమాచార్య గారితోనూ ఉంది. ఆయనను మొట్టమొదటి సారిగా కలుసుకుని మాట్లాడి నప్పుడు, అది ఎన్నో నాళ్ల, ఎన్నో ఏళ్ల పరిచయంలాగా అనిపించిందేగాని, క్రొత్త అనిపించ లేదు. నేను ఆయనను చూడడం అదే మొదటిసారి అనేది వాస్తవమే! అంతకుముందు చాలా కాలం నుంచీ నే నాయనను ఎరుగుదును అన్న అనుభవమూ సత్యమే! ఈ రెండు పరస్పర విరుద్ధమైన అంశాలూ, విరోధా భాసంలాగా భాసించాయి – నా జీవిత కావ్యంలో. ఈ రెండింటి మధ్య సమన్వయం ఉన్నదని తెలియడమే మనలో ఒక అతీత ప్రజ్ఞ మేల్కొనడానికి నాంది అవుతుంది. "ఇకముందు కూడా మనం కలిసి ఉంటాం; కలిసి పని చేస్తాం" అన్న ప్రభాకరశాస్త్రి గారి లీలా వాక్కులలోని అంతరార్థం, నేను మాస్టరు గారిని కలుసుకున్నాక భాసించడం మొదలైంది. శరీరాలు వేరైనా, లోన వెలిగే వెలుగు మాత్రం ఒక్కటే అన్న సత్యం అనుభవ మైంది.

## వెలుగు రేకలు

నేను మాస్టరు గారితో (కృష్ణమాచార్య గారితో) మొట్ట మొదటగా మాట్లాడడం నిడుబ్రోలులో జరిగింది. దాదాపు ఇరవై సంవత్సరాల క్రిందటి కథ యిది. ఆ మొట్టమొదటిసారి ఆయన నాతో ఆదరంగా, వాత్సల్యమయంగా మాట్లాడిన మాటలు నాలో మెదులుతూనే ఉన్నాయి. 1950 లో జరిగిన ఒకానొక సూర్యాస్తమయం తర్వాత అప్పుడే ఉషోదయ రేఖలు నాకు కనిపించిన మొదటి అనుభూతి అది. ఆ సమావేశ మంతా

ఇప్పటికీ నా కన్నుల ముందు మెదులుతూనే ఉంటుంది. ఆ అనుభూతి అలాంటిది!

మాస్టరు గారు ఆరోజున నన్నిలా అడిగారు. "ఇక్కడున్న యోగమిత్రుల్లో ఎవరైనా మాస్టరు సి. వి. వి. గారిని గురించి చెప్పగలవారు ఉన్నారా? ఉంటే వారి యోగ మార్గాన్ని గురించి కొంచెం వివరించ మనండి - విందాం. నేను అందుకే వచ్చాను." ఇది ఆయన కేవలం మాటవరసకి అడగలేదు. నిజంగానే ఎవరైనా చెబుతే వినడానికి సిద్ధంగా అడిగారు. అయితే, "ఎవరూ లేరు. మీరే మాట్లాడండి" అన్నాను నేను. మాస్టరు గారు మాట్లాడడం ప్రారంభించారు. రెండు మూడు ముక్కలు మాత్రమే చెబుతాను - అని ప్రారంభించిన మాస్టరుగారు మూడు గంటలు చెప్పారు. మూడు గంటలు చెప్పారని ఉపన్యాసం అయిన తరువాతనే మా కందరికీ తెలిసింది. మాస్టరు సి. వి. వి. గారిని గురించి, కుంభకోణంలోని యోగ కేంద్రాన్ని గురించి, యోగ సాధనను గురించి గంగా ప్రవాహంలాగా ప్రసంగించారు. వింటున్నంత సేపూ తన్మయులమై కరిగిపోవడమేగాని, విషయంలోని వివరాలు గుర్తు ఉండడం జరగదు. చక్కెర తింటున్నంత సేపూ, ఆ తీపిని అనుభవించడమే తప్ప, చక్కెరను గురించిన వివరాలు గుర్తుండవు గదా! ఇలాంటి అనుభవం నా కొక్కడికే కాదు, విశాఖపట్టణంలోని యోగ మిత్రులలో చాలా మందికి తెలుసు.

### ఆనందలహరి

విశాఖపట్టణంలోని రైల్వే వైర్ లెస్ కాలనీ శ్రీరామాలయంలో మాస్టరుగారి ఉపన్యాసాలు జరుగుతూ ఉండేవి. భారతం, రామాయణం, వేదం, ఉపనిషత్తులు, భగవద్గీత, దివ్యజ్ఞానం మొదలైన పుణ్య గ్రంథాల ప్రవచనం జరుగుతూ ఉండేది. వాటిని వినడానికి వచ్చేవారిలో ఇంజనీర్లు, డాక్టర్లు,

ఆఫీసర్లు, గుమాస్తాలు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, ఇంకా ఎన్నో రకాల వ్యక్తులు ఉండేవారు. అందరికీ రకరకాల మనస్తత్వాలు, అభిరుచులు ఉన్నాయి. ప్రసంగం పూర్తయిన తరువాత, అక్కడి శ్రోతలలో చాలా పెద్దవారిని, శ్రద్ధగా విన్నవారిని నేను ఇలా అడిగే వాడిని : "అయ్యా! ఇవాళ మాస్టరు గారు చెప్పిన విషయ మేమిటి ?" వారు ఇలా జవాబు చెప్పేవారు : "ఏం చెప్పారో వివరాలు ఇప్పుడు చెప్పమంటే చెప్పలేముగాని, ఇప్పుడు ఎంతో హాయిగా ఉంది. శరీరం అంతా తేలికైపోయినట్లు ఉంది. సమస్య లన్నీ తీరిపోయినట్లు, లోకమంతా వెలుగుతో నిండినట్లు ఉంది. ఇలాంటి అనుభూతి ఇంకెక్కడా ఎరిగినది కాదు. ఇది ఒక చిత్ర మైన అనుభవం." ఎన్ని సార్లు ఎందరిని అడిగినా ఇలాంటి జవాబే వచ్చింది. ఇది వారికి మాస్టరుగారి యెడల గల భక్తి ప్రపత్తు లతో చెప్పే విషయం మాత్రం కాదు. ఆయన వాక్కులలో గల మంత్రజాలం అటువంటిది. ఆయన ఉపన్యాసాలు ఏరోజు కారోజే సరిక్రొత్తగా ఉన్నట్లుంటాయి. సూర్యోదయం రోజూ జరుగు తున్నదే అయినా, చూడగల వాళ్లకి ఏరోజు కారోజే నిత్యనూత నంగా ఉంటుంది. సృష్టిలో ఉన్న ఈ నిత్యనూతనత్వం అనే మహావిద్య మాస్టరుగారి వద్ద ఉంది. ఆయన మొదలుపెట్టినది భారతమైనా, రామాయణమైనా, భాగవతమైనా, ఉపన్యాసం పూర్తి అయ్యేసరికి ఎన్నో పురాణాలు, శాస్త్రాలు ధారావాహి కంగా దొర్లిపోతాయి. ఆయనకు తెలియని విషయమంటూ ప్రపంచంలోనే లేదేమో! ఫిజిక్సు, కెమిస్ట్రీ, బయాలజీ, మాగ్నె టిజం, హీట్, లైట్, సౌండ్ — ఒక్కటేమిటి అణువు నుంచి ఆకాశం వరకు, పిండాండం నుంచి బ్రహ్మాండం వరకు ఎన్నో శాస్త్రాలు చెబుతారు – అవసరాన్ని బట్టి. ఆయన ఉపన్యాసంలో ప్రధానమైనది ఆనంద స్రవంతి. దానికి అంగములుగా అనేకానేక విషయాలు వస్తూ, పోతూ ఉంటాయి. 'మాస్టరుగారు ఒక విజ్ఞాన సర్వస్వమే' అనిపిస్తుంది.

అయితే ఇన్ని విషయాలు తెలియడం అంత గొప్ప విషయమా? అంతే, గొప్ప విషయం కాదు గాని, తెలిసినది చెప్పగలగడం, అందులోనూ అందరికీ తెలిసేటట్లు చెప్పగలగడం, జటిలమైన విషయాలని విసుగు కలగకుండా చెప్పగలగడం విశేషమే!

## లీలా విశేషం

ఇక్కడ మనకి తెలియవలసిన విషయం మరొక్కటి ఉంది. రామాయణంలో నైనా, భారతంలో నైనా, బైబిలులో నైనా, మరే దివ్యగ్రంథంలోనైనా ఉన్న ధర్మం ఒక్కటే. సత్యం ఒక్కటే. ఈ ఒక్క విషయం తెలియకనే లోకంలోని మానవులు ఇన్ని మతాలుగా, ఇన్ని మార్గాలుగా చీలిపోయి అడ్డుగోడలు కట్టుకున్నారు. ఇన్నింటిలోనూ ఒకే సమన్వయం అంతర్లీనమై ప్రవహిస్తోంది. అదే మానవుని హృదయ ధర్మం; అదే దివ్యప్రేమ; అదే భగవంతుని మందహాసం; ఈ మోహన కృష్ణుని మురళీరవళి మాస్టరుగారి ఉపన్యాసాలలో నాదంగా ప్రవహిస్తూనే ఉంటుంది. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు-అందరూ ఒకే వెలుగుయొక్క లీలావతారాలు. సూర్యుడు అమెరికాలోనూ, ఇంగ్లాండులోనూ, ఇండియాలోనూ వేర్వేరుగా ఉదయించినట్లు కనబడినా, సూర్యుడు ఒక్కడే. ఎవరు జీవించినా ఆ వాయువునే పీల్చాలి. ప్రకృతిని అర్థం చేసుకున్న ఎవరికయినా శాశ్వత సత్యధర్మాలు అర్థం అవుతాయి. మాస్టరుగారి ఉపన్యాసాలు వినే ప్రతి వ్యక్తికీ ఈ దర్శనం, ఈ సమన్వయం లభిస్తాయి. ప్రసంగం పూర్తి అయ్యేసరికి, ఆ శాశ్వత ధర్మం మనలో ప్రవేశించి, మన అర్హతా సంస్కారాలను బట్టి మనలను తనలో కరిగించుకుంటుంది. అందుకే ఆయన ఏం చెప్పారో వివరాలు గుర్తుండడం కష్టం. మనం ఆ ధర్మాన్ని ఆచరిస్తూ, క్రమంగా మనం ఆ ధర్మంగా మారడం ఉంటుంది. అంతేగాని మనం వేరుగా, ధర్మం వేరుగా ఉండి,

ఆ ధర్మాన్ని అర్థం చేసుకోవడం అనేది ఉండదు. అయస్కాంతంతో ఇనుపముక్కను రుద్దుతూ ఉంటే, ఆ అయోమయం అయస్కాంతంగా మారుతుంది. ఇదీ అటువంటిదే!

### గురుపూజా సమావేశం

చాలా రోజుల తర్వాత నేను మాస్టరుగారిని కలుసుకున్నది, ప్రతి సంవత్సరం జనవరి 11, 12, 13 తేదీల్లో జరిగే గురుపూజల లోనే. ప్రారంభించిన నాటినుంచీ నేటివరకూ గురుపూజలు ఆ తారీకుల్లోనే జరుగుతూ ఉండడం, వేలకొద్దీ యోగమిత్రులు హాజరు కావడం, మాస్టరుగారి సాన్నిధ్యాన్ని అనుభవించడం, ఆ సాన్నిధ్య ప్రభావం వలన ఆ సంవత్సర మంతా ఆనందమయంగా గడిపి మళ్ళీ గురుపూజలు ఎప్పు డెప్పుడా అని ఎదురు చూడడం— ఇవన్నీ ఇన్ని సంవత్సరాలనుంచీ జరుగుతూనే ఉన్నాయి. ఇక ముందు కూడా జరుగుతూనే ఉంటాయి.

గురుపూజలు ప్రారంభించిన మొదటి సంవత్సరం చాలా కొద్ది మంది సాధకులు మాత్రమే పాల్గొన్నారు. రెండవ సంవత్సరం ఆ సంఖ్య కొద్దిగా పెరిగింది. ఇతర ప్రదేశాల నుంచి కూడా సాధకులు వచ్చి పాల్గొనడం ప్రారంభించారు. మూడవ సంవత్సరం బృందం చాలా పెద్దదయింది. అందరి భోజనాలకు, వసతికి ఏర్పాట్లు అక్కడే జరిగాయి. నేను హాజరైనది నాలుగవ సంవత్సరం గురుపూజలకు.

### మధురమైన ఆహ్వానం

నాలుగవ గురుపూజా మహోత్సవాలకు మేము కొంతమంది యోగమిత్రులం వచ్చి, వాల్తేరు రైల్వేస్టేషనులో దిగాము. తెల్లవారుజామున నాలుగు గంట లయింది. శీతాకాలపు మంచు తెరల మధ్యనుంచి కొందరు వాలంటీరు సోదరులు మధురమైన మందహాసాలతో మాకు ఎదురు వచ్చారు. సామానులు దించ

డంలో సహాయం చేశారు. స్టేషను బయట రెండు చిన్న కార్లు, ఒక వాను నిలబడి ఉన్నాయి. సామానులు వానులో ఎక్కించి మేము కార్లలో సమావేశ స్థలానికి వెళ్లాము. చిన్న సందులో ఉన్న పెద్ద ట్యుటోరియల్ కాలేజీ అది. పెళ్లివారి యిల్లులా చాలా కోలాహలంగా ఆనందోత్సాహాలతో తుళ్లింతలాడుతున్నది. అప్పుడే అందరూ ప్రేయరుకి సిద్ధమవుతున్నారు. సరిగ్గా ఆరు గంటలకి మాస్టరుగారు ప్రేయరు ప్రారంభించారు.

"నమస్కారం మాస్టర్
నమస్కారం మాస్టర్ ఎం. ఎన్.
నమస్కారం మాస్టర్ సి. వి. వి.
నమస్కారం మాస్టర్ సి. వి. వి.
నమస్కారం మాస్టర్ సి. వి. వి.

టు యువర్ లోటస్ ఫీట్"

మాస్టరుగారు అంటూ ఉంటే అందరూ ఏక కంఠంతో ఈ వాక్యాలు ఉచ్చరించారు. ఆ ఉచ్చారణలోని నాదం చక్కని దివ్యానుభవాన్ని కలిగించింది. వినగలిగిన వారికి అందరిలో నుండి మాస్టరుగారి ఉచ్చారణ వినబడుతుంది. ఆ వినగలగడం కూడా వారి అనుగ్రహమే! ప్రేయరు అయిన తర్వాత మాస్టరుగారు వేదికపైన కొంచెం ముందుకు వచ్చి కూర్చున్నారు. ఆయనకు ఒక ప్రక్కన అరటిపళ్లు రాశిగా పోసి ఉన్నాయి. మరో ప్రక్కన తాంబూలాలు రాశిగా ఉన్నాయి. అందరూ వారికి పాద నమస్కారాలు చేయడం ప్రారంభించారు. నమస్కారం చేసిన వారిని మాస్టరుగారు ఆశీర్వదించి అరటిపళ్లు, తాంబూలం ప్రసాదంగా యిచ్చారు. తరువాత మాస్టరు సి.వి.వి. గారి యోగ మార్గాన్ని గురించి కొన్ని విశేషాలు ప్రసంగించారు. ఆ తరువాత భోజనాలకు ఏర్పాట్లు జరిగాయి.

## అందరూ సోదరులే!

గురుపూజలకు వచ్చే సోదరులకు వినయంతో పొదిగిన క్రమశిక్షణ ఒక అలంకారం. అక్కడ పని చేసే వారందరూ ఆఫీసర్లు, లెక్చరర్లు, యూనివర్సిటీ స్టూడెంట్లు, ఉన్నత కుటుంబీకులే! కానీ అందరూ నవనాగరిక జీవితానికి అలవాటు పడిన ఈనాటి నగరవాసులు. నడుముకు తుండుగుడ్డ కట్టుకుని, అన్నం పళ్లెం, కూరలగుత్తి చేతబట్టుకుని వడ్డనకు దిగారంటే ఆశ్చర్యమే! పాశ్చాత్య విద్యావిధానంలో దిగబడి, ఉద్యోగం వచ్చిందంటేనే ఒక మహావరంగా భావించి, ఆఫీసరు అయితే ఇక ఇంద్రపదవినే అధిష్ఠించినట్లు భావించే నేటికాలంలో, ఆ ఆఫీసర్లు తమ ఆఫీసులో పనిచేసే గుమాస్తాలకే సేవలు చేస్తున్నారంటే ఎంతో విశేషం కదా! యూనివర్సిటీ లెక్చరర్లకు, విద్యార్థులకి మధ్య ఎలాంటి సంబంధాలు ఉన్నాయో మనకు తెలియనిది కాదు. అలాంటిది, ఆ లెక్చరర్లు, విద్యార్థులు ఒకే తల్లి పిల్లలుగా అరమరికలు లేకుండా మెలగుతున్నారంటే అది మాస్టరుగారి సాన్నిధ్య ప్రభావమే! ఇంతకంటే యోగమంటే వేరే ఏముంది? గురుపూజలు యోగసాధన నుండి యోగసిద్ధిని ప్రసాదిస్తాయి.

## యోగస్థితిలో యోగం.

మాస్టరుగారు చిరునవ్వుతో యోగసాధనను గురించి ఉపన్యసిస్తూ ఉంటారు. ఆ చిరునవ్వు వెనుక ఏముంటుందో తెలుసా? "యోగసాధనను గురించి ఇంత విపులంగా వింటున్న మీరు ఉన్నది యోగస్థితిలోనే!" అన్నట్లు ఉంటుంది ఆ చిరునవ్వు. మాస్టరుగారి యోగమార్గంలో ఉండే ప్రత్యేకత అదే! నిజమైన యోగంలో వివరించ వలసినది, బోధించ వలసినది అంటూ ఉండదు. యోగస్థితిని అనుభవిస్తూ అందులో నివసించ

డమే ఉంటుంది. వివిధంగా ఉన్న ప్రజ్ఞలు ఒకే ప్రజ్ఞగా జీవించడం యోగం. వేర్వేరు ప్రజ్ఞలుగా ఉన్న సోదరులు అందరూ గురుపూజలలో మాస్టరుగారి సన్నిధిలో ఒకే ప్రజ్ఞగా ఉండడం మనకు దర్శన మిస్తుంది. "As it is above, so it is below" అనే సత్యం మన కిక్కడ కనిపిస్తుంది. గురుపూజల వెనుక జరుగుతున్న ఒక నాటక మిది. దీన్ని గురించి మరోచోట విపులంగా ముచ్చటించుకుందాం.

### "ఇది మీ యిల్లే"

భోజన సమయానికి నేను కొంచెం మొగమాట పడ్డాను. క్రొత్తగదా! మా అమ్మాయిగారి యింటికి బయలుదేరాను భోజనం చేసి వద్దామని. ద్వారం దగ్గర కొందరు సోదరులు నన్ను ఆపు చేశారు. "భోజనం చేయకుండా వెళుతున్నారా? వెళ్లేముందు మాస్టరుగారితో చెప్పారా?... అయ్యో! అలా వెళ్లిపోతే ఎలా?... ఉండండి..." అంటూ ఒకరు వెళ్లి మాస్టరుగారితో చెప్పి వచ్చారు. మాస్టరుగారు నవ్వుతూ నా వద్దకు వచ్చారు. ఉన్న ఇంద్రజాలం, మంత్రజాలం... అంతా ఆ నవ్వులోనే ఉంది. ఆ నవ్వే గోపికలను సమ్మోహన పరచింది. ఆ నవ్వే అర్జునునికి గీతోపదేశం చేసింది. ఆ నవ్వే తపోనిష్ఠులైన మహర్షులకు జ్ఞానాన్ని ప్రసాదించింది. ఆయన యిలా అన్నారు. "మీరు ఇంటికి వెళ్లి భోజనం చేసి వస్తామన్నారట! మరి ఈ ఇల్లెవరిది?" ఇంక నేను మాటాడలేదు. ఆయన వెంట వెళ్ళి ఆయనతో భోజనం చేశాను.

### మూడవ సాన్నిధ్యం

మాస్టరుగారితో నా మూడవ పరిచయంగా చెప్పుకోదగినది మిథిల గురుపూజల సందర్భంలో.

1974వ సంవత్సరం జనవరిలో గురుపూజలు 'మిథిల'లో జరిగాయి. గుంటూరు నుంచి పదిమంది యోగ మిత్రులం కలిసి బయలు దేరాము. సాయంత్రం అనకాపల్లిలో దిగి, అక్కడినుంచి పాడేరు బస్సులో బయలు దేరాము. బస్సు మధ్యలో ఒక ఊళ్లో ఆగి పోయింది. అది అక్కడే ఆగుతుందట. మేము భోజనాలు చేసుకుని సిద్ధంగా ఉంటే మరో బస్సులో పంపుతామని బస్సువాళ్లు చెప్పారు. చెప్పినట్లే మరో బస్సులో గురుపూజలు జరిగే చోటుకు సమీపంలో రోడ్డుమీద దింపి, ఆ బస్సువాళ్లు వెనక్కి తిరిగి వెళ్లి పోయారు. అప్పటికి రాత్రి 10 గంట లయింది.

అక్కడినించి కొండల సందులలో నుంచి, గుట్టలమీదనుంచి, వాగులలో నుంచి దారి చూసుకుంటూ గురుపూజల ప్రదేశానికి చేరవలసి ఉంది. అంతా దట్టమైన అడవి. మాకు అంతా కొత్త. రాత్రివేళ చిమ్మచీకటిలో కన్ను పొడుచుకుని కాలిదారులు చూసుకుంటూ, అడ్డంగా ఉన్న వాగు దాటి, పెద్దగుట్ట ఎక్కాము. మాస్టరుగారు ఉన్నారన్న ధైర్యం ఒక్కటే తప్ప, ఆ కొండమీద నడుస్తుంటే ఎటునుండి ఎటుపోతామో తెలీదు. ఇంకొక భయం కూడా కలుగక పోలేదు. పాడేరు ప్రాంతంలో పులు లున్నాయని ప్రతీతి! ఇలా ఒకప్రక్క భయం, మరో ప్రక్క మాస్టరుగారు ఉన్నారన్న ధైర్యం, మధ్యన నలుగుబాటు. కొంత దూరం నడిచాక మాకు దారి తెలియలేదు. గట్టిగా కేకలు వేసి పిలిచాము. మా పిలుపు అక్కడివారికి అందింది. "ఇటు రండి" అని జవాబు వినిపించింది మాకు. ఆ పిలుపు వెంబడి ప్రయాణం చేసి గురుపూజల స్థలాన్ని సురక్షితంగా చేరుకున్నాము. కాళ్ళు చేతులు కడుక్కొని సేద తీర్చుకునే సరికి భోజనం సిద్ధమైంది. భోజనాలు చేసి ఆ రాత్రి హాయిగా నిద్ర పోయాము.

## సుప్రభాతం

ఉదయమే లేచి ప్రేయరుకు అందరం వేదిక వద్దకు చేరు కున్నాము. ఉదయ సూర్యుని హిరణ్మయ కాంతులలో ఆ అచ్చ మైన ప్రకృతి అతి మనోహరంగా ఉంది. మూడు వైపులా కొండలు. కొండలమీద పచ్చపచ్చని చెట్లు. ఒక కొండ పేరు 'మునులగుట్ట'. మరో కొండపేరు 'గోవర్ధనగిరి'. ఆ రెండు కొండల నడుమ ఒక సెలయేరు. పేరు 'చంద్రికళ' అట! సంవత్సరంలో కొన్ని ఋతువుల్లో ప్రవహించి, కొన్ని ఋతువుల్లో ఎండిపోతుంది గనుక మాస్టరుగారే ఆ పేరు పెట్టారు. ప్రక్కనే వ్యవసాయపు భూము లున్నాయి. పర్ణశాలలవంటి తాటాకు పాకలు నాలుగు బలంగా కట్టబడి ఉన్నాయి. ఒకటి ప్రార్థనామందిరం. రెండు పర్ణ శాలలు, సోదర బృందము యొక్క వసతికోసం. నాలుగవది వస్తు భాండాగారం. ముందు ఆ ప్రదేశాన్ని చూచిన చాలామందికి "ఇక్కడ అసలు గురుపూజలు ఎలా జరుగుతాయి?" అనే సందేహం వచ్చింది. నీళ్లు ఎలా దొరుకుతాయి? కూరగాయలు, పాలు మొద లైనవన్నీ ఎలా వస్తాయి?–ఇలా ఎన్నో అనుమానాలు కలిగాయి. ఇప్పుడు చూస్తే, అప్పటికే వంటలకు కావలసిన పదార్థాలన్నీ వచ్చి ఉన్నాయి. టాంకులలో మంచి నీళ్లు వచ్చాయి. సాయంత్రం అయ్యేసరికి జనరేటర్ల సహాయంతో విద్యుద్దీపాలు వెలుగుతూ దేదీప్యమానంగా ఉన్నాయి. ఏమిటిదంతా, మాయా బజారు కాదు గదా! – అనిపించింది.

మరునాడు ప్రేయరు అయిన తర్వాత ఉపనయనాలు, అక్షరాభ్యాసాలు, అన్నప్రాశనలు అయినాయి. మాస్టరుగారు అక్షరాభ్యాసాన్ని గురించి చక్కగా వివరించారు. తర్వాత ఉప నయనాలను గురించి, గాయత్రీ మంత్రాన్ని గురించి, ఆ మంత్రోప దేశాన్ని గురించి హృదయానికి హత్తుకునేటట్లు వివరించారు.

సటువు లందరి చేతా, సదస్యుల చేతా గాయత్రీ మంత్రాన్ని ఉచ్చరింప జేశారు. "గాయత్రి అంటే ఒక వెలుగు. అది ఒక కాలానికి గాని, ఒక దేశానికి గాని, ఒక జాతికి గాని, ఒక వర్గానికి గాని సంబంధించినది కాదు. ఎవరైనా గాయత్రీ మంత్రాన్ని జపించవచ్చు. అది జపించాలని సంకల్పం కలగడమే అర్హత. అంతకు మించిన హద్దులు వేరే లేవు. పరమ పవిత్రమైన గాయత్రీ మంత్రాన్ని ఉచ్చరించిన వారి బుద్ధులు గాయత్రిచే ప్రేరేపింపబడి, గాయత్రిగా మారుతాయి." అన్నారు మాస్టరు గారు. గాయత్రీ స్వరూపమైన వారి వాక్కులు శ్రద్ధతో వినడమే గాయత్రిని ధ్యానం చేయడం అవుతుంది అనిపించింది. ఈ సందర్భం లోనే మాస్టరుగారు ఒక సన్నివేశం వివరించారు. శ్రీమద్రామా నుజాచార్యుల వారు తమ గురువుగారి ఆజ్ఞను లెక్క చేయక, ఒక గుడిగోపురంపైకి ఎక్కి, వేలాది జనులకు కులమత వివక్ష లేకుండా అష్టాక్షరీ మహామంత్రాన్ని ఉపదేశించారట. ఏదైనా ఒక మంత్రోపదేశం చేయాలంటే ముప్పైమూడు లెక్కలు వేసే నడమంత్రపు గురువుల సంప్రదాయానికి ఇది విరుద్ధమైనది.

## ఉపదేశం

ఇది వింటూంటే నాకొక విషయం గుర్తుకొచ్చింది. అప్పుడు నేను మా సూర్యంతో బాటు విజయనగరం సమీపంలో ఉన్న పినవేమలి గ్రామంలో ఉన్నాను. అక్కడ ఒక రాజుగారు తారస పడ్డారు. వారు ఒకసారి గురుపూజలకు వెళ్లివచ్చి, గాయత్రీ మంత్రాన్ని మరువకుండా శ్రద్ధతో ప్రతిరోజూ పఠించడం ప్రారంభించారు. ఒకనాడు తన అనుభవాన్ని గురించి నాతో యిలా వివరించారు ఆయన.

"నేను గురుపూజలకు వెళ్లివచ్చిన తర్వాత ఇంట్లో అందరికీ గురుపూజా విశేషాలు వివరించాను. మాస్టరుగారు గాయత్రీ

మంత్రాన్ని ఇలాగే అందరిచేతా ఉచ్చరింప జేశారని చెప్పాను. మా చిన్నాయన గారికి చాలా కోపం వచ్చింది. "గాయత్రిని సి అంతట నీవు ఎక్కడపడితే అక్కడ ఉచ్చరించ కూడదు. నువ్వు ఉచ్చరించ కూడదనే కాదు. అలా ఉచ్చరించే వారి ముఖం కూడా చూడకూడదు. ఆ మంత్రాన్ని ఉపదేశించే అర్హత గలవారు మాత్రమే దాన్ని ఉపదేశించాలి. అదీ తిథీ, వారం, నక్షత్రం, వర్జ్యం, అన్నీ చూసుకుని ఉపదేశించాలి. అప్పుడు కూడా నువ్వు ఏకాంతంగా, ఎవ్వరికీ వినబడకుండా మనస్సులోనే జపం చేసు కోవాలి. ఇదీ శాస్త్రం. నీవు చేస్తున్నది మహాపరాధం" అన్నారు. నేను ముందు బెదిరిపోయి బిక్క మొగం పెట్టాను. తర్వాత మళ్లీ నద్దుకొన్నాను." అన్నారు ఆ రాజుగారు. ప్రత్యేకించి ఇటువంటి వారిని గురించి చెప్పుకోవలసింది ఏముంటుంది? భగవంతుని సృష్టిలో ఎన్నో వింతలలో ఇదొక వింత! అంతే!

అప్పుడు నేను ఇలా అన్నాను. "ఇదంతా భగవంతుని సృష్టి. ఇందులో ఏది మంచి, ఏది చెడు అనేది మనం సృష్టించు కున్నదే. శాస్త్రం, చట్టం, ధర్మం - అన్నీ మనమే కల్పించు కున్నాం. శాశ్వతమైన భగవంతుని ధర్మం నుంచి ఇవి వేరు కానంత వరకు ఇవన్నీ సత్యాలే! వేరు అయిన చోట మాత్రం మనం మొగమాటం లేకుండా తిరస్కరించ వలసిన అవసరం ఉంది. ఈ తిరస్కరించడంలో మనం ఇలా చేయాలని, ఇలా చేయరాదని ఇతరులను శాసించరాదు. మన మున్న పరిస్థితుల్లో మనం చేయ వలసిన దేమిటి, చేయకూడని దేమిటి అని నిర్ణయించు కోవాలి. దీనికి ఇతరుల సిలబస్‌ను అనుసరించ వలసిన అవసరం లేదు. ఈ రెండూ గుర్తుంచుకోవడం అవసరం. సృష్టిలో మనకన్న పూర్వమే సూర్యుడు, గ్రహగోళ తారకాదులు, దేవతలు మొదలైనవి పుట్టాయి. తర్వాత ఎంతో కాలానికి మనం పుట్టాము. ఆ తర్వాత మనం శాస్త్రాదులు సృష్టించుకున్నాం. గ్రహతార

కాదులను బట్టి మనం నిర్ణయించుకున్న శాస్త్రం గ్రహతారకాదులను శాసించగలదా? ఇది తెలియడానికి పెద్ద జ్ఞానం అక్కర లేదు. కొంచెం కామన్ సెన్సు (A sense which is not common) ఉంటే చాలు.

గాయత్రీ మంత్రాన్నే కాదు, మరి ఏ మంత్రాన్ని జపించడానికి గాని, భగవంతుని ఆరాధించడానికి గాని ఎవరి అనుమతినీ తీసుకో నవసరం లేదు. ఆరాధించాలనే భావం కలగడమే మంచి ముహూర్తం. అందరిలో నుండి బుద్ధులను ప్రేరేపించేది గాయత్రి. మంచి బుద్ధులను మాలో ప్రేరేపించ మని చేసేదే గాయత్రి మంత్రం. 'ధియో యోనః ప్రచోదయాత్' ఇలా గాయత్రీ మంత్రం జపించాలనే భావం కలగడానికి కారణం భగవంతుని అనుగ్రహమే. భాష ఏదైనా భావ మొక్కటే!" ఇలా నేను సర్ది చెప్పవలసి వచ్చింది. ఇది ఆనాటి కథ.

## అందరూ సేవకులే !

ఆ రోజు మధ్యాహ్నం అందరమూ భోజనాలకి కూర్చున్నాము. మాస్టరుగారు కూడా మా పంక్తిలోనే భోజనం చేయడం మాకు ఎంతో ఆనందం కలిగించింది. ఇక్కడ మరో విశేషం చెప్పాలి. గురుపూజలలో భోజనాల తరువాత ఎవరి విస్తరి వారే తీసుకువెళ్ళి, నిర్దేశించిన చోట వేసి రావాలనే నియమం ఉంది. ఆ నియమం ఆ సంవత్సరమే పెట్టారు. 10వ తేదీ రాత్రి భోజనాల వద్ద ఒక చిత్రమైన సన్నివేశం జరిగింది. అందరూ భోజనాలు చేసి ఎవరి విస్తరి వారు తీసేశారు. మాస్టరుగారు భోజనం చేయగానే ఒక సోదరీమణి ఎంతో భక్తితో ముందుకువచ్చి మాస్టరుగారి విస్తరి తీయబోయింది. మాస్టరుగారు అప్పుడు ఇలా అన్నారు. "దూరంగా ఉండు. ఎవరి విస్తరి వారే తీయాలనే నియమం పెట్టింది ఎందుకు? నా విస్తరి మీరు తీస్తే నియమం ఏమైనట్లు?

నేను పెట్టిన నియమం నేనే పాటించకపోతే ఎలా?" మాస్టరుగారు కాస్త గట్టిగానే అన్నారు. మాస్టరుగారి తీక్షణమైన చూపుకీ, మాటలకీ పాపం ఆవిడ దూరంగా నిలబడి పోయింది. అవును మరి! ఏ నియమమైనా తాను ఆచరించి చూపడమే మహాపురుషుల లక్షణం కదా!

ఆ మరునాడు ఒకరిద్దరు మరిచిపోయి కాబోలు విస్తరి తీయ కుండానే లేచిపోయారు. వెంటనే మాస్టరుగారు వచ్చి ఆ విస్తర్లు తీసి దూరంగా పారవేశారు. ఒకరిద్దరు భక్తితో అందుకో బోతుండగా వారిని దగ్గరకు రానీయలేదు. జరిగినదానికి బాధ్యు లైన వారు సిగ్గుతో తల వంచుకున్నారు. ఇది ఒకరకమైన ట్రీట్ మెంటు. దీనితో వారేకాక మిగిలినవారు కూడా పొరబాటు జరగకుండా జాగ్రత్త పడతారు. ఆ తర్వాత ఎప్పుడూ ఇలాంటి సమస్య రాలేదు. ఇక్కడ ఒక విషయాన్ని జాగ్రత్తగా గమనిం చాలి. ఇలా చేయండి, ఇలా చేయకండి అని మాస్టరుగారు వాచా చెప్పలేదు. ఎక్కడ పొరబాటు చేశారో అక్కడ ఆయన సరి దిద్దారు. ఆయన ప్రవర్తనను బట్టి మనలను మనం సరిచేసుకోవడం మన బాధ్యత. గురువు ఎప్పుడూ అలాగే ప్రవర్తిస్తాడు. వారి మాటతీరు, ప్రవర్తించే విధానం – వీటినిబట్టి మనం సర్దుకోవాలే తప్ప, ప్రతి చిన్న విషయాన్నీ వారు చెప్పరు. అలా చెప్పాలని మనం కోరడం కూడా భావ్యం కాదు.

"మా వలన మీకేం కావాలి"

ఆ రోజు ఉదయం రాజా సాగి సూర్యనారాయణ రాజుగారు (అప్పటి దేవాదాయ శాఖామాత్యులు) గురుపూజలలో పాల్గొన డానికి వచ్చి తీర్థ ప్రసాదాలు స్వీకరించారు. ఆయన ఇలా ప్రశ్నిం గించారు :

"మేము రాజకీయ సుడిగుండంలో పడి కొట్టుకుంటున్నాము. ఈ నడుస్తున్నది మరీ చికాకయిన కాలం. ఆంధ్రరాష్ట్రపు ఆందోళన శమించింది గాని, ఇంకా కొంత అల్లకల్లోలంగానే ఉంది. ఇటువంటి కల్లోలాలు, సంఘర్షణలు, ఉద్రేకాలు మా బోటి రాజకీయ నాయకులు ఆపు చేయగలిగినవి కావు. ఆత్మశక్తి, ఆధ్యాత్మిక శక్తి గల మన మాస్టరుగారి వంటివారే ఈ సమస్యలను పరిష్కరించగల సమర్థులు. ఇటువంటి వారి అనుగ్రహం వల్లనే మళ్లీ ఈ జాతి ఉద్ధరించ బడుతుంది. మమ్మ ఆశీర్వదించ వలసినదిగా వారిని ప్రార్థిస్తున్నాం. వారి ఆశీర్వచన బలంతోనే ముందుకు సాగి పోగలం."

వారి ప్రసంగం అయిపోయిన తర్వాత మాస్టరుగారు ఇలా అన్నారు. "మంచిపని చేయడానికి రాజకీయ ప్రసక్తి అవసరం లేదు. ఈ వర్గ పోరాటాలు, ఉద్రేకాలు మనుష్యులలోని పశు ప్రవృత్తికి చిహ్నాలు. ఈ పరిస్థితులకి ఒకరిని తప్పు పట్టి ప్రయోజనం లేదు. ప్రస్తుతం జాతిగతే అలా ఉంది. పదవీ వ్యామోహం అధికార దాహం మానవుని మనస్సుని నడిపించినంత కాలం ఇవి తప్పవు. ఈ పరిస్థితులకు దూరంగా నేను నా పిల్లలను, నావారిని నడుపుతున్నాను. నావద్ద శిక్షణ పొందిన ఏ యువకుడు మీ వద్దకు గాని, మీప్రభుత్వం వద్దకుగాని వచ్చి ఏ సహాయమూ అర్థించడు. ప్రభుత్వం మన వద్దనుంచి సహాయం ఆశిస్తూ ఉన్న దీనస్థితిలో ఉన్నది తప్ప, మనకు సహాయం చేసే స్థితిలో లేదు. మీనుండి మేము ఏనాడూ ఏమీ కోరము. మీకు ఏదైనా కావాలంటే ఇవ్వగలం.

కొన్ని వేలమంది మధ్య మాస్టరుగారు ఇలా చెప్పేసరికి అందరూ నిశ్చేష్టు లయ్యారు. మినిస్టరుగారు వస్తే వారితో

మాట్లాడడమే మహా భాగ్యంగా భావిస్తారు ప్రజలు! అలాంటిది, ఒక సామాన్యపు తెలుగు లెక్చరరు ఇంత ధీమాగా చెప్పడమా? అయితే ఇందులో ఆశ్చర్య పోవలసింది ఏమీ లేదు. గురువు అంటే ఉన్న విషయాన్ని, అవసరమైన విషయాన్ని చెప్పడానికి మొగమాట పడడు. ఆయన ఎవరినుంచీ ఏదీ ఆశించేవాడు కాదు. ఎవరికైనా అవసరమైతే ప్రసాదించేవాడు గురువు. (అయితే మనం కోరినది కాక, మనకు అవసరమైనది అందించేవాడే నిజమైన గురువు. ఇటువంటి మాస్టరుగారికి మంత్రిగారైనా మొగమాటాలేముంటాయి?)

మిథిల అంతా కొండ ప్రదేశం. విపరీతమైన చలి. గురుపూజలకు ముందు అక్కడికి వెళ్ళి వచ్చిన కొందరు సోదరులు, ఆ చలిని భరించలేమని భయపడ్డారు. తాము భయపడడమే కాకుండా ఇతరులను కూడా భయపెట్టారు. నిజానికి ఆ చలి అంతటిదే! గురుపూజలకు ముందురోజు వరకూ అంత చలి ఉన్నది. కాని గురుపూజలు ప్రారంభమైన నాటినుంచీ ఆ చలి ఏమైపోయిందో ఎవ్వరికీ అర్థం కాలేదు. అసలు చాలామందికి అంత చలి ఉండాలన్న గుర్తుకూడా లేదు. అసలు చలిని గూర్చిన ప్రసక్తే లేదు. రాత్రిపూట ఆ గురుపూజల పెండాలులోనే వందలమంది సోదరులు పడుకున్నారు. కొందరైతే దుప్పట్లు కూడా కప్పుకోకుండా పడుకున్నారు. గురుపూజలు అయిన తర్వాత అందరికీ గుర్తుకు వచ్చింది, ఈ మూడురోజులూ ఈ చలి అంతా ఏమైపోయిందీ అన్న ప్రశ్న! ఇందులో ఒక్క అక్షరంకూడా అతిశయోక్తి లేదు. వేలాది సోదరుల ప్రత్యక్షానుభవం ఇది.

అయితే మన మాస్టరుగారి మార్గంలో ఇలాంటి మానవాతీతమైన విషయాలను ప్రచారం చేయడం, దానిద్వారా సోదరులలో భక్తిని కలిగించడం అనే పద్ధతి మన సోదరులు అంగీకరించరు.

దానికి కారణం లేకపోలేదు. ఇటువంటి విషయాలను సరిగా అర్థం చేసుకోలేని కొంతమంది, వీటిని చవకబారు విషయాలుగా ప్రచారం చేయడానికి అవకాశం ఉంది. అందువల్ల మాస్టరుగారు, గురుపూజలు కూడా అనవసరమైన విమర్శలకు గురి అవుతారు. కానీ ఈ అనుభవం మాత్రం మన మందరమూ తెలుసుకోవలసిందే. ప్రకృతిలోని కొన్ని దివ్యశక్తులు, మనం బృందాలుగా జీవించడం వల్ల ప్రకృతి మనకు ప్రసాదించే కొన్ని అదనపు సదుపాయాలు మనకు అర్థం కావాలంటే, ఇలాంటి అనుభవాలద్వారానే సాధ్యం. గురుపూజల ద్వారా ఈ దర్శనాన్ని పొందగలిగిన వారు ధన్యులు. స్వీకరించ లేనివారు, నేడు కాకపోతే రేపు అయినా స్వీకరించ గలుగుతారు.

మూడవ కిరణము

# ఒక విదేహ

పతివాడపాలెం ఒక చిన్న గ్రామం. శ్రీకాకుళం జిల్లా చీపురుపల్లి తాలూకాలో ఉంది. ఆ ఊరి ప్రజలు మాస్టరుగారిని తమ గ్రామానికి ఆహ్వానించి ఉపన్యసించవలసిందిగా కోరారు. ఆ సందర్భంలో మాస్టరుగారితో పాటు మేమందరమూ బయలు దేరాము.

ఆనాడు 1973వ సంవత్సరం ఏప్రిల్ 15వ తేదీ. చైత్ర మాసం. పూర్ణిమ రోజులు. దగ్గరున్న సముద్రంపై నుండి చల్లని గాలి వీస్తోంది. మాస్టరుగారితో పాటు మేమందరం డాబాపైన కూర్చున్నాము. వెన్నెలకన్నా చల్లనయిన, నిర్మలమయిన మనస్సులతో ఆ వూరి ప్రజలు మాస్టరుగారి చుట్టూ చేరి, ఆయన నుండి వెలువడే మాటలకోసం ఎదురు చూస్తున్నారు. నేను వారివంక, ఆ ఊరి వంక చూశాను. చూడటానికి అది గ్రామమే. కాని నాకది ఒక వ్రేపల్లెవలె, ఒక గోకులం వలె కనిపించింది. శ్రీకృష్ణుని గురించి పోతనగారు చేసిన ఒక వర్ణన నా మనస్సులో మెరిసింది. "గోపికావిలసిత హారమధ్యమణి." బృందాలుగా ఏర్పడి మాస్టరు గారి చుట్టూ చేరి ఆయనను వింటూ, ఆయనను వీక్షిస్తున్న ఇంత మందీ గోపికలుగా, మధ్యన కూర్చున్న మాస్టరుగారు కృష్ణ భగవానునిగా దర్శన మిచ్చారు నాకు.

పతివాడపాలెం ఒకనాడు అన్నింటివలె మామూలు ఊరు. కాని ఈనాడది ఒక ఆదర్శ గ్రామం. రాజకీయ కల్లోలాలు లేకుండా, సహజంగా గ్రామాలలో ఉండే వర్గవిభేదాలు, ముఠా పోరాటాలు లేకుండా, నిరంతరం రామనామ స్మరణలో మాస్టరు గారి దివ్యలీలలు, విశేషాలు చెప్పుకుంటూ కాలం గడుపుతున్న ఒక యమునాతీరం అది. ఆ ఊరిలో ఎవరి ఇంట చూచినా మాస్టరు గారి చిత్రపటమే. ఎవరినోట విన్నా మాస్టరుగారిని గురించిన ప్రశంసలే. ఎవరి హృదయంలో చూసినా మాస్టరుగారిని కూర్చిన మధురభావనే. సర్వాంతర్యామియై మాస్టరుగారు ఆ ఊర వెలిశారు. అంతేకాదు. ఆ ఊరు, చుట్టుప్రక్కల పల్లెలకు కేంద్రమై నిలిచింది. ఎంతోమంది చుట్టుప్రక్కల గ్రామప్రజలు ఇక్కడ చేరి, ఇక్కడ నుండి గుంపులుగుంపులుగా దేవాలయానికి వెళ్ళినట్లు, తీర్థయాత్రకు వెళ్ళినట్లు మాస్టరుగారి దర్శనం కోసం విశాఖపట్నం వస్తుంటారు. వయసుమళ్ళిన స్థితిలో, నడువలేని స్థితిలో, చావుబ్రతుకుల మధ్య ఊగిసలాడుతున్న స్థితిలో వారు మాస్టరుగారి స్మరణతో బలాన్ని, ఉత్సాహాన్ని పుంజుకొని మాస్టరుగారి దర్శనార్థం విశాఖపట్నం వస్తుంటారు. అందరి ఆరోగ్యాలకు రక్షకుడు మాస్టరుగారే! ఎటువంటి ప్రమాదకరమయిన పరిస్థితిలో నయినాసరే, అకుంఠిత విశ్వాసంతో, భక్తితో వారు మాస్టరుగారిని ఆశ్రయిస్తారు. అంతటి సమర్పణ వారిది. మాస్టరుగారి సన్నిధిలో, ఆ పవిత్ర వాతావరణంలో ఆ పాలెం పవిత్రహృదయాల మధ్య కూర్చుంటే నా హృదయానికి ఈ చల్లని స్పర్శ కలిగింది. మాస్టరుగారి విశ్వరూపం దర్శనమిచ్చింది. ఈప్రజలు ఏం చదువుకున్నారు? వారికి ఉన్న విజ్ఞానమెంత? మాస్టరుగారు ప్రపంచంలో నడిపే కార్యక్రమాలు వారికెన్ని తెలుసు? ఏం తెలుసు? కానీ వారికి ఏమీ తెలియనక్కర లేదు. తెలియవలసిన స్థితిని దాటి మాస్టరుగారి దివ్యస్పర్శను అందుకోగల స్థితిని చేరినవారు. అందుకే ఆ స్పర్శ నాకూ కలిగింది. మాస్టరుగారిలో ప్రేమను కరుణను, వారిలో నేను దర్శించగలిగాను.

మాస్టరుగారు అందరిని పరికించి ఇలా సెలవిచ్చారు. "మందువలన రోగాలు నయమవుతాయన్నది కొంతవరకు మాత్రమే సత్యం. ఇంతమంది రోగాలు నయంకావటానికి మీలో సంకల్పము, ప్రేమలే కారణాలు. నా ఎదుటికి వచ్చినవారిని, నేను చూడక ముందు నేనెరుగుదును. ఆ రోగం నయమవుతుందని నేనెరుగుదును. కానీ మీరు మందు పుచ్చుకొన్న తరువాత నయమయినప్పుడే నన్ను తెలుసుకోగలరు. అప్పుడే నమ్ముతారు. కానీ రోగం నయమవుతుందని నేను ముందునుంచీ నమ్ముతాను. దానికి కారణ మొక్కటే! మందులు ఇచ్చేవాడిలోను, మందులు పుచ్చుకొనేవాడిలోను పని చేస్తున్న సర్వాంతర్యామి ప్రజ్ఞ ఒక్కటే! నాలోను, మీలోను పనిచేసే ప్రజ్ఞ అదే! మీకు ఆనందమందించడమంటే, నేను ఆనందాన్ని అనుభవించడం, ఆనందించడం. నాలో ఉన్న "నేను", మీలో ఉన్న "నేను" ఒకే "నేను" అని నేనెరుగుదును. ఆభావమే నానుండి పని చేస్తుంది. ఆ తెలియడమే బ్రహ్మజ్ఞానమని, దివ్యజ్ఞానమని, ఆత్మజ్ఞానమని ఎన్నెన్నో పేర్లతో పిలుస్తున్నారు. నావారు, పరులు అనుకునేవారు అందరూ "నావారే". 'పరులు' అంటే పరాత్పరుని తాలూకువారు. అంటే మనవారు. 'పరులు' అంటే పరమపురుషుని రూపాలు. ఇది తెలియాలి. ఏపేరున పిలిచినా, ఏరూపాన చూచినా భగవంతుడు భగవంతుడే! మానవుల రోగాలను పోగొట్టేది ఆ దివ్యశక్తే! ప్రేమ, కరుణ, దయ భగవంతుని రూపాలు. శాశ్వతమైన ఆయన ఆనందమే మనకు రోగ నివారణం. మిమ్మల్ని ఇక్కడికి చేర్చినదీ, మీలోనుండి మందు కావాలని అడిగించినదీ, నానుండి మందు ఇప్పించినదీ, నానుండి దీవెనగా వచ్చినదీ, మీనుండి స్వీకరించినదీ అదే!"

గంగాఝరిలాగా ఆయన నుండి వెలువడిన మాటలు నాలో విచిత్రమయిన సంచలనాన్ని కలిగించాయి. శరీరం లోపలి

భాగంలో ఇట్టి చోటని నిర్దేశించరాని చోటు నుండి ఏదో కదలిక మొదలయింది. మన మధ్య మనతో మాట్లాడుతూ, ఛలోక్తులు విసరుతూ, నవ్వుతూ తిరిగే మాస్టరుగారు సకల వేదాలు రూపు గట్టిన మూర్తిగా కనిపించారు. ఎట్టి ఆర్భాటమూ లేక, యతి వేషం లేక, యోగుల పటాటోపాలు లేక నిరాడంబరంగా ఉండే మాస్టరుగారు శుద్ధ స్ఫటిక సంకాశంగా కనిపించారు. అందరికీ అర్థమయ్యే అతి సులువయిన, మృదువైన భాషలో సమస్త పురాణాలు, శాస్త్రాల సారాన్ని ఆయన అందిస్తున్నారు అంటే ఆయన వాక్కులు, భాషకు, భావానికి అతీతమయిన గాయత్రి వెలుగు నుండి ఉద్భవిస్తున్న తరంగాలనిపించింది.

నారదుడు ఒకసారి పాండవులకు ఇలా బోధించాడు. పాండవులకు కృష్ణుడు బంధువు, హితుడు, గురువు, స్నేహితుడు. కాని వారెవరూ పూర్తిగా కృష్ణుని ఎరుగరు. వారికే కాదు. కృష్ణుని ఎరుగుట ఎవరికీ సాధ్యం కాదు. అందుకే నారదుడు వారితో ఇలా చెప్పవలసి వచ్చింది.

"జలజాత ప్రభవాదులున్ మనములో చర్చించి భాషావళిన్
పలుకన్ గాని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు మీమధ్యలో
చెలియై, మేనమరందియై, సచివుడై, చిత్రప్రియుండై, మహా
ఫల సంధాయకుడై చరించుటది మీ భాగ్యంబు రాజోత్తమా"!

"ధర్మనందనా! బ్రహ్మాది దేవతలు కూడ వాక్కులో గాని, మనసులో గాని జనార్దనుని అందుకో లేరు. అటువంటి పరబ్రహ్మము మీతో బాటు, మీ మధ్యనే, మీకు చెలికాడై, బావమరదియై, అమాత్యుడై, చిత్రమైన రీతిలో మీకు స్నేహితుడై మహాఫలితాన్ని మీకు సమకూర్చి పెట్టడానికి ఈ కృష్ణుడుగా సంచరించడం మీరు చేసుకొన్న భాగ్యం."

మాస్టరుగారి చుట్టూ చేరిన ఇంతమంది సాధకులు రాజ యోగ మార్గాన పయనిస్తున్నవారు. రాజోత్తముడయిన జగదాచార్యుడగు కృష్ణమాచార్యగారిని మనం మాస్టరుగారు అంటున్నాం. వారి మాటలు వింటున్నాం. కానీ ఆయన మాటల వెనుక ఉన్న 'ఆయన'ను దర్శించడం మన విధి. దర్శించగలగడం మన భాగ్యం. సర్వభూతముల యెడ సమచిత్తం కలిగి, అందరిలో ఉన్నది, "నేను" అని తెలుసుకొని, అలా మెలగడం, ఆయనయందు మెలగడం, ఆయనను దర్శించడం. అందుకే నేను పై పద్యాన్ని ఇలా చదువుకుంటాను.

"జలజాత ప్రభవాదులున్ మనముతో చర్చించి భాషావళిన్
పలుకన్ అందగరాని యట్టిదగు నా బ్రహ్మంబు మా మాస్టరై,
చెలియై, ప్రేమ గురుండునై, సచివుడై, చిత్ర ప్రియుండై, మహా
ఫలసంధాయకుడై చరించుటది మా భాగ్యంబు సామాన్యమే"

మాస్టరుగారు ఇక్కడి వారందరికీ చెలి, గురువు, సారథి, ఎంతో ప్రియుడు. అన్నిటి కంటె మహాఫల సంధాయకుడు. కొద్ది పెట్టుబడికే పెద్ద భాగ్యాన్ని ఇచ్చేవాడు. ఇట్టివాడు దొరకడం సామాన్యమా! ఇట్టియోగ సిద్ధిని పోలిన దింకొకటి లేదని తోచింది. తోచిందేకాని మనకు అంతటి భావము అంటిందా? అంటినంత వరకు అంటింది. ఇంకను అంటవలసింది ఉంది. అందుకు గుర్తుగా సూచనగా ఒక విషయం చెబుతాను.

ఉపన్యాసం పూర్తి అయ్యేటప్పటికి రాత్రి 12-30 గంటలు అయింది. ఉపన్యాసం మొదలయినప్పటినుండి ముగిసేవరకు సభ్యుల లో ఒక్కరూ కదలలేదు. మాస్టరుగారి వాక్కులను వింటూ కూర్చున్నారు, వేణుగోపాలుని వేణుగానం వింటున్న గోపికలవలె. ఉపన్యాసం అయిన తరువాత ఔషధసేవ ప్రారంభమయింది.

మాస్టరుగారు ఎంతో ప్రేమతో రోగులను పలకరించి వారి రోగలక్షణాలను అనుసరించి చీటీలపై మందులు వ్రాస్తున్నారు. మాస్టరుగారితో వచ్చిన సోదరబృందంలోని కొంతమంది సోదరులు పొట్లాలు కట్టి ఇస్తుంటే, మరికొంతమంది ఆ మందులను వాడే విధానాన్ని విడమరచి చెప్తున్నారు. అంతా పూర్తయ్యేసరికి తెల్లవారు జాము 4 గంటలు అయింది. నేనూ, మరొక మిత్రుడూ ప్రక్క యింటికి వెళ్ళి నిద్రపోవాలనుకున్నాం. నాకు నిద్ర పట్టలేదు. నల్లులు, దోమలు, ఏదో అశాంతి. దానికితోడు చలిగాలి. పడక కుదరలేదు. బడలికగా ఉన్నదేమో ననుకున్నాను. నా స్నేహితునికి శిరోభారంగా ఉంది. నిద్ర కుదరలేదు. కనుక లేచి కూర్చున్నాం. "అక్కడ మాస్టరుగారు, యోగమిత్రులు "మానవ సేవయే మాధవసేవ" అనే కార్యక్రమంలో ఉన్నారు. ఎంతో ఉత్సాహంగా ఉన్నారు. మీరు సోమరులు కనుక నిరుత్సాహం మిమ్మల్ని ఆవరించింది. వారు కర్మయోగులు కనుక ఉత్సాహం వారిని వరించింది. మీరు అక్కడకు వెళ్ళండి. అక్కడికి వెళ్ళండి." అని తోచింది. వెంటనే మేము మాస్టరుగారి దగ్గరకు వెళ్ళాము.

అక్కడి దృశ్యం ఒకవింత. వారంతా ఎంతో ఉత్సాహంతో చకచకా పనులు చేస్తున్నారు. ఎవరూ అలసినట్లులేరు. నిద్రకి మొగం వాచినట్లు లేరు. నాకంటే అక్కడి యోగ మిత్రులు రెట్టింపు ఉత్సాహంతో ఉన్నారు. అదే కిటుకు. వారందరూ దివ్య కార్యక్రమంలో నిమగ్నులై ఉన్నారు. కనుక అది దివ్యోత్సాహం. మాస్టరు C. V. V. గారు చెప్పిన "Plenty of Prana" అన్నదేదో వారి కందుతున్నది - అని నా మనస్సుకు తోచింది. యోగ మిత్రులు సోమేశ్వరరావు గారు పని పూర్తి చేసికొని నా వద్దకు వచ్చి యిలా అన్నారు. "ఇపుడెంతో ఉత్సాహంగా ఉంది. చాలా Fresh గా ఉంది. అంతా Wash అయినట్లు, స్నానం చేసి

వచ్చినట్లు భావం కలుగుతోంది.'' వారి మాటలు వింటోంటే ఇంకొంచెం బాధ! కాని అది మాకు బోధ. కనువిప్పు. ప్రత్యక్ష పాఠం.

ఒకమారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నాకు ఇలా చెప్పారు. ''నీ వద్దకు ట్రీట్‌మెంటుకు వచ్చిన వారిని నీ వెలా ప్రశ్నిస్తావు? నీ వెలా భావిస్తావు? నిన్ను అర్థించి వచ్చారనా? అది ఎప్పుడూ కాదు. నీపై పరీక్షాధికారులు వారు. నీవు దయతో వారిని ఆదరిస్తున్నదీ లేనిదీ పరికించి చూడ వచ్చిన వారని తెలుసుకో. వారిని అతి శ్రద్ధా భక్తులతో ఆదరించి సేవచెయ్యి.''

అప్పటి ఆయన దివ్య బోధ యొక్క అనుభూతి ఇక్కడ గోచరించింది. అప్పటి ఆయన మాటలు నాకు ఇప్పుడు అర్థమయినాయి. ఆచరించవలె ననిపించింది. ఆ ధర్మం ఇప్పుడు మాస్టరుగారి రూపంలో దర్శన మిచ్చింది. మాస్టరుగారు చుట్టూ చూసి ''మందులు కావలసిన వారు ఇంకెవరైనా ఉన్నారా?'' అని ప్రశ్నించారు. ఎవరూ లేరు. మిగిలిన సోదరులు అందరికి మందులు కట్టి యిచ్చి తమ పని పూర్తి చేసికొని మందుల పెట్టెలను సర్దుకొని ప్రయాణానికి సిద్ధమయ్యారు. ఇంతలో మరి నాలుగు చీటీలు వచ్చాయి. మళ్ళీ కూర్చుని, ఓపికతో మందులు కట్టి ఇచ్చారు. వారిలో ఎటువంటి అలసటా కనిపించలేదు. విసుగు లేదు. మందులు ఇవ్వడం పూర్తయింది. అందరూ బయలుదేరి నాలుగు అడుగులు వేశారు. మాస్టరుగారు కారువద్ద నిలుచుని ఉండగా మరికొంత మంది రోగార్తులు వచ్చారు. వారికి మరల చీట్లు వ్రాసి ఇచ్చారు. మందుల దుకాణం మళ్ళీ విప్పారు. ఇది అంతా నిండుదనంతో, చిరునవ్వుతో, పొందికతో జరగడం ఒక వింత. పని చేయడం వేరు, ఆనందంతో పనిచేయడం వేరు. ఆనందాన్ని పంచి యిస్తూ పనిచేయడం వేరు. అందరూ తృప్తి పొందిన తరువాతనే మా ప్రయాణానికి మాస్టరుగారు అనుమతి ఇచ్చారు.

కలియుగంలో సాధారణంగా గురువులు ఆర్భాటాలు, కాషాయాది వేషధారణ చేస్తూ ఉంటారు. మన మాస్టరుగారికి అలాంటి ఆర్భాటాలేమీ లేవు. అందరితో సమానంగా కలిసిపోయే టట్లు కనిపించడం, ప్రవర్తించడమే వారి ప్రత్యేకత! ఆయన మన నుండి ఏమీ ఆశించరు. సరికదా, మన వద్ద లేనిదాన్ని, దుర్లభం అయిన దాన్ని మనకు అందించ గలరు. వారిలో ఉన్న వెలుగు చే మనలను వెలిగించ గలరు. ఈ వెలుగు వెలపెట్టి కొనటానికి వీలు లేనిది. ఏ దేశం నుంచీ దిగుమతి చేసుకోలేనిది. వారొక్కరే ఈయ గలిగింది. మనకు కావలసింది, ప్రతి ఫలంగా మనం వారికి ఈయ వలసింది ఒక్కటే. అదే నమస్కారం. మన జీవిత రథ సారథిగా వారిని అంగీకరించటం ఒక్కటే మనం చేయవలసింది. ఇక్కడ మనకు అర్థం కావలసిన కొన్ని విషయాలున్నాయి. ఏదైనా ఒక వస్తువును గూర్చి వెతుకుతున్నా మంటే మన వద్ద ఆ వస్తువు లేకనే గదా! అలాగే ఆనందం కోసం ప్రయత్నిస్తున్నా మంటే ఆ ఆనందం మనకు లేకనే. కాని ప్రేమ, వెలుగు, ఆనందం ఈ మూడింటిని అన్య మార్గాలలో ప్రయత్నం చేసి సాధించ లేము. ఆనందం లభిం చాలంటే ఆనందంగా ఉండడం ఒక్కటే మార్గం. ఇనుప ముక్క అయస్కాంతం యొక్క సాన్నిధ్యంలో అయస్కాంతంగా మారి నట్లు, నిరంతరం ఆనంద స్థితిని అనుభవించే మాస్టరుగారి లాంటి మహాత్ముల సన్నిధిలో మనం కూడా ఆనంద స్వరూపులమే అవు తాము. అయితే వారి సాన్నిధ్యాన్ని శారీరకంగా కాక, హృద యంలో అనుభవించటం అభ్యాసం చేయాలి. హృదయం ప్రేమకు స్థానం. మనలో గల ప్రేమతోనే వారిలో గల ప్రేమను పొంద గలం. బయట ఉన్న వెలుగు లోపలికి రావాలంటే కిటికీలు తెరచు కోవాలి. లోన ఉన్న వెలుగు బయటకు ప్రసరించాలంటే చిమ్నీకి పట్టిన మసిని ఎప్పటికి అప్పుడు శుభ్ర పరచుకోవాలి. ఇలానే ఇంద్రియాలను, మనస్సును, బుద్ధిని పవిత్రం చేసుకొని మాస్టరుగారి వెలుగు మనలో ప్రసరించేలా, మన ద్వారా ఇతరులకు ప్రసరించేలా

చేసుకోవాలి. అదే మన కర్తవ్యం. దీనికి ఒక్కటే మార్గం. నిరంతరం ప్రవహించే వారి ప్రేమ ప్రవాహానికి మనలోనికి కాలువలు త్రవ్వుకోవటమే. వారి నుండి ప్రసరించే వెలుగుకు అభిముఖంగా మనం కూర్చోవటమే. ఇది ఒక్కటి చేయలేకనే యుగ యుగాల నుండీ మానవుడు పడుతున్న బాధలు, సమస్యలు, దుఃఖములు. ఈ కారు చీకటి మాస్టరు గారి ప్రేమ అనే వెలుగుతో మాయమవుతుంది. కాని మన అభిప్రాయాలు, ఇష్టా యిష్టాలు, కోరికలు, ఆ వెలుగును మనలోనికి ప్రసరించనీయకుండా అడ్డు గోడలై నిలుస్తాయి. అందుకే కృష్ణుడు సమస్త జ్ఞానాన్ని బోధించి చిట్ట చివరకు "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అని చెప్పాడు. ఇది ఒక్కటే ఏనాటి కయినా మార్గం. ఆనాటి కృష్ణుడు ఈనాటి ఈ కృష్ణుడిగా దిగి వచ్చి మన మధ్య, మనలోన, మన బయట ఉండి మనలను నడిపించబూనడం నిజంగా మన అదృష్టమే.

తిరుపతిలో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారిని దర్శించి నపుడు, అమృత మయమై, ఆదరం నిండిన వారి వాక్యాలు ఆల కించి నపుడు నేను గురువుగారిని, మాస్టరుగారిని చూస్తున్నానని తెలిసింది. నాకు సాహిత్య విషయంలో గురువైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఇలా అంటూ ఉండేవారు. "ఈ రామ కోటయ్యగారు ప్రభాకర శాస్త్రిగారి శిష్యుడు. నాకు స్టూడెంటు. నేను చేయమన్న పని ఆలోచించి చేస్తాడు. అదే శాస్త్రిగారు అయితే వారు ఏది చెయ్యమంటే అదే చేసేస్తాడు." ఇది అక్షరాల నిజం. ఇదే రకమయిన సంబంధం మాస్టరు గారితో కూడా నాకుంది. శ్రీ శాస్త్రిగారి ప్రతిరూపే మాస్టరుగారు. అదే వెలుగు తిరుపతి నుండి విశాఖకు మరలి వచ్చింది. అని నాకు గుర్తింపు కలిగింది.

నాలుగవ కిరణము

# రామనామక్షేత్రం

మాస్టరుగారు ఒకసారి గుంటూరు వచ్చారు. రామనామ క్షేత్రంలో వారి ఉపన్యాసం. దగ్గరలో ఉన్న హిందీ టీచరు శకుంతలమ్మగారి యింటికి మేమందరం వెళ్ళాం. సాయంకాలం 5 గంటలు అవుతుంది. తన దర్శనార్థం వచ్చిన రోగులను పరామర్శించే సరికి 6 గంటలు అయింది. అందరం ప్రార్థనకు కూర్చున్నాం. ప్రార్థన అయిన తరువాత నేను వచ్చి కుర్చీలో కూర్చున్నాను. నా ప్రక్కన ఒకాయన కూర్చుని ఉన్నారు. ఆయన వయస్సులో చాలా పెద్దవారు. పోస్టు మాస్టరుగా రిటైరయ్యి వేదాంత గ్రంథాలు చదువుతున్నారు. మాస్టరుగారు గుంటూరు వచ్చారని విని, వారిని చూడాలని వచ్చారు. ఆయన "వారు ఎప్పుడు వస్తారు?" అని అడిగారు. "మాతో పాటుగానే వచ్చారు కదండీ! కాసేపటిలో బయలుదేరి వెళ్ళి పోతున్నారు కూడా! ఇప్పుడు లోపల ఉన్నారు" అన్నాను. ఆయన ఆశ్చర్యంతో "గురువుగారు వచ్చారా?" అన్నారు. గురువు అంటే దండ కమండలాలు, కాషాయ వస్త్రాలు, పెద్ద గడ్డం, ఇలాటి వేషమేదో ఉంటుందని పాపం ఆయన ఊహించుకొని ఉంటారు. అందుకే గుర్తించలేక పోయారు. ఇంతలో మాస్టరుగారు బయటకు వచ్చారు. రోగులు కొందరు బయట ఆయన కోసం ఎదురు చూస్తూ

న్నారు. అందరూ ఆయనకు నమస్కరించారు. మాస్టరుగారు సదు స్తూనే వారి యోగక్షేమాలు తెలుసుకుంటూ, వారికి మందులు వ్రాసి యిస్తున్నారు. నేను పోస్టుమాస్టరుగారిని పరిచయం చేశాను. మాస్టరుగారు ఎంతో ఆదరంతో ప్రేమతో మాట్లాడారు. ఇంతలో క్షేత్రంలో ప్రవేశించాం. ఇంకా మన పోస్టుమాస్టరుగారికి వీరే గురువులు అన్నగురి కుదరలేదు. క్షేత్రంలో ప్రవేశించగానే సెక్రటరీగారు, సుమాన్నాగారు వచ్చి మాస్టరుగారికి సాష్టాంగ నమ స్కారం చేశారు. ఆ దృశ్యం చూసిన తర్వాతనే పోస్టుమాస్టరు గారు వీరిని గురువుగా గుర్తించారు. చాలా వేదాంత గ్రంథాలు చదివిన తరువాత ఆయనకు కొన్ని సందేహాలు మిగిలి పోయాయి. అన్నిటిని ప్రశ్నలరూపంలో ఒక ప్రశ్నోపనిషత్ తయారుచేసి జేబులో పెట్టుకొని వచ్చారు. వాటన్నిటికీ గురువుగారిని అడిగి సమాధానం పొందాలని ఆయన చిరకాలం వాంఛ. మాస్టరుగారు రామమందిరంలో 7 గంటలకు ఉపన్యాసం ఆరంభించారు.

## నామ సంకీర్తన

మాస్టరుగారు వేదిక పైకి రాకపూర్వం రామనామ సంకీర్తనం జరుగుతోంది. తర్వాత మాస్టరుగారు ప్రసంగం ప్రారంభించారు. ''పరమ పవిత్రమైన రామనామ సంకీర్తనం చేస్తున్న భక్తబృందానికి నమస్కారం. యోగమిత్రులకు నమ స్కారం. రామనామం మనస్సును పవిత్రం చేస్తుంది. రామనామం ఉచ్చరించే ప్రతిసారీ రామచంద్రునియొక్క దివ్యమంగళ విగ్రహం, ఆయన దివ్యగుణాలను స్మరించాలి. ఆయన పితృవాక్య పరిపాలన, ధర్మదీక్ష, ఆర్తరక్షణ, అసమాన శౌర్యం అన్నీ గుర్తుకు రావాలి. ఆయన కల్యాణ గుణాలన్నీ మనకు అలవడాలి. ఆ దివ్యత మనలో ప్రవేశించాలి. మన దోషాలు ఆయన వెలుగులో క్షాళ నం కావాలి అని కోరుతూ సంకీర్తనం చేయాలి. సంకీర్తనం రోజుకు ఎన్నిసార్లు ఎంతకాలం చేయాలి అని కొందరు ప్రశ్నిస్తారు. ఆ ప్రశ్న

తోలగేవరకు అని సమాధానం. స్నానం ఎన్నాళ్లు చేయాలి అని అడగటం వంటిదీ ప్రశ్న. దీపం ఉన్నంతవరకూ మసిపట్టక తప్పదు. ప్రతిరోజూ ఆ మసిని తుడిచి వేయక పోతే కాంతి బాగా ప్రసరించదు. ఇటువంటిదే సంకీర్తన. అను క్షణం నామసంకీర్తన చేయడం మనలను మనం పరిక్షాళన చేసుకోవడం.

రామకోటి వ్రాస్తే పుణ్యం వస్తుందని ఒక షావుకారుతో ఎవరో చెప్పారు. ఆయన రెండు రోజులు అతి శ్రద్ధతో వ్రాసి తరువాత బద్ధకించాడు. కాని పుణ్యం పోతుందని భయం. కొంత కాలం కార్బన్ పేపర్లు పెట్టి వ్రాశాడు. అప్పటికీ బద్ధకం వచ్చింది. సైక్లోస్టయిలు తీయించి అనుకున్న దానికంటే ఎక్కువ రామ నామాలే తీయించాడు. దీనివల్ల వచ్చేదేముంది? భక్తితో రామ సంకీర్తన చేస్తే రామరాజ్యం మనలో వెలుస్తుంది.'' అని చెప్పి మాస్టరుగారు విక్రమార్కుని కథ చెప్పారు.

“విక్రమార్కుడు మారువేషంలో రాజ్యంలో సంచరిస్తూ కాళికాలయం వద్దకు వచ్చాడు. అక్కడ ఒక యజ్ఞశాల ఉంది. ప్రక్కన కొండవలె బూడిద కుప్పగా ఉంది. అది ఆ యజ్ఞశాలలో జరిగే యజ్ఞావశేషం. యజ్ఞం చేసే వ్యక్తి చాలా వృద్ధుడు. 50 సంవత్సరాలుగా యజ్ఞం చేస్తున్నాడు. విక్రమార్కుడు అతన్ని దర్శించి, యజ్ఞాన్ని గూర్చి ప్రశ్నించాడు. అతడు ఇలా చెప్పాడు: “నేను సంవత్సరాల తరబడి ఎంతో నిష్ఠతో ఈ క్రతువును చేస్తున్నాను. వృద్ధుడ నయ్యాను. కాని నాకు దేవి ప్రత్యక్షం కాలేదు.” విక్రమార్కుడు ఇలా అన్నాడు. “ఇన్ని రోజులు సాధన చేసినా దేవి మీకు పలుక లేదా! ఆమె కరుణామయి. తన బిడ్డల యందు అపారమైన ప్రేమగల మాతృమూర్తి. ఆ దేవి మీ కెందుకు దర్శన మీయలేదు?” ఇలా అని అతడు ఆ దేవి పాదపీఠం వద్ద కూర్చుని ధ్యానం చేశాడు. 'అమ్మా' అని మనసారా,

నోరారా పిలిచాడు. అయినా అమ్మ పలుకలేదు. "అమ్మ పలుకని ఈ జన్మ వ్యర్థం. నా శిరస్సు ఈ తల్లి పాదాల కడ అర్పిస్తాను." అని ఒరనుండి కత్తిలాగి తల నరుక్కో బోయాడు. మెడను కత్తి తాకబోయే లోగానే కరుణామయమైన స్పర్శతో ఎవరో చేయి పట్టుకొన్నారు. తేనెలొలికే తీయదనంతో మందహాసం చేస్తూ అమ్మవారు "కుమారా! ఎందుకీ సాహసం?" అని అడిగింది. విక్రమార్కుడు "అమ్మా! నీవు జగన్మాతవు. ప్రేమ మూర్తివి. ఈ సాధకుని యందు దయ ఉంచు. ఇన్ని యేండ్లుగా నీ దర్శన భాగ్యం కోసం తపిస్తున్నాడు కదా! దర్శన మీయ లేదేమి?" అని అడిగాడు. దేవి చిరునవ్వుతో ఇలా అన్నది. "పిల్లల యెడ తల్లి ఎప్పుడూ ప్రేమ కలిగే ఉంటుంది. అనుదినం వీనికి ప్రత్యక్షం కావాలనే సిద్ధంగా వుండి ఎదురు చూస్తున్నాను. కాని వీడు నన్ను పిలవనిదే ఎలా పలుకను? యజ్ఞం, మంత్రం వాటినే వీడు చూస్తున్నాడు గాని ఒక్కనాడయినా నాకు వినపడేటట్లుగా అమ్మా! అని నోరారా పిలువలేదు. ఇక నేను చేయగలిగింది ఏముంది?" అన్నదట. ఈ కథ చెప్పి మాస్టరుగారు తన ప్రసంగం ముగిస్తూ చివరగా, "మనసా, వాచా మీరందరూ శ్రీరాముని స్మరించి సంకీర్తనం చేసి తరించండి" అని అన్నారు.

మాస్టరుగారు చాలాసార్లు తన ఉపన్యాసాలలో నామ సంకీర్తన ప్రాముఖ్యాన్ని చెప్తుంటారు. నారదుడు, తుంబురుడు, ఆంజనేయుడు, కబీరు, రామదాసు, మీరా వీరందరూ సంకీర్తన చేసి తరించినవారే! సంకీర్తన వలన అన్నింటికంటే సులభంగా హృదయం పవిత్రమవుతుంది. హృదయం భగవంతుని యందు లగ్నమవుతుంది.

కీర్తన చేస్తున్నంతసేపూ అక్కడ పరమాత్మ సాన్నిధ్యం ఉంటుంది. కీర్తన చేసే ఒక్కని హృదయంలోనే కాదు. అతనితో

పాటు గొంతు కలిపి కీర్తన చేసే అందరి హృదయాలలోను భగవంతుడు నిలుస్తాడు. జాతి, మతం, కులం, అంతస్తులు ఇలాంటి భేదాలు కీర్తన చేస్తున్నంతకాలం నశించి, భగవంతుని యెడల భక్తి నిండి ఉంటుంది. ఇంతమందిని ఏకోన్ముఖం చేయగల శక్తి ఒక్క సంకీర్తనకు తప్ప ఇంక దేనికీ లేదు. సృష్టిలో సంగీతానికి, గానానికీ ఉన్న స్థానం అలాంటిది. విజ్ఞానం, తర్కం, ధర్మాధర్మ నిర్ణయం ఈ అన్నింటికీ అతీతమైన ఆనందస్థితి సంకీర్తనలో మాత్రమే లభిస్తుంది. మాస్టరుగారి ఉపన్యాసం వింటున్నంతసేపు ఆ అనుభూతి అందరిలోను, అంతటా నిండి ఉంటుంది. ఉపన్యాసం అయిపోయిన తరువాత పోస్టు మాస్టరు గారిని, ఆయనకున్న ప్రశ్నలు మాస్టరుగారిని అడిగి తెలుసుకోమని శర్మగారు అన్నారు. ఆయన నమస్కరించి యిలా అన్నారు. "నా ప్రశ్న లన్నింటికీ సమాధానాలు మాస్టరుగారి ప్రసంగంలోనే వచ్చాయి. నా కిక ఎలాంటి సందేహాలు లేవు. చాలా ఆనందంగా ఉంది" అన్నారు.

ఇలాంటి అనుభవాలు మాస్టరుగారి ఉపన్యాసాలకు వచ్చే ప్రతివారికీ సామాన్యమే! ఎవరు ఏ సందేహంతో ఆయన ఉపన్యాసాలకు వచ్చినా ఆ సందేహాలు వారు నోరు విప్పి అడగవలసిన అవసరం లేకుండానే ఆయన నుండి సమాధానాలు లభిస్తాయి. సమాధానం ఇవ్వడం ఒక్కటే కాదు. సమాధాన మివ్వడం, ఒప్పించడం ఎవరయినా చేయగలరు. మనసుకు కమ్మిన పొరలు తొలగించడం, అజ్ఞానమనే కారుచీకటిలో దీపం వెలిగించడం, కర్తవ్యం ఉపదేశించడం ఆయన అనుగ్రహం. త్రికరణ శుద్ధిగా మాస్టరుగారిని అనుసరించ దలచినవారు, యోగసాధన యెడల పరిపూర్ణమయిన శ్రద్ధ కలవారు ఏవిషయంలోనూ, ఎవరినీ ఎప్పుడూ సలహా అడగ నవసరం లేదు. మనస్సులో సంశయాలు వారి కుండవు.

దేన్ని గురించీ బాధ పడవలసిన అవసరం ఉండదు. ఉపన్యాసాలు వింటే చాలు. మాస్టరుగారి వద్దకు వెళ్లి నేను ఏంచేయాలి అని గాని, ఏరకంగా చేయాలి అసి గాని అడగవలసిన అవసరం ఉండదు. మాస్టరుగారి దివ్యమైన ఉపన్యాసాలు హృదయంలో గ్రహిస్తే చాలు. ఒక మహాతేజస్సును, శక్తిని ఆయన ఉపన్యాసాలలో మనం గ్రహించగలం. కదలలేని, నడవలేసి స్థితిలో ఉపన్యాసంలో కూర్చున్న వారు ఉపన్యాసం అయేటప్పటికి పరిపూర్ణ ఉత్సాహంతో, శక్తితో ఇళ్ళకు వెళ్ళడం సర్వ సామాన్యమైన అనుభవం. కాలానికి అతీతమైన శక్తిని, లోకాలను, ప్రజ్ఞను ఉపన్యాసాలలో అనుభవించటం జరుగుతుంది. నిజమయిన ఆనంద స్పర్శ ఆ ఉపన్యాసాలలో మనకు కలుగుతుంది. ఇన్ని ప్రజ్ఞలు ఒకే ప్రజ్ఞగా పనిచేయటం, ఇంతమంది ఒకని యందు జీవించడం అనుభూత మవుతుంది. 2 గంటల కాలం ఒక అయిదు నిమిషాల కాలంగా గడచిపోవటం, అప్పుడే 2 గంట లయిందా! అని అందరూ ఉపన్యాసం అయిన తర్వాత ఆశ్చర్యపోవటం తరచు అందరూ ఎరిగిన విషయమే! దాని వెనుక ఉన్న ఆయన మంత్రజాలాన్ని తెలిసికోవడం, ఆ ఆనంద స్పర్శను పొందడం యోగసిద్ధి. ఆయన ఉపన్యాసాలకు వెళ్ళడం యోగసాధన యెడల అభిరుచి కలగడం. వాటిని ఆచరించడం సాధన. ఆ స్పర్శను పొందగలగడం సిద్ధి. మాస్టరుగారి యోగమార్గ మంతా ఆయన వాక్కులలో నిండి ఉంది.

మన మనస్సులో ఉన్న సందేహాలు మనం ఆయనకు తెలియ జేయనక్కర లేకనే ఆయన కెలా తెలుస్తాయి? ఇది కర్ణ పిశాచమా? మరింకేదయినా శక్తి ఉపాసనా?... అని సందేహం కలిగిన వారూ లేకపోలేదు. దానికి సమాధానం C. V. V. గారు ఒకసారి ఇలా చెప్పారు.

Every conscious question has a subconscious answer. ప్రశ్న వేశామూ అంటే ముందుగానే సమాధానం

తప్పక ఉండి తీరుతుంది. సమాధానం లేనిదే ప్రశ్న ఏనాడూరాదు. ఇది తెలియకనే ఈ దుఃఖం, సమస్యలు. ప్రశ్నలు మనస్సు యొక్క విక్షేపములు. సముద్రం వంటి స్థితి మన సహజస్థితి. అలలవంటి స్థితి మనస్సులో సంశయాలు, భావాలున్న స్థితి. అక్కడ ఉన్నంత కాలం ఆటుపోటులు తప్పవు. కెరటాలు దాటి లోపలకు వెళితే గంభీరత, ప్రశాంతత, నిర్మలత ఉంటుంది. అట్టి ప్రజ్ఞ మాస్టరు గారు. అందుకే ఆయన వాక్కులను వింటూ కూర్చుంటే, మన ప్రజ్ఞలు ఆయన ముందు కరిగిపోతాయి. అంతా ఒకే ప్రజ్ఞ నిండి పోతుంది. అట్టి స్థితిలో ప్రశ్న, సమాధానం అనే రెండు స్థితు లుండవు. ఒకే స్థితి ఉంటుంది. అది ఆనందం. చక్కెర తీయగా ఉంటుందా, పుల్లగా ఉంటుందా అన్న స్థితి కాదు అది. ఆ మాధు ర్యాన్ని అనుభవిస్తున్న స్థితి. సంగీతం వింటూ ఇది ఏ రాగం ఏ తాళం అని తర్కించుకొనే స్థితి కాదు. ఆ గానాన్ని అనుభవించే స్థితి. ఆ స్థితిని మాస్టరుగారు తన ఉపన్యాసాల ద్వారా కలిగిస్తూం టారు. ఆ స్థితిని పొందటంకన్నా భాగ్య మేమిటి ?

ఉపన్యాసానంతరం అక్కడి వారందరూ మాస్టరు గారి పాదాలకు నమస్కరించటం ఆరంభించారు. క్యూ ఏర్పాటు చేయటా నికి శర్మగారు ప్రయత్నించారు గాని లాభం లేక పోయింది. నేను దూరంగా వచ్చి నిలబడవలసి వచ్చింది. గుంపులో త్రోసుకు వెళ్ళి నమస్కారం చేసి వస్తున్న వారిలో ఒకరిని నేను ప్రశ్నించాను. "మీరు నమస్కారం చేస్తున్న దెవరికి?" ఆయన "ఏమో తెలి యదు." అని సమాధానం చెప్పాడు. "అందరూ నమస్కారం చేస్తు న్నారు గదా! చేస్తే మంచిదని తోచింది చేశాను." "నాకు తెలి యదు గాని ఎవరో మహానుభావుడై ఉంటాడు." "నా ప్రక్క వారు నమస్కరించారు గదా అని నేనూ నమస్కరించాను." "నమస్కారం పెట్టవలె ననిపించింది. నమస్కరించాను. నాకు చాలా ఆనందంగా ఉంది." ఇలా తలొక్కరు తలొక సమాధానం చెప్పారు.

## నమస్కారాలు

ఇక్కడ నాకు నార్లవారి నమస్కారాలు గుర్తుకు వస్తున్నాయి. నార్ల వెంకటేశ్వరరావుగారు వారి ఆఫీసులో నమస్కారాలు చేసే విధానాలు ఇలా వర్ణించారు :

“మా దగ్గరకు చాలా తీరులవారు వేర్వేరు పనులకు వస్తుంటారు. అలాంటి వారికి, వారి వారికి తగ్గ నమస్కారాలు ఏర్పాటు చేసుకొని ఉంచుతాం. ఆశ్రితులు వచ్చి నమస్కరించినపుడు చేసే నమస్కారం ఒకటి. మనతో సమానంగా పనిచేసే వారిని ప్రోత్సహించే నమస్కారం ఒకటి. రచయితలు మొదలైన వారితో ఎన్నో పనులుంటాయి గాబట్టి, అవసర నమస్కార మొకటి. ఇతర పత్రికల ఎడిటర్లు వచ్చినపుడు చేసే మర్యాదా నమస్కార మొకటి. బాగా ధనాధిపతులు వస్తే అణకువతో కూడిన నమస్కారం ఒకటి. యజమానులు వచ్చినప్పుడు వినయ నమస్కారం. ఇలా ఆలోచించి నమస్కారాలు చేస్తుంటాము.

ప్రభాకర శాస్త్రిగారు మా ఆఫీసుకు వచ్చినపుడు ఎలా నమస్కరించాలి? ఎలా ప్రవర్తించాలి? పై చెప్పిన తరగతులలో వారు ఏ తరగతి వారు అని ఆలోచించాను. తెలియలేదు. వారొకరోజున ఆఫీసుకు రానే వచ్చారు. నేను అప్రయత్నంగా లేచి నిలుచున్నాను. నా ప్రక్కన పని చేస్తున్నవారు, ఆ గదిలో మిగిలిన అందరూ లేచి నిలుచున్నారు. అప్రియత్నంగా అందరూ నమస్కరించారు. శాస్త్రిగారు నన్నెంతో ప్రేమాదరాలతో బుజం తట్టి పలకరించారు. నా ప్రక్కనే కూర్చున్నారు. నేను నిలబడే మాట్లాడాను. వారు నన్ను కూర్చోమన్న తరువాతనే ఇతరులతో కలిసి కూర్చున్నాను. వారు వెళ్ళిపోయేటప్పుడు, అందరం లేచి వారి ననుసరించి మెట్లవద్ద సెలవు తీసుకొని తిరిగి ఆఫీసులోకి వచ్చేశాము. అప్పటి వరకూ నాకు ఇలా ప్రవర్తించాలి అనే ప్రత్యేక స్ఫురణ

లేదు. ఇలా నుంచోవడం సాగనంపడం అనే ప్లానులు లేవు. ఆయన మా యజమాని కాదు. ధనాఢ్యుడు గాదు. పండితుడని నేను అంగీకరించను. మరి యిలా ఎందుకు ప్రవర్తించాను? ఇలా ప్రవర్తించాలని ముందుగా ప్రోగ్రాం వేసుకోలేదే? శాస్త్రిగారిలో ఏదో ఒక ఆకర్షణ, అందరకు తాను మేలు చేయాలన్న సంకల్పం ఉన్నాయి. మంచి అన్నదానికి తప్పక నమస్కరించ వలసినదే'' అన్నారాయన.

ఈ సందర్భంలో రాధాకృష్ణమూర్తిగారు భారత నాటకంలో ఒక రంగాన్ని గుర్తు చేశారు. ''దుర్యోధనుడు రాయబారిగా వచ్చే కృష్ణుని అవమానించాలని భావిస్తాడు. కృష్ణుడు వచ్చినపుడు ఎవరూ లేచి నిలుచుండరాదని శాసిస్తాడు. కూర్చోవడానికి ఆసనం లేకుండా చేస్తాడు. ఇంతలో కృష్ణుని ప్రవేశం జరుగుతుంది. తన్మయులై అందరూ భక్తితో లేచి నిలబడి నమస్కారం చేస్తారు. దుర్యోధనుడే అప్రయత్నంగా లేచి నిలబడి, పరవశుడై కృష్ణునాహ్వానించి తన పీఠం మీద కూర్చోబెట్టుకుంటాడు.''

మాస్టరుగారికి అందరూ పాద నమస్కారాలు చేయడం, ఆ నమస్కారం చేస్తున్నవారి మనోభావాలు గమనించగానే ఇవన్నీ ఒక్కసారిగా నామనస్సులో స్ఫురించాయి.

ఇంతలో యోగమిత్రులొకరు మాస్టరుగారితో ''మాస్టరు గారూ! భోజనాలకు టైమయింది'' అన్నారు. మాస్టరుగారు చిరునవ్వుతో, ''ఇక్కడి మిత్రులందర్నీ చూడడం పూర్తి కావాలి. ఇంకా ఎవరికైనా మందులు కావాలేమో చూడాలి. అది మన పని. ఆ తరువాత భోజనాలు మీ పని.'' అన్నారు. ఇలాంటి సన్నివేశాలలో మాస్టరుగారిని చూస్తూంటే, ఆయన మాటలు వింటూంటే ఏదో తృప్తి, ఆనందం నిండిపోతాయి. నిస్వార్థమైన సేవ, దివ్యప్రేమ రూపుకట్టి మాటలాడుతున్నట్లు అనిపిస్తుంది.

ఆయన నుంచి వెలువడే ఒక్కొక్క మాటా మనలో ఏదో ఒక స్విచ్చి నొక్కుతున్నట్లు ఉంటుంది. ఆయన నుండి వెలువడిన ఏ ఒక్క మాటా మనను విడచిపెట్టడం ఉండదు. అప్పుడు మనకి తెలియక పోవచ్చు గాని, అవసరమైనప్పుడు మనకు గుర్తుకు వచ్చి మనను నడిపిస్తాయి. ఆ గుర్తు ఎప్పుడు రావాలో అనేది కూడా ఆయన అనుగ్రహమే. భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన శ్లోకం నాకు మాస్టరుగారిలో దర్శన మిస్తుంది.

## వాల్మీకి వాణి

ఆ పవిత్రమైన వాతావరణంలో ఆ రామనామ క్షేత్రంలో, రామసన్నిధిలో మాస్టరుగారు రామాయణంమీద చేసిన ప్రసంగం హృదయానందకరంగా ఉన్నది.

"వాల్మీకి రామాయణాన్ని-

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్

అనే శ్లోకంతో ప్రారంభించాలి. అసలు ఏ పవిత్ర గ్రంథాన్నయినా చదవబోయే ముందు రెండు పద్ధతులున్నాయి. ఒకటి మామూలుగా చదువుకుంటూ పోవడం. దానివల్ల ఆ గ్రంథం మనకి మన స్థాయిని బట్టే అర్థమవుతుంది. అంటే మనకి ఉన్న అభిప్రాయాలనే కళ్లద్దాలలో నుంచే చూసి అర్థం చేసుకో గలుగుతాము. ఇదికాక మరో పద్ధతి ఉంది. రచయితను భక్తితో ధ్యానం చేసి, మనం చదివే గ్రంథాన్ని ఆయన స్మరణలో సమర్పించాలి. అప్పుడు ఆ కవి ఏ భావాలతో గ్రంథరచన చేశాడో ఆ భావాలు మనలో ప్రవేశిస్తాయి. అందుకే రామాయణాన్ని వాల్మీకి స్తోత్రంతోనూ, భారత భాగవతాలను

'వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥'

అనే శ్లోకంతోనూ ప్రారంభించడం సత్సంప్రదాయం.

శ్రీమద్రామాయణం ఒక మహాకావ్యం. వాల్మీకి మహాకవి. రామాయణం భక్తి ముక్తి ప్రదాయిని. మనలోని దోషాలను ప్రక్షాళనం చేసే పుణ్య గంగాఝురి. ఆ గంగలో అవగాహన చేసేవారు పునీతులవుతారు. (అవగాహన అంటే మునక వేయడం, అర్థం చేసుకోవడం అని అర్థం. మన అస్తిత్వాన్ని రామాయణ తత్వానికి సమర్పణ చేసుకోవాలి.) అట్టి భక్తి, ముక్తి మరెందులో లభిస్తాయి? మనలోని దురహంకారాలన్నీ తొలగి అహంకారం రహితం కావడమే మనలోకి భక్తి ప్రవేశించినట్లు గుర్తు. "నేను చాలా గొప్ప భక్తుడను" అని నీలో స్ఫురణ ఉన్నంతవరకు భక్తికి బదులు పొగరు నిండి ఉంటుంది. హృదయంలో రాముడు నిలవాలంటే ముందు హృదయంలో భక్తి నిండాలి. అప్పుడు మరొక మెట్టుదాటి అందరియందు రాముని చూడగలరు. మనకంటికి వేరు వేరు వ్యక్తులుగా కనిపిస్తున్న వారందరూ ఒకే ఒక దివ్యప్రజ్ఞ యొక్క విలాసం, విన్యాసం అని దర్శించగలరు. ఇందరుగా కనిపిస్తున్న ఈ అందరినీ ఒక్కటిగా కలిపే తారక మంత్రం రామమంత్రం. పువ్వులు వేర్వేరు అయినా, వాటిని దండగా కూర్చేది దారమొక్కటే గదా! ఇప్పుడు మీరు నామెడలో వేసిన పూలదండలో ఒకే దారం ఉంది. ఇలా కలిపే సూత్రమే రామమంత్రం. ఆ రామమంత్రమే సూత్రమై వేర్వేరు పుష్పాలమైన మన నందరినీ ఒకచోట చేర్చింది. తెలిసి చేసినా తెలియక చేసినా రామనామ సంకీర్తన మనలోని ప్రజ్ఞను మేల్కొలుపుతుంది. ఈ సత్యాన్నే అజామిళోపాఖ్యానం చెబుతుంది. అతడు మహాక్రూరుడు. ఘోరపాపములు చేసినవాడు. చనిపోయేటప్పుడు తనలోని ప్రేమ నంతటినీ ఒక్క వ్యక్తిలో చేర్చి కూర్చి, దండచేసి, "నారాయణా!" అని ఆర్తితో, ప్రేమతో పిలిచాడు. అతడు పిలిచింది శ్రీమన్నారాయణుని కాదు. తన కుమారునే. కుమారునే ప్రేమతో పిలిచాడు. ఆ పిలవడంలోని ప్రేమే అతనికి రక్ష అయింది.

అగ్గిపెట్టె నిర్మాణం, అందులోని శాస్త్రరహస్యాలు మనకు తెలియకపోయినా, అగ్గిపుల్ల గీస్తే మంట వస్తుంది. అలాగే 'రామ' అనే రెండు అక్షరాలూ ఉచ్చరించగానే ఆయన ధర్మదీక్ష, సాధుజన రక్షణ, దుష్టశిక్షణ, సీతారాముల దాంపత్యంలోని మాధుర్యం, వారి దివ్య సౌశీల్యం గుర్తుకు వస్తాయి. మనలో ఒక దివ్యభావనను కలిగించి, ఒక దివ్య వాసనను ప్రచోదనం చేస్తాయి. మంచి మార్గాన్ని సూచిస్తాయి. చెడుగా ప్రవర్తించ దలచినప్పుడల్లా, రావణాసురుని గతిని గుర్తుకు తెస్తాయి. రామనామ స్మరణ మనను చెడుమార్గం పట్టకుండా కాపాడడమే కాకుండా, మంచి మార్గంవైపుకు, ధర్మమార్గం వైపుకు నడిపిస్తుంది. ముక్తికి మార్గం రామనామమే!

ముక్తి సాధనకు ఆర్భాటాలు అవసరం లేదు. దండ కమండలాలు ధరించి, జపమాలను చేతబట్టి, కాషాయాంబరం కట్టుకుని, జడలు పెంచినంత మాత్రాన ముక్తి లభించదు.

## గురువు – లఘువు

ఒక గురువుగారు ప్రజల రూపంలో ఉన్న అజ్ఞాన జీవులకి జ్ఞానోపదేశం చేసి, ముక్తిమార్గం ఉపదేశిస్తూండేవాడు. ఆయనకు తగినవాడే ఒక శిష్యుడు ఉండేవాడు. ఎవడికి వాడికే తగినవాడు ఏర్పాటు కావడం కర్మసిద్ధాంతంలోని పరమరహస్యం. గురువుగారిని గురించి గొప్పగా ప్రచారం చేసి ఆయన మహాత్మ్యాన్ని నలుదెసలా వ్యాపింపజేయడం అతని కర్తవ్యం. బాగా ప్రచారమైన గ్రామాలకు గురువుగారు వెళ్లి ఉపదేశాలిచ్చి, గురుకట్నం సంపాదిస్తూ ఉండేవారు. గురుశిష్యులిద్దరూ ఆ సొమ్మును సమత్వంతో పంచుకునే వారు. ఒకసారి ఈ సమత్వంలో తేడా వచ్చింది. "నేను కష్టపడి ప్రచారం చేశాను గనుకనే ఇంత కలెక్షను వచ్చిందీ, నీవు గురువుగా రయిందీను! కనుక ఈ వ్యాపారంలో

నాకే పెద్దవాటా రావాలి" అని శిష్యపరమాణువు 'శ్రీ' విద్య సాయించాడు. "ఈ దండకమండలాలు, కాషాయం, పావుకోళ్లు కష్టపడి ధరించి ఉపదేశాలు, ఉపన్యాసాలు నేను ఇవ్వడం చేతనే గదా, ప్రజలు కట్నాలు ఇస్తున్నారు? కనుక నాకే పెద్ద వాటా రావాలి." అని గురువుగారు గురుబాలప్రబోధిని బోధించారు. తేలలేదు. చివరికి తన ప్రతాపం ఎంతవరకో గురువుగారికి చూపించాలని సంకల్పించి ఆచమనం చేశాడు శిష్యుడు.

అతడు ఒక గ్రామానికి వెళ్ళి అన్ని ఏర్పాట్లూ ఘనంగా ఏర్పాటు చేశాడు కట్నంతో సహా. అక్కడివారు, "గురువుగారు ఏం పుచ్చుకుంటారు?" అని అడిగితే "మా గురువుగారు సర్వసంగ పరిత్యాగులు. మహాతపస్వి. ఏమీ పుచ్చుకోరు. ఏమైనా ఇవ్వ జూపడం కూడా మహాపచారం" అని చెప్పాడు. గురువుగారు వచ్చి యథావిధిగా ఉదయం పూజ చేశారు. తీర్థం తాను పుచ్చు కొని అందరికీ ఇచ్చారు. ప్రసాదం పళ్ళెం శిష్యుడు అందుకున్నాడు; పాపం గురువుగారు వాసన కూడా చూడలేదు. మధ్యాహ్నం ఉపన్యాసం, ఉపదేశం అయింది. ఎవ్వరూ ఏమీ తీసుకు రాలేదు. ఆకలి మండిపోతోంది. భోజనం లేదు సరిగదా, కనీసం అరటి పండయినా ఎవ్వరూ ఇవ్వలేదు. చివరికి శిష్యుడు చేసిన పని తెలుసుకుని లబోదిబో మన్నాడు గురువుగారు."

## మానవ మాధవ సేవ

ఈ కథ చెప్పి మాస్టరుగారు ఇలా అన్నారు. "మాకు మీ వద్దనుండి ఏమీ అక్కర లేదు. మేమిచ్చే మందులు మాత్రం శ్రద్ధగా వాడి, ఆరోగ్యం నయం చేసుకోండి. గురువు అంటే శిష్యు లకి కావలసినవి యిచ్చేవాడేగాని ఏమీ పుచ్చుకునే వాడుకాదు.

మీరు అందరిలోను రాముని దర్శించడం నేర్చుకోండి. ఉన్నంతలో ఇతరులకు అవసరంలో సహాయం చేయండి. ఇతరులకు సేవ చేస్తున్నాను అనే భావం మనను అహంకారం లోనికి లాక్కుని పోవచ్చును. అందరియందు భగవంతుని దర్శించి, వారిలోని భగవంతునికి సమర్పణగా సేవ చేయండి. అలా సేవ చేయగలగడం మన భాగ్యంగా, బాధ్యతగా గుర్తుండడమే ప్రేమ. అట్టి ప్రేమను పెంచుకోండి. ఉత్సాహంతో సత్కర్మాచరణకు పూనుకోండి. జయాపజయాలు మీకు సంబంధించినవి కావు. కష్టసుఖాల యెడల సమత్వం వహించడం అలవాటు చేసుకోండి. చేసిన ప్రయత్నానికి ఫలితాన్ని ఆశించడం కోరి దుఃఖాన్ని తెచ్చుకోవడమే! ఫలాపేక్ష లేకుండా కృషి చేయండి. అప్పుడు లాభం వస్తే పొంగిపోవడం, నష్టం వస్తే క్రుంగిపోవడం ఉండదు. ఇదే బంధం లేని మోక్షస్థితి.

నా ఉపన్యాసం కోసం మీరందరూ ఇక్కడ చాలా సేపటినించి ఎదురుచూస్తున్నారు. మార్గమధ్యంలో కారు ఆగిపోయిందనుకోండి. అంతమాత్రం చేత మీరు దుఃఖపడ నక్కర లేదు. ఆ సమస్థితికి మీరు చేరుకోవాలి. నేను వచ్చేసరికి ఇక్కడ ఎవ్వరూ లేరనుకోండి. అప్పుడు నేను దుఃఖపడకుండా ఉండగల స్థితికి నేను చేరాలి. ఈ స్థితినుంచి దిగజారి, నా గురించి మీరు, మీ గురించి నేను దుఃఖిస్తే అది బంధమే అవుతుంది. శ్రీరామచంద్రునికి పట్టాభిషేకం అన్నారు. మళ్ళీ కాస్సేపట్లో ఆగిపోయిందన్నారు. వెంటనే అడవులకు ప్రయాణం అన్నారు. అప్పుడు రాముడేం చేశాడు? 'అయ్యో!' అని తల పట్టుకున్నాడా? లేదు. కొత్తపెళ్లికొడుకులా వెంటనే అడవికి బయలు దేరాడు! రాజ్యసుఖాలు అతన్ని బంధించలేదు. ఇదీ రాముని నుండి మనం గ్రహించ వలసినది.

మన కర్తవ్యాన్ని మనం త్రికరణ శుద్ధిగా నిర్వర్తించాలి. ఫలితాలను ఆశిస్తూ మనస్సుకు బానిస కాకూడదు. మనస్సు

మనకు ఉపయోగపడే ఒక పరికరం, సాధనం కావాలేగాని, మనకి యజమాని కాకూడదు. దుఃఖపడినంత మాత్రాన పనులు సానుకూలం పడవు. దుఃఖించడం వల్లనే పనులు అయిపోతే మనం అందరం కూర్చుని చందాలు వేసుకుని దుఃఖిస్తాము గదా! పెళ్లి సంబంధం చూడడం, వధూవరులకు సరిపడేదీ, లేనిదీ నిర్ణయించడం, పెళ్లి చేయడం మొదలైన ప్రయత్నాలు మనం చేయాలి. ప్రయత్నం చేసేది మనమే అయినా అది ఈశ్వరార్పణంగా చేస్తే, ప్రయత్నాలు ఫలించినా, ఫలించకపోయినా సుఖదుఃఖా లుండవు. మనకు అంటవు. సమర్పణ బుద్ధితో పనులు చేయడం ప్రారంభించినప్పుడు పనులు కాకపోవడం, విఘ్నాలు కలగడం అనేవి ఉండవు. పనులు చేయాలనే సంకల్పం మన మనస్సునుంచి కాక పరమాత్మ అనే ప్రజ్ఞనుండి మనద్వారా వస్తుంది. మనద్వారా జరగవలసిన పని ఉన్నప్పుడు మాత్రమే పని చేయాలనే సంకల్పం మనకు కలుగుతుంది. మాట్లాడవలసిన మాటలు మాత్రమే మనద్వారా ఉచ్చరించ బడతాయి. ఈ స్థితికోసం మనం చేయవలసినది సాధన. ఈ స్థితిని చేరడం యోగసిద్ధి. యోగసాధన, కర్మయోగాలను గురించిన పరిపూర్ణ దర్శనం జనకుని జీవన విధానంలో మనకు కనిపిస్తుంది.

## జనకుని రాజ్యం

జనకుడు మిథిలా నగరాన్ని పరిపాలించే రాజు. ఋషిలాగా జీవితం గడుపుతున్నవాడు. కనుక రాజర్షి. క్షత్రియుడైన రాజు ఋషి కావడం ఈయన జీవితంలో మనకి కనిపిస్తుంది. రాజుగా ఆయన ప్రజలపై అధికారం చెలాయించినట్లు కనిపించదు. సన్యాసి లాగా సంసార బాధ్యతలు వదలివేసి అడవులకి వెళ్లి తపస్సు చేసిందిలేదు. కుటుంబ బాధ్యతలు సక్రమంగా నిర్వర్తిస్తూ, పరిపాలనా వ్యవహారాలు చూసుకుంటూ, ప్రజలను కన్న బిడ్డలలాగా

సాకుతూ, ప్రవర్తన ద్వారా కర్మయోగాన్ని ఉపదేశించిన పరమ ఋషిరాజు ఆయన. నాగలి చేతబట్టి క్షేత్రాన్ని దున్నాడు. నాగేటి చాలులో జగన్మాత అయిన సీతను కన్నాడు. పశుపక్ష్యాదులకూ, మానవులకూ ఆహార మిచ్చి పోషించే మాతృమూర్తిని భూదేవిలో దర్శించాడు. తాను కృషి చేశాడు. అందరిచేతా కృషి చేయించాడు. అందుకే ఆయన పాలనలో కరువు కాటకాలు, ఆకలి బాధలు లేవు. కష్టపడి పనిచేసే దేశంలో తిండి బట్టలకి లోటు ఉండదని అర్థశాస్త్రాన్ని సార్థకంగా చెప్పినవాడు ఆయన. "అందరం కలిసి పని చేద్దాం. భూమిని దున్నుకుందాం. పండించుకుందాం" అన్న జనకుని అర్థశాస్త్రానికీ, "దున్నేవాడిదే భూమి, మోసేవాడిదే మూట" అన్న ఈ శతాబ్దపు పోలికేకలకు ఎంతో భేదం ఉంది. బాధ్యతలు నిర్వర్తించాలి అనేది జనకుని రాజ్యాంలోని జీవన విధానం. హక్కులకోసం పోరాడాలి అనేది నేటి సంఘర్షణ. ఇతరులు మన కేం చేయాలి? ప్రభుత్వాం మన కేం చేయాలి? మన హక్కులు మనం ఎలా కాపాడుకోవాలి? అనే విధానం వల్ల సంఘర్షణలు, అశాంతి, దుఃఖం కలుగుతాయే తప్ప సుఖశాంతులు దొరకవు. ఇతరులకు మన మేం చేయగలుగుతున్నాం? ప్రభుత్వానికి మనం ఏం చేయగలుగుతున్నాం? మన బాధ్యతలు మనం సక్రమంగా నిర్వహించగలుగుతున్నామా లేదా? — అనే జీవన విధానంలో సుఖమూ, శాంతీ కొల్లలుగా లభిస్తాయి. హక్కుల కోసం పోరాటం రావణరాజ్యం. బాధ్యతలను నిర్వహించడం జనకుని రాజ్యం.

ఇటువంటి ప్రవర్తన మనకు అలవడాలంటే, సాటి మానవుల యెడల, రాజ్యము యెడల, రాజు యెడల ప్రేమ, గౌరవము, భక్తి అలవరచుకోవాలి. హృదయం భక్తిమయం కావాలి."

ఆ ప్రసంగంలోనే భక్తిని గురించి ఒక చక్కని కథ చెప్పారు మాస్టరుగారు. (చిన్న చిన్న కథల ద్వారానే మహత్తర మైన సత్యాలను హృదయ రంజకంగా వివరిస్తారు మాస్టరుగారు.)

భక్తుల పాదధూళి

శ్రీకృష్ణుడు అష్టమహిషులతోనూ ద్వారకా నగరంలో కాలక్షేపం చేస్తున్న రోజుల్లో, ఒకనాడు అతనికి భరించరానంత తలనొప్పి వచ్చిందట. ఊరూ వాడా ఏకమయ్యేటట్లు కేకలు వేస్తున్నాడు. అందరూ కంగారు పడుతున్నారు. రాజవైద్యులు ఎన్నెన్నో పరీక్షలు చేశారుగాని రోగ నిదానం సాధ్యం కాలేదు. అందరితో పాటు కంగారు పడుతున్న బాల్యమిత్రుడు ఉద్ధవుని పిలిచి, కృష్ణుడు రహస్యంగా ఒకమాట చెప్పాడు. ఈ తలనొప్పి ఇదివరకు గోకులంలో ఉన్నప్పుడు కూడా వచ్చేదనీ, అప్పుడు తన భక్తుల పాదధూళి పట్టీగా వేస్తే తగ్గిపోయేదనీ చెప్పి, ఇప్పుడు కూడా భక్తుల పాదధూళి తెచ్చిపెట్టమని అడిగాడు. ఉద్ధవుడు విస్తుపోయాడు. భక్తులు కృష్ణుని పాదధూళిని శిరసా ధరించడం, పునీతులు కావడం ఎరుగుదుము కాని, భక్తుల పాదధూళిని కృష్ణుడే శిరసా ధరించడం ఎరగమే! ఇదెక్కడి విడ్డూరం? అనుకున్నాడు. కాని ఒకవైపునుంచి కృష్ణుని తలనొప్పి కేకలు వినబడుతున్నాయి. ఇక తప్పనిసరిగా, అపచారం అనుకుంటూనే భక్తులను వెతుక్కుంటూ బయలుదేరాడు భక్త శిఖామణి అయిన ఉద్ధవుడు. మొదట సత్యభామాదేవి వద్దకు వెళ్ళాడు — కృష్ణుని ప్రియభార్య కదా అని. ఆమె "ఎప్పుడో పొరబాటునో, గ్రహపాటునో నా పాదం ఆయన శిరస్సుకి తగిలింది. మళ్ళీ అలాంటి పొరపాటు చేస్తానా? అసంభవం." అని ఖచ్చితంగా చెప్పింది. రుక్మిణీదేవి వద్దకు వెళ్ళాడు ఉద్ధవుడు. ఆమె, "పతివ్రత అయిన స్త్రీ తన భర్త పాదధూళిని శిరస్సున ధరించి తరిస్తుంది గాని, తన పాదధూళి భర్త శిరస్సుకు

తగలనిస్తుందా? ఇది మహాపాపం కాదా నాయనా?'' అన్నది. "అగ్రమహిషు లిద్దరూ ఇవ్వలేకపోతే మేమెంత? మేము అంత భక్తులమూ కాదు, ప్రియభార్యలమూ కాదుగదా!'' అన్నారు మిగిలిన భార్యలు. ఉద్ధవుడు నిరాశతో కాళ్ళీడ్చుకుంటూ బయటికి వచ్చేశాడు. కృష్ణుని మందిరం దాపులకి వెళ్ళేసరికి కృష్ణుని కేకలు వినిపిస్తున్నాయి! ఉద్ధవుడు గిరుక్కున తిరిగి గోకులంకేసి బయలు దేరాడు - యశోదాదేవిని కనుక్కుందామని! ద్వారకా నగరం దాటి కొద్ది దూరం వెళ్ళేసరికి గోకులం నుంచి పాలు పెరుగు తెస్తున్న గోపికలు వరుసగా వస్తున్నారు. ఉద్ధవుని చూశారు. ఆప్యాయంగా పలకరించారు. అలా ఉన్నావేమని అడిగారు. ఉద్ధవుడు విషయమంతా వివరంగా చెప్పాడు. ఆ గోపిక మరేమీ ఆలోచించలేదు. కృష్ణుడికి తలనొప్పిగా ఉందట : భక్తుల పాదధూళితో తగ్గుతుందట! ఈ రెండు విషయాలే గుర్తున్నాయి ఆమెకు! నెత్తిమీది గంప అయినా దింపలేదు. కాలితో ఇంత దుమ్ము ఎగరేసి చేత్తో అందుకుని, ఉద్ధవుని ఒడిలో పోసిందాక గోపిక. అందరూ అలాగే తలొక గుప్పెడూ పాదధూళి యిచ్చారు. ఉద్ధవుని ఒడి నిండిపోయింది. ఆ మూట నెత్తిన పెట్టుకుని ద్వారకలో ప్రవేశించాడు. పాదధూళి యిస్తున్న ఆ సమయంలో గోపికలకు యుక్తాయుక్త విచక్షణ లేదు. పాపపుణ్య విచారణ లేదు. కృష్ణుని తలనొప్పి తగ్గడం ఒక్కటే వారికి కావలసింది. తాము భక్తులము అవునా, కాదా అనే సంశయం వారికి కలుగనేలేదు! మిగిలినవారి కందరికీ తాము వేరు, కృష్ణుడు వేరు. ఇద్దరికీ మధ్య ఉన్న సంబంధం భక్తి. అది ఎంతకాలం ఉంటుందో వారికే తెలియదు. కాని గోపికలలో ఉన్నదంతా కృష్ణభక్తే! కనుకనే వారికే అనుమానమూ రాలేదు.

హనుమంతుడు – శబరి

ఇదే నిజమైన భక్తి అంటే. నేను చాలా గొప్ప పండితుడనని అనుకున్నప్పుడుగాని, నాకిన్ని శాస్త్రాలతో పరిచయం ఉందని అనుకున్నప్పుడు గాని అహంకారం నిండి ఉంటుందే తప్ప భక్తి నిలవడానికి అవకాశం లేదు. హనుమంతుని భక్తి నిజమైన భక్తి. శ్రీరాముని ఆజ్ఞ అనగానే ఆ పని చేయడమే గాని మరో ఆలోచనే ఉండదు. ఇది చేయవచ్చునా, చేయకూడదా–అనే తర్కం ఉండదు. చేయగలనా, లేదా అనే సందేహం రాదు. రాముడు చేయమని చెప్పడం, హనుమంతుడు చేయడం ఒకేసారి జరుగుతాయి. ఈ రెండూ వేర్వేరు అంశాలు కాదు. రెండూ ఒక్కటే!

అలాగే శబరి భక్తికూడా అచ్చమైన భక్తి. ఆమె ఏండ్ల తరబడి శ్రీరామచంద్రుని దర్శనభాగ్యం కోసం ఎదురు చూచింది. ఆ ఎదురుచూడటంలో పరమ ప్రేమ, నిర్మలమైన భక్తి తప్ప వేరే భావాలేమీ లేవు. మనం ఎదురు చూడడమంటే స్వార్థమో, మోహమో, మరేదో ఉంటుంది. రాజకీయనాయకు లెవరైనా వస్తున్నారంటే నిద్రాహారాలు మానుకుని, పూలదండలు చేతబట్టుకుని ఎదురుచూస్తుంటాం. ఇదీ భక్తే కావచ్చునేమోగాని అచ్చమైనభక్తి కాదుగదా! శబరిది ఇలాంటి భక్తి కాదు. ఒక కలెక్టరుగారి కోసం మనమూ, ఆయన తల్లి ఎదురుచూడడానికిగల తేడా ఏమిటో గమనించండి. మనం మన ప్రయోజనంకోసం ఎదురు చూస్తాము; ఆయన తల్లి, "అయ్యో! బిడ్డ ఇంతవరకూ ఇంటికి రాలేదే? పనుల తొందరలో ఎక్కడ తిరుగుతున్నాడో? ఎంత ఆకలితో బాధ పడుతున్నాడో?" అని ఎదురు చూస్తూఉంటుంది. ఇది వాత్సల్యం, ప్రేమ. ఇలాంటి వాత్సల్యం ముద్దగట్టి, మూర్తి గట్టిన భక్తురాలు శబరి. రాముడు రాగానే ఆమెకు గుర్తున్నదల్లా రాముని ఆకలి, ఆయన రుచి! రుచిగా ఉన్నాయో లేదో ఎలా తెలుస్తుంది?

అందుకనే కొంచెం కొరికి రుచిచూసి, తీయని పళ్లు శ్రీరామునికి సమర్పించింది. అక్కడ 'ఎంగిలి' అనే ఎంగిలి భావానికి చోటు లేదు. ప్రేమ ఒక్కటే ఉంది. రాముడు కూడా ఆ ప్రేమనే స్వీకరించాడు గాని ఎంగిలి అనేది ఆయనకూ కనిపించలేదు. ఆమె జన్మ తరించింది.

ఆమె హృదయం పవిత్రమైనది. నిర్మలమైనది. ఆమె సర్వస్వము రామునికి సమర్పణ అయింది. ఎవరు చేసినా అలాంటి సమర్పణమే చేయాలి. మనస్సులో సంశయాలు దాచుకున్నవారు, రహస్యాలు దాచుకున్నవారు, భయాలు నింపుకున్నవారు సమర్పణ చేయలేరు. పూవు పరిమళించడంలో రహస్యమేమీ లేదు. అది వికసించి, పరిమళించి, భగవంతుని పూజాసుమంగానో, మరో విధంగానో సార్థకం అవుతుంది; అలాగే మనస్సు అనే మొగ్గ ప్రేమ అనే పువ్వుగా వికసించి, తన పరిసరాలకు పరిమళాలను వెద జల్లాలి. అది భగవంతుని పాదాలచెంత సమర్పణ కావాలి. భక్తి, సమర్పణలేని హృదయంతో మోక్షం కోసం ఎంత ప్రయత్నించినా లాభం లేదు.''

## గురు సన్నిధి

భగవంతుడుగాని, గురువుగాని మన పాపాలను పోగొట్టాలని కోరడం మన స్వార్థాన్ని తెలియ జేస్తుంది. చాలామంది తమ పాపాలను సమర్పణ చేయడమే సమర్పణగా భావిస్తుంటారు. ఈ స్వార్థచింతనవల్ల ప్రయోజనం లేకపోగా ఒక అపకారం కూడా ఉంది. గురువు అనుగ్రహంవల్ల, లేదా ఒక వ్రతాచరణవల్ల, చేసిన పాపాలు క్షాళన మైనాయని అనుకుంటే, మళ్ళీ పాపాలు చేసినా ఫరవాలేదు అనే బురదలోకి దిగడం జరగవచ్చు. చేసిన అపచారా లను సవరించుకోవడం, సత్కార్యాచరణ ద్వారా దుష్కర్మ ఫలితాలను రహితం చేసుకోవడం శిష్యుని కర్తవ్యం. అనుగ్రహం

కోసం గురువును ప్రార్థించాలేగాని, చేయవలసిన సాధన అంతా శిష్యుడే చేసుకోవాలి. ఈ సాధన ప్రయత్నం మాత్రం గురువుకు సమర్పితంగానే చేసుకోవాలి. అప్పుడే గురువు శిష్యుని కేది అవసరమో దానిని ఇవ్వడానికి వీలు పడుతుంది. నీ మనస్సుకు నచ్చినది నీవే నీ గురువును ఎన్నటూ కోరరాదు. అలా కోరడం వలన నీ పురోగతికి నీవే అడ్డువేసుకున్నవాడవవుతావు. నీకేది అవసరమో నీకన్నా నీగురువుకే ఎక్కువ తెలుసును – అన్న సత్యంలో నమ్మకం ఉంచి జీవించడం అభ్యాసం చేయాలి. గురువుకు నీవేమీ ఇవ్వనక్కర లేదు. గురువు అంటే నీనుంచి ఏదీ ఆశించే వాడు కాదు; నీకు ఏది మంచిదో అది సమకూర్చి పెట్టేవాడు – అని తెలుసుకోవాలి.

ఇతరుల నుంచి ఏదైనా స్వీకరించాలి అని కాక, నీకున్నది ఇతరులకు పంచి యివ్వాలి అనే ధర్మాన్ని రామాయణం బోధి స్తుంది. శబరి రామునికి పళ్లు సమర్పించడం కోసం ఎదురుచూసింది. హనుమంతుడు రామకార్యం నిర్వర్తించడం కోసం ఎదురు చూశాడు. వారిద్దరూ రామునివద్దనుంచి ఏనాడూ ఏమీ ఆశించింది లేదు. 'ఈరాజ్యం నీది' అని రాముడు, 'కాదు, ఈ రాజ్యం నీదే' అని భరతుడు వాదించు కున్నారు. ఇది నాది, ఇది నాది అని వాదించుకోవడం మన మెరుగుదుము గాని, ఇది నీది, ఇది నీది అని వాదించుకోవడం మనకు తెలియదు. అంత మంచి హృదయాలు గనుకనే ఇంతకాలం మన హృదయాలలో అవతారమూర్తులుగా నిలిచి పోయారు. గుహుడు రాముడి కోసం ఎదురు చూశాడు. "రామునికి నేనేం చేయగలను? రాముడికి ప్రీతి కలిగించడం ఎలా?" అని ఎదురు చూశాడు. ఇలా ఎదురు చూడడంలో భగవంతుని యందు మన హృదయం నిలబడుతుంది. అంటే మన హృదయంలో భగవంతుడు నిండి ఉంటాడు".

## వేదార్థ సమన్వయం

జిజ్ఞాసువైన ఒక శిష్యుని ప్రశ్నకు సమాధానంగా మాస్టరు గారు ఇలా అన్నారు. "వేదంలో ధర్మం, సత్యం చెప్పబడిన తీరు వేరు. అవి శాసనస్వరూపంగా ఉంటాయి. అవి అనుభవానికీ, దర్శనానికీ అందుతాయే తప్ప అర్థం కావడం కష్టసాధ్యం. వేదం అర్థమయేటట్లు చేయడానికే వాల్మీకి మహర్షి రామాయణాన్ని, వ్యాస భగవానులు భాగవతాన్ని రచించారు. వానిలోని పాత్రలు, సన్నివేశాల వెనక వేదార్థాలు నేపథ్యంలో గోచరిస్తాయి.

దశరథుడు జీవుడు. ఆయన ముగ్గురు భార్యలూ, సత్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు. కౌసల్య సాత్త్విక స్వభావం కలది. శాంతమూర్తి, జ్ఞానస్వరూపిణి, ధర్మశీలానికి ప్రతినిధి. సుమిత్ర రాజస స్వభావం కలది. కార్యదీక్షకు, దక్షతకు ప్రతినిధి. ఇక కైకేయి తామస స్వరూపిణి. నాకిది కావాలనే పట్టుదల, మూర్ఖత, పూర్వాపర విమర్శ చేయకపోవడం అనే లక్షణాలు కలది.

యజ్ఞంనుంచి లభించే నాలుగు పురుషార్థాలు దశరథుని నలుగురు కుమారులు. అర్థం, సామర్థ్యం, శత్రుజయం అనే లక్షణాలకు ప్రతినిధి శత్రుఘ్నుడు. ధర్మం, సేవాధర్మం, రాజ ధర్మాలకు లక్ష్మణుడు ప్రతినిధి. కామం, ధర్మార్థ సంగతమైన సత్యకామం, దీక్ష, స్వార్థరహితమైన దివ్యకామములకు గుర్తు భరతుడు. చిట్ట చివరిమెట్టు - దివ్యశక్తి, దివ్యదర్శనం, లోకకల్యాణం - అనే తురీయార్థానికి చిహ్నం రాముడు. అసూయ, కక్ష, లోభం అనే అసుర లక్షణాలకు ప్రతినిధి మంథర. దుష్టబుద్ధి, క్రౌర్యం, కామం, నాశనం అనే లక్షణాలకు శూర్పణఖ చిహ్నం. ఈ జీవునికి ప్రాణం అయిన శక్తి సీతాదేవి. ప్రాణశక్తి అయిన సీతకు ప్రాణనాథుడు, జగత్ప్రాణనాథుడు రాముడు. ఇలా రామాయణాన్ని చదువుకుంటే ఎన్నో ప్రజ్ఞలకు ప్రతిరూపాలు దర్శనమిస్తాయి."

ఇలా రామాయణ కథాకథనంతో విశేషాల వివరణతో ఆరోజు మాస్టరుగారి ఉపన్యాసం ఎంతసేపు సాగిందో మాకు గుర్తు లేదు.

# అగ్నిజ్వాలల మధ్య గురుపూజలు

"గురుపూజలు యథాప్రకారం చక్కగా జరుగుతాయి" అన్నారు మాస్టరుగారు. 1973వ సంవత్సరం జనవరి నెల. ఆంధ్ర రాష్ట్రం కోసం ఉద్ధృతంగా ఆందోళన జరుగుతున్న రోజులు. విశాఖపట్టణం అంతా పోలీసువారిచేత అష్టదిగ్బంధం చేయబడి ఉంది. కాస్త అవకాశం దొరికితే చాలు, ఆందోళనకారులు విధ్వంస కాండకు దిగుతున్నారు. మనుష్యులు రోడ్డుమీద కనిపిస్తే ఇటు పోలీసులు లాఠీఛార్జి చేస్తున్నారు. తప్పుకో గలిగితే ఆందోళన కారుల రాళ్ళదెబ్బలో, కర్రదెబ్బలో తప్పడం లేదు. రోడ్లన్నీ ఖాళీగా ఉన్నాయి. రోడ్ల వెంబడి వరసగా దహనకాండ జరుగుతోంది. ఎవ్వరూ సందు గొందులలో నుంచి కూడా బయటికి రావడానికి వీల్లేకుండా ఉంది. మార్కెటు బంద్, కరెంటు సప్లయి బంద్. వాహనాల రాకపోకలు బంద్. ఈ పరిస్థితులలో గురు పూజలు ఎలా జరుగుతాయని చాలామందికి అనుమానం వచ్చింది. మాస్టరుగారు ఇలా అన్నారు :

"నిండుమనస్సుతో, పరిపూర్ణ విశ్వాసంతో ఒక మంచి పనిని మొదలు పెడితే అది జరగక పోవడం ఉండదు. మనం చేయడం అయితే జరగడం, జరగక పోవడం ఉంటుందిగాని, ఇటువంటి పనులు

మనం ప్రారంభించడమే! అవే జరిగిపోతాయి. మనం నిమిత్త మాత్రింగా ఉంటూ మన ద్వారా జరుగుతూంటే ఆ విధంగా ఆచరించడమే! స్విచ్చివేయడమే మన వంతుగాని, విద్యుత్తు దానంతట అదే నిర్ణీత మార్గంలో ప్రసార మవుతుంది. మధ్యలో మనవల్ల షార్ట్‌సర్క్యూట్ జరగకుండా చూడడమే మన కర్తవ్యం."

మాస్టరుగారు అన్నట్లుగానే గురుపూజలు జరిగాయి. ఇంకా చెప్పాలంటే మునుపటికన్నా బాగా జరిగాయని చెప్పవచ్చు.

"పంచాగ్ని మధ్యంలో"

ఇంకా గురుపూజలు ఒకటి రెండు రోజు లున్నాయనగా కర్ఫ్యూకూడా విధించారు. ఇంతవరకూ బయట తిరిగితే ప్రమాదమే. ఇప్పుడు రోడ్డుమీద కనబడితే నేరమూ, ప్రమాదమూ కూడాను! గురుపూజలు విజయనగరం రాజాగారి బంగళాలో ఏర్పాటయినాయి. అక్కడ నీటిసరఫరా లేదు. (పంపులు పని చేయవు.) విద్యుచ్ఛక్తి సరఫరా లేదు. గురుపూజలకు కావలసిన బియ్యమూ, సరుకులూ లేవు. ప్రతిపూటా పాలు సరఫరా కావాలి. ఏ వాహనం బయటికి వెళ్ళినా, ఆ వాహనమూ, మనుష్యులూ క్షేమంగా తిరిగి వస్తారని నమ్మకం వీసమెత్తుకూడా లేదు. ఈ అగ్ని జ్వాలా మధ్యంలో, బయట ఊళ్లోనించి వచ్చి పాల్గొనే సోదరులతో సహా, రెండు మూడువేల మంది పాల్గొనే గురుపూజలు నిర్వహించడం అనేది సామాన్యులకు హాస్యాస్పదంగా కనిపిస్తుంది. కాని మాస్టరుగారు 'జరుగుతాయి' అన్నారు. అంతే!

"కలయో? వైష్ణవమాయయో?"

రామమనోహర్, రెడ్డి అనే ఇద్దరు సోదరులు ముందుకు వచ్చారు. లారీ తీసుకుని విజయనగరం బయలుదేరారు. దారిలో ప్రమాదకరంగానే ఉన్నా విజయనగరంలో మార్కెట్ ఉంది.

బియ్యం, సరుకులు అన్నీ తీసుకొని, నకులుని సారథ్యంలాగా ప్రవహా దాలలో నుంచి దూసుకుంటూ వచ్చేశారు. విజయనగరం బంగళాలో నీటి సరఫరా లేదు. ఆ బంగళా ఆవరణలో దాదాపు నూరు అడుగుల లోతున ఒక నుయ్యి ఉంది. దానికి గిలక కూడా లేదు. అప్పటికి కరెంటు సరఫరా కూడా లేదు. డిపార్టుమెంటువారు కనెక్షను ఇంకా ఇవ్వలేదు. "ఈ అంధకారంలో రాత్రి, తెల్లవారు జామున నీళ్ళు ఎలా మోసుకురావడం?" అన్నవాళ్ళు ఉన్నారు. ఏదీ అనకుండా 10 వ తేదీ సాయంత్రం కార్యరంగంలోనికి దిగిన వాళ్ళు దిగారు. అయిదారుగురు నీళ్ళు తోడి పోస్తుంటే పాతిక ముప్పై మంది కుర్రవాళ్లు, బాలికలు నీళ్లు మోసుకుని పోయి, ఆ నూరడుగుల కొండనూ ఎక్కి డ్రమ్ముల్లో పోశారు. సన్నగా, గాలి వీస్తే ఎగిరి పోయేటట్లు ఉన్న యువకులు, 15, 16 సంవత్సరాల వయస్సులో సన్నగా ఉన్న బాలికలు పెద్దపెద్ద గంగాళాలను మోసుకు పోతుంటే చూస్తూ నుంచున్న వాళ్లకి నమ్మశక్యంకాలేదు. వీళ్ల దేహాల్లో నిజంగా ఇంత శక్తి ఉన్నదా? లేకపోతే ఎక్కడ నుంచి వస్తోంది? "పని మనద్వారా జరగడమే గాని మనం చేయడం ఉండదు" అన్నాడు మాస్టరుగారు. అలాగే శక్తి కూడా మన ద్వారా ప్రసరిస్తోంది. అని నమ్మకం కలిగితీరుతుంది ఆ దృశ్యం చూస్తే. కావలసిన నీళ్లన్నీ చిన్న పిల్లలే ముఖ్యంగా మోసుకొచ్చారు. సాయంత్రానికి కరెంటు సప్లయి వచ్చింది. మర్నాటి ఉదయానికి లారీలమీాద డ్రమ్ములతో నీళ్లు వచ్చాయి. ఆ తర్వాత నీళ్లు తోడవలసిన అవసరం రాలేదు. మాస్టరుగారి అనుగ్రహం ఉంటే చిన్న పిల్లలు కూడా మహాకార్యాలే చేయగలరని నిరూపించడానికే ఒక్కపూటకు నీళ్లుమోయడం జరిగింది.

ఇక బయటి ఊళ్లనించి వచ్చే సోదరులు వందలాదిమంది స్టేషనులో దిగారు. ఆ ఆందోళన సమయంలో ఏ బండి ఎప్పటికి

చేరుతుందో చెప్పడం కష్టం. అలాంటి పరిస్థితుల్లో వందల కొద్దీ సోదరులు స్టేషనులో దిగి మాస్టరుగారికి నమస్కారం చేసుకుంటూ ఉండిపోయారు. ఏరవాణా సాధనాలూ నడవడంలేదు. బయటికి రావడానికి పోలీసులు ఒప్పుకోరు. ఆ పరిస్థితిలో సెంట్రల్ రిజర్వుపోలీసు అధికారులు కొందరు, "మీరందరూ ఎక్కడికి వెళ్లాలి?" అని అడిగారు. "ఇలా గురుపూజలకు వచ్చాం. విజయనగరం బంగళాకి వెళ్లాలి." అన్నారు సోదరులు. ఆ అధికారులు అందర్నీ ట్రక్కులు, లారీలు సామానులతో సహా ఎక్కించి క్షేమంగా గురుపూజా భవన ప్రాంగణంలో దింపారు. సామానులు కూడా వారే సహాయం చేసి దింపారు. ఊళ్లో ఉన్న సోదరులు కూడా ఏదో ఒక విధంగా వచ్చారు. "మా ప్రక్కనుంచే మిలిటరీ లారీ వెళ్లింది. కాని మమ్మల్ని ఏమీ అనలేదు." అని కొందరు, "మమ్మల్ని మిలిటరీ వారు సరదాగా పలకరించారు" అని కొందరు, "వారే మమ్మల్ని ఇక్కడిదాకా దింపారు" అని కొందరు తమ అనుభవాలను కొన్ని నెలల పాటు చెప్పుకున్నారు. కావలసిన పాలు ఏపూట కాపూట లారీలోనే వెళ్లి తీసుకువచ్చేవారు. నీళ్లు కూడా ఎన్నోసార్లు లారీలోనే వచ్చాయి. ఎప్పుడూ ఏ లారీ అలజడిలోగాని, పోలీసులు, మిలిటరీవారి చూపుల్లోగాని ఇరుక్కోలేదు. వారిని తప్పించుకోవడానికి లారీల్లో వెళ్ళిన సోదరులెవ్వరూ ప్రయత్నించలేదు. కాని మాస్టరుగారి అనుగ్రహంవలన తప్పించుకుని వచ్చేశారు.

నగరమంతా చీకటిమయంగా ఉంటే మధ్యన రాజాగారి బంగళా రంగురంగుల దీపాలతో దేదీప్యమానంగా వెలిగిపోయింది. ఆ గురుపూజలు ఎప్పుడూ లేనంత బ్రహ్మాండంగా జరిగాయి. పెద్దలు చెప్పే వాక్యాలు దర్శనం కావాలంటే ఇటువంటి సన్నివేశాలే ఎదురవ్వాలి మరి!

# 1976 - గురుపూజల విశేషాలు

1976వ సంవత్సరం జనవరి మొదటి వారంలో గుంటూరులో యోగమిత్రుల సమావేశం ఎ. వి. శర్మ గారి యింట జరిగింది. మిత్రులు కోదండరామశర్మగారు, సాంబశివరావు గారు మొదలైన వారు పాల్గొన్నారు. జనవరి 11, 12, 13వ తేదీలలో జరిగే గురుపూజలకి అందరం కలసివెళ్లాలని అనుకున్నాం. గుంటూరులో గురుపూజల సన్నాహాలు అప్పటికే ప్రారంభమైనాయి. కోదండరామశర్మగారు గోంగూర పచ్చడి, ఇంకొకరు నెయ్యి, ఇంకొకరు దోసఆవకాయ - ఇలా అందరూ సంబారాలు సిద్ధం చేస్తున్నారు. అన్నింటినీ సమకూర్చుకుని మేమందరం 11వ తేదీ ఉదయానికి విశాఖపట్టణం చేరుకున్నాము. మళ్ళీ రాజాగారి బంగళాలోనే గురుపూజలు ఏర్పాటైనాయి. ఈ సారి చాల పెద్ద సంఖ్యలో - మూడు వేలపైన - యోగబృందం సమావేశమైంది. అంత పెద్ద సమావేశం అంతకుముందు నేనెన్నడూ చూడలేదు.

ఈ సందర్భంలో ఒక అద్భుతం జరిగింది. ఖరగ్‌పూరు నుంచి కొందరు సోదరులు రైలులో విశాఖపట్టణం వస్తున్నారు. ఆ బృందమంతా గురుపూజల వైభవాలను గురించే చాలా ఆనందంతో ముచ్చటించుకుంటున్నారు. వారి తోటి ప్రయాణీకులు కొందరు,

మన సోదరులు వివరంగా గురుపూజలను గురించి, మాస్టరుగారిని గురించి చెప్పుకుంటుంటే విన్నారు. అంతకుముందు వారెన్నడూ గురుపూజలకు రాలేదు. సరిగదా, మాస్టరుగారిని గురించిగాని, మాస్టరు సి. వి. వి. గారిని గురించిగాని, గురుపూజలకి వచ్చే వారిని గురించిగాని విన్నదైనా వినలేదు. అయినా ఆసక్తితో తమ ప్రయాణం ఆపుకుని, విశాఖపట్టణంలో దిగి గురుపూజలకి వచ్చేశారు! అదే వారి జీవితానికి ఒక మలుపు అయింది! మాస్టరుగారి అనుగ్రహం ఎవరిపైకి, ఎవరిద్వారా, ఎప్పుడు ప్రసరిస్తుందో ఎవరికి తెలుసు ?

ఇక్కడ గురుపూజలకి వచ్చేవారిని గురించి కొంత చెప్పుకోవాలి. గురుపూజలకి రావడం అనేది జీవితంలో ఒక ఘట్టం. అసలు గురుపూజలు జరుగుతాయి అని తెలియడం, తెలిశాక ఆ గురుపూజలకి రావాలని సంకల్పం కలగడం, ఆ సంకల్పం వచ్చిన తరువాత గురుపూజలకి రాగలగడం – ఒక్కొక్కటి ఒక్కొక్క ఘట్టం. గురుపూజలకి అనుకోకుండా వచ్చే వారూ ఉన్నారు. రావాలని సంవత్సరాల తరబడి ప్రయత్నం చేసి రాలేకపోయిన వారూ ఉన్నారు. ఇది ఏమిటి, ఎందుకు, ఎలాగ – అనే ప్రశ్నలకు సమాధానం మాస్టరుగారు చెప్పవలసిందే! ఒక్కటి మాత్రం నిజం. గురుపూజలకి రావడం ప్రారంభించిన నాటినుంచీ జీవితం వేరు, అంతకు ముందు జీవితం వేరు. ఈ మార్పు స్పష్టంగా తెలుస్తూనే ఉంటుంది.

గురుపూజల పూజా మందిరం చాలా విశాలంగా ఉంటుంది. ముందుముందు గురుపూజలు జరుగుతాయని ఊహించే, రాజాగారు అంత పెద్దబంగళా కట్టించారా అనిపిస్తుంది. రెండువేలమంది సోదరులు సుఖంగా ఉండడానికి సరిపోతుంది ఆ భవంతి. ఆ పూజా మందిరం చాలా విశాలమైనది. ఒక్కసారిగా రెండువేలమంది కూర్చుని ప్రార్థన చేసుకోవచ్చు. ఒక ప్రక్కన స్త్రీలు, మరొక

ప్రక్కన పురుషులు వరుసలు తీరి ప్రేయరులో కళ్ళుమూసుకుని కూర్చున్న దృశ్యం చూడగలగడం అదృష్టమే! ఎదురుగా ఉన్న పూజా వేదిక మీద మాస్టరుగారు కూర్చుని ఉంటారు. వారి కెదురుగా అందరూ కూర్చుని ఉంటారు. ప్రేయరు ఓంకారంతో ప్రారంభ మవుతుంది. అంతమంది ఏకకంఠంతో ప్రణవనాదాన్ని ఉచ్చరిస్తూ ఉంటే, సృష్టి ప్రారంభంలో నాదం ఇలాగే ఆరంభ మయిందని అనిపిస్తుంది. అందరి మనస్సులలోను, శరీరాలలోను గల ప్రతి అణువూ ఒక్కసారుగా ఆనందంతో ప్రతిస్పందిస్తుంది. ఆ స్పందన కొన్ని సంవత్సరాల వరకూ, స్వీకరించ గలిగిన వారికి కొన్ని జన్మల వరకూ నిలిచి పోతుంది. ప్రేయరు అయిన తర్వాత మాస్టరుగారు ప్రవచనం చేస్తారు.

## శ్వేతద్వీపం

పూజా వేదిక అలంకరణను గురించి కొంచెం చెప్పుకోవాలి. దాదాపు ఎనభై బెంచీలతో పెద్ద వేదిక తయారు చేసి, దాని పైన మూడు అంతస్థుల్లో ఎన్నో చిత్రపటాలు అమరుస్తారు. అవి ఏ ఒక్క జాతికి, దేశానికి మతానికి సంబంధించినవి కావు. యావత్తు మానవ జాతికీ చెందిన దేవతామూర్తుల, అవతారమూర్తుల చిత్ర పటాలవి. రాముడు, కృష్ణుడు, క్రీస్తు, బుద్ధుడు, షిర్డి సాయిబాబా, సత్యసాయిబాబా, జిల్లెళ్లమూడి అమ్మ, రవీంద్రనాథటాగూరు, మాస్టరు సి. వి. వి., మాస్టరు ఇ. కె., జ్వాల్‌కూల్, రమణ మహర్షి, మెహర్‌బాబా, హానిమన్ – ఇలా ఎందరెందరో కొలువు తీరి ఉంటారు. అన్నిటికన్నా పైన జగద్గురువు మైత్రేయుల వారి ఫోటో అమర్చబడి ఉంటుంది. వారి కళ్లనుండి వెలువడే కాంతులతో హాలంతా మూడునోజులూ నిండి ఉంటుంది. ఎవ రైనా ఆరాధనతో ఆ కళ్లలోకి చూస్తే అందులోకి కరిగిపోతు న్నట్లు అనుభూతి కలుగుతుంది. దానికి దిగువన వరల్డు టీచర్

ట్రస్టు చిహ్నమైన పరిభ్రమించే గోళం రెక్కలు చాచి, సోదర బృందాన్ని తన రెక్కలలో ఆప్యాయంగా కౌగిలిస్తున్నట్లు ఉంటుంది. దానికి క్రిందుగా మాస్టర్ సి. వి. వి. గారి ఫోటో చాలా పెద్దది ఉంటుంది. హాలులో ఉన్న సోదర బృందమంతా ఆ మాస్టరుగారి ఒడిలో ఇమిడిపోయినట్లు అనుభూతి కలుగుతుంది. ఇంకా కొంచెం దిగువన మాస్టర్ ఇ. కె. గారి ఫోటో ఉంటుంది. ఈ ఫోటోలు అమర్చిన తీరు ఎంతో చక్కగా ఉంటుంది.

అయితే "మాస్టర్ సి. వి. వి. గారి ఫోటో ఒక్కటి పెడితే చాలును గదా! ఇన్ని ఫోటోలెందుకు?" అని కొందరికి అనుమానం వచ్చింది. నేనిలా అన్నాను. "ఇన్ని ఫోటోలు ఇక్కడ పెట్టారంటే ఈ అన్నిటిలోనూ ఒకే వెలుగు ఉన్నదని గ్రహించి, ఆ వెలుగును దర్శనం చేయడం అభ్యాసం కావాలనే! ఒక్క విషయం ఆలోచించి చూడండి. రాముడి చిత్రం ఉన్నదనుకోండి. ఒక్కొక్క ఆర్టిస్టు ఒక్కొక్క రకంగా గీస్తాడు. అయితే ఇందులో అసలు రాముడు ఎవరు? అయినా త్రేతాయుగంలో రాముని ఆకారం ఇంత చిన్నదిగా ఉంటుందా? అనే ప్రశ్నలకు అర్థం లేదు. ఆ చిత్రకారుడు తన మనస్సులోని భావ చిత్రానికి ప్రతి రూపంగానే ఆ చిత్రం గీస్తాడు. ఇక్కడ అతని భావం, ఆరాధన ముఖ్యం కాని, ఆ చిత్రం ఒక్కటే ముఖ్యం కాదు. ఇంతమంది ఇన్ని ఫోటోలు చేర్చారు అంటే అది వారి వారి ఆరాధనకు చిహ్నం కాని, భేదభావాలను గుర్తించడానికి కాదు. ఇన్ని ఫోటోలు ఎందుకు? అనే ప్రశ్న కాక, ఈ ఇన్ని చిత్రాలలోనూ ఉన్న ఆరాధనాభావాన్ని గ్రహించి, మనమూ అలవరచుకోగలగాలి." ఈ జవాబు ఆయనకు నచ్చిందో లేదో తెలియదుగాని, తప్పనిసరిగా ఎప్పటికైనా నచ్చి తీరవలసిన విషయం ఇది. ఈ ఒక్క విషయం అర్థంకాకపోవడం వల్లనే, ప్రపంచంలో ఇన్ని భిన్నమతాలు, సాధనా మార్గాలు ఏర్పడి బిగిసిపోయాయి.

మరో మిత్రుడు ఇలా అడిగాడు. "యోగమార్గంలో అందరూ సాధకులే గదా! వారిలో ఎక్కువ తక్కువలు ఉండరాదు. ఇంతమంది క్రింద కూర్చుంటే మాస్టరుగారు ఒక్కరూ వేదికమీద కూర్చున్నారేం?" నేనిలా జవాబు చెప్పాను. "మాస్టర్ ఇ. కె. అంటే మాస్టర్ సి. వి. వి. గారికీ మనకీ మధ్య ద్వారం. అయినా ఒకరు చెప్పడం, ఒకరు వినడం అనేది ఎప్పుడూ ఉంటుంది. ఒక నాయకుడు, ఒక చక్రవర్తి, ఒక పెద్ద, ఒక గురువు—ఇది సంప్రదాయం. ఇది హక్కులకీ, అధికారానికీ సంబంధించిన విషయం కాదు. క్లాసులో టీచర్ పాఠం చెబుతూ వేదికమీద కుర్చీలో కూర్చున్నారంటే మనపైన అధికారం చెలాయించడానికి కాదు, మనను కూడా తనంతవారినిగా తీర్చిదిద్దే బాధ్యతను నిర్వర్తిస్తున్నారు. మన యింటికి పెద్దగా నాన్నగారుగాని, అన్నగారు గాని వ్యవహరిస్తూ మనను ఆజ్ఞాపిస్తున్నారంటే, అలాంటి పెద్దగా మనను కూడా తయారు చేయడానికి శిక్షణ ఇవ్వడానికే! మనను తనంత వారుగా చేయడానికి తగిన సమర్థత అనుభవం ఉన్నవారు మాస్టరుగారు. వారిని మనమే గురువుగా అంగీకరించి, మనలను నడిపించమని అర్థించాము. ఇది ఎక్కువ తక్కువలకు సంబంధించిన విషయం కాదు." దీనికి ఆ మిత్రులు సమాధానపడి ఊరుకున్నారు. ఇలాంటి ప్రశ్నలు మనసుల్లో పుట్టడం సహజమే. వాటిని తొలగించుకోవడమూ అవసరమే. కొందరికి ఈ ప్రశ్నలు తొలగాలంటే కొన్ని జన్మలు పట్టవచ్చు. తొలగిపోనంతవరకూ ఒక్క అడుగైనా ముందుకు పోవడం సాధ్యం కాదు.

ఆ పూట మరో విచిత్రం జరిగింది. మాస్టరుగారు ప్రేయరు చెబుతున్నారు. ఒక యోగమిత్రుడు నన్ను ఇలా అడిగాడు.

"నమస్కారం మాస్టర్ ఎం. ఎన్.
నమస్కారం మాస్టర్ సి. వి. వి.

అంటారే గాని ప్రభాకరశాస్త్రిగారి పేరు చెప్పరేం ?" చిత్రంగా మరుక్షణంలో మాస్టరుగారు "నమస్కారం మాస్టర్ వి. పి. ఎస్." అన్నారు. ప్రశ్నించిన మిత్రుడు నివ్వెరపోయి, ఆనందంతో కళ్లు మూసుకున్నాడు. అతడు నన్ను చాలా రహస్యంగా, పక్కవారికి కూడా వినిపించనంత రహస్యంగా – అడిగాడు. మాస్టరుగారికి వినిపించే అవకాశం అసలు లేదు. కాని మాస్టరుగారికి తెలిసింది!

## మాస్టర్ ఫోన్

ఇలా ఎక్కడో మాట్లాడిన మాటలు వినిపించే వింత టెలిఫోను పద్ధతి ఒక్కటి ఉంది. నేను విశాఖపట్టణంలోగాని, చిన కాకానిలోగాని ఉన్నపుడు ఈ టెలిఫోను పని చేస్తుంటుంది. మాలోనే కాదు, చాలామంది సాధకులలో ఇది పని చేస్తుంటుంది. మా సూర్యానికి జరిగిన సంఘటన ఒకటి వివరిస్తాను.

సూర్యం రెండు మూడు రోజులు విశాఖపట్టణంలో ఉండి పినవేమలి వెళ్లిపోయాడు. వెళ్లిన కొద్ది సేపటికే ఈ వింతఫోను పని చేయడం మొదలెట్టింది. మాస్టరుగారు వైజాగు రమ్మంటున్నారు. అనిపించింది. వైజాగు బయలుదేరాలనిపించింది. "మీరు ఇప్పుడే గదా వైజాగు నుంచి వచ్చింది? మళ్లీ వైజాగు ప్రయాణమేమిటి? ఇంతలో ఏం జరిగింది? మాస్టరుగారిని చూడాలని కుతూహలం కలిగిందా? లేకపోతే మీ చెల్లిలిని చూడాలనిపించిందా ?" అని అతని భార్య ఎగతాళి చేసింది. సూర్యం ఇలా అన్నాడు. "పది నిముషాల్లో రిక్షావాడు వచ్చి రమ్మని పిలిస్తే టెలిఫోను వార్త కరెక్టు. లేకపోతే పొలానికి వెళ్ళి పని చేసుకుంటాను." ఈ మాటలు అంటూండగానే రిక్షావాడు వచ్చి, "అయ్యా! విజయనగరం వస్తారా?" అని అడిగాడు. సూర్యం భార్య ఆశ్చర్యపోయింది. సూర్యం చిరునవ్వు నవ్వి, అయిదు నిమిషాల్లో బయలుదేరి వెళ్లి

పోయాడు. అతడు వైజాగు చేరి మాస్టరుగారి యింటికి వెళ్లాడు. మాస్టరుగారు ఏదో చాలా అత్యవసరమైన పనిమీద మేడమీద ఉన్నారు. ఎవరినీ పైకి పంపవద్దని ఒకరిని క్రింద ఉంచారు. అతడు సూర్యంతో ఈ విషయం చెప్పి, సాయంత్రం రమ్మని చెప్పాడు. "నాకు కొంచెం పని ఉంది. పదిహేను నిముషాలు కూర్చుంటాను. ఆపైన పోగ్రాం మాస్టరుగారే చూసుకుంటారు." అని సూర్యం అక్కడే కూర్చున్నాడు. మాస్టరుగారు ఇంతలో ఆ శిష్యుణ్ణి పిలిచి, "క్రింద సూర్యం కూర్చుని ఉన్నాడు. పైకి పంపించు" అన్నారు. ఈ పిలవడం, వినడం, రావడం, పోవడం అనేది గురుశిష్యుల మధ్య చాలా తమాషాగా ఉంటుంది. దివ్యజ్ఞాన సమాజ స్థాపకురాలైన మేడమ్ బ్లావెట్‌స్కీ మొదలైనవారితోను, వారి జీవితసన్నివేశాలతోను పరిచయం ఉన్నవారికి ఈ సంబంధాలు, సంభాషణలు బాగా తెలుస్తాయి. ఈ విషయంలో నా అనుభవాన్ని కూడా మనవి చేస్తాను.

గుంటూరులో నాగమణి తండ్రిగారికి తీవ్రమైన జబ్బు చేసింది. ఆసుపత్రిలో చేర్చారు. ఆక్సిజన్ పెట్టవలసిన అవసరం కూడా కలిగిందట. అంత బాధలోనూ ఆయన, "మాస్టరుగారికి వైరు ఇవ్వండి. రామకోటయ్యగారికి ఒక కార్డు రాసి పడెయ్యండి. నాకు గుణమిస్తుంది." అన్నారట. వారు ఆ ప్రకారమే చేశారు. నేనింతలో వేరే పనిమీద గుంటూరు వచ్చాను. అన్ని పనులూ చూచుకున్న తర్వాత, ఎందుకో నాగమణి యింటికి వెళ్ళాలని గట్టిగా అనిపించింది. తీరా అక్కడికి వెడితే పరిస్థితి యిది! నాకు వారు వ్రాసిన కార్డు ఇంకా అందలేదు. ఇంతలో మాస్టరుగారి నుండి టెలిగ్రాం వచ్చింది. ఏ మందు వేయాలో కూడా అందులో ఉంది. అక్కడ అందరికీ అయోమయం అయింది. కార్డు అందకుండానే రామకోటయ్యగారు ఎలా వచ్చారు? మాస్టరుగారు ఎలా వైరు ఇచ్చారు? ఇది హృదయానికి, హృదయానికి మధ్యనున్న సంబంధం. ఆత్మకి,

ఆత్మకి మధ్య ఉన్న సంబంధం. ఈ స్థాయికి మానవుడు ఎదిగితే తప్ప ఇందులో ఉన్న సైన్సు అర్థంకాదు. ఎక్కడో కొడుకు బాధ పడుతుంటే తల్లి కడుపులో తిప్పినట్లు ఉండటం, మన ఆత్మీయులకు చెడు కలిగితే మనకు అదోలా ఉండటం – ఇటువంటివి ఊహించడం ముందు అలవాటు చేసుకుంటే. తరువాత టెలిపతీ పద్ధతి తెలుస్తుంది.

## సామూహిక ప్రార్థన

నేను ప్రేయరులో కూర్చున్నప్పుడు నా మనస్సులో కొన్ని విషయాలు స్ఫురించాయి. కొంత మంది మిత్రులకు నేనిలా వివరించాను. "ఇక్కడ ఎందరో సాధకులు చేరారు. ఈ అందరి చేతలు, చేతస్సులు కలవాలి. విడివిడిగా సాధన చేయడంకంటే, అందరూ కలిసి సాధన చేయడం మంచిది. అందరూ ఒకే గొంతుకతో 'నమస్కారం మాస్టర్ సి. వి. వి.' అన్నప్పుడు అందరిలోనూ ఉన్న ప్రాణప్రసారం ఏకమవుతుంది. ఇన్ని తీరులవారు, ఇన్ని దేశాలవారు, ఇన్ని వృత్తులవారు, ఇన్ని వయస్సులవారు–అందరూ కలిసి ఒకే గొంతుతో 'మాస్టర్ సి. వి. వి.' అంటున్నాం. దీన్ని మనం చక్కగా గ్రహించాలి. ప్రాణప్రసారం, మనఃప్రవృత్తి, శరీరపు కదలిక అన్నీ కలిసి మాస్టరు పరం కావాలి. అందరూ మాస్టరునందు సమర్పణం చెందాలి." అని నేను చెప్పగానే అందరూ కలిసి ఓంకారం ఉచ్చరించారు.

కొన్ని వేలమంది సోదరులను ఒకచోట చేర్చడం, ఇన్ని శరీరాలను ఒకే దండగా కూర్చడం, ఇందరి శ్వాసనూ సమానంగా నడిపించడం, ఇందరి మనస్సులను కరిగించి యోగసాధనలో లగ్నం చేయడం – ఇది గురుపూజ, గురుపూజ యొక్క ఫలితం. ఇందులో మన ప్రయత్నం, ఆలోచన ఏమీ పనిచేయవు. తర్కం నిలవదు. కేవలం ఆనందస్థితి మాత్రం ఉంటుంది. ఆ స్థితిలో ఊపిరి తీయడం

కూడా ఆగిపోయింది. ఎంతసేపు అలా ఉందో తెలియదు. కొంత సేపటికి మనస్సు పనిచేయడం ప్రారంభించింది. వెంటనే శ్వాసకూడా ప్రసరించడం ప్రారంభమైంది. ఇదొక అనుభవం. మాస్టరుగారి యింట్లో వారితోబాటు పూజకు కూర్చున్న వారికి కూడా ఇలాంటి అనుభవమే ఎన్నోసార్లు కలిగింది.

ఈయని దంటూ ఉండదు
ఈయందగు వానినెల్ల ఇస్తూనే, తా
నీయరు మన చీకటికిన్,
సాయంబై యుందు రెపుడు సద్వృత్తులలో

ఈయన మెరిగిన గురువులు
ఈయన మెరిగినదియెల్ల యిచ్చును మనకున్,
నీయంత నీవు గ్రహియిం
చే యత్నము చేయవలయు సిద్ధిం బొందన్.



ఏ డ వ కి ర ణ ము

# గు రు పూ జ ల
# ని ర్వ హ ణ ము

వారిది అంటూ ఏమీ లేనివారే మనకు అన్నీ ఇవ్వగలరు. మనలను నడిపించ గలరు. గురుపూజలకు కావలసిన ఏర్పాట్లు జరగడం గమనిస్తే ఈ సత్యం దర్శన మిస్తుంది. ఒక గురుపూజలకు ముందు మాస్టరుగారు వర్మగారిని పిలిచి, "వర్మా! గురుపూజల ఏర్పాట్లు అన్నీ చూడు!" అన్నారు. "యస్ సార్!" అన్నారు వర్మ గారు. వందలమంది సోదరులు వస్తారు గురుపూజలకి. అందరికీ భోజనాలూ అవీ చెయ్యాలి. ఎలా? దానికి కావలసిన పైకం? ఇంట్లో ఉన్న అయిదువందల రూపాయలూ ఏ మూలకు? అప్పుడే జనవరి పదవ తేదీ ఉదయం! ఏమీ పాలుపోవడంలేదు. అయితే గురువుగారున్నారన్న ధీమా మాత్రం ఉంది.

ఆ రాత్రి భోజనానికి మూడువందల మంది యోగమిత్రులు వస్తారు. వారి కందరికీ భోజనాల ఏర్పాట్లు ముందుగా కావాలి. వర్మగారు బజారుకు వచ్చి నాలుగు బజారులు కలిసే సెంటరులో నిలబడ్డారు. సెంటరుకి వెడితేగాని పరిధి తెలియదు. ఇక 'సెంటర్' పని చేయడం ప్రారంభించింది. ఒక స్నేహితుడు కనిపించాడు. "నీ వద్ద డబ్బు ఎంతవుంది ?" అన్నారు వర్మగారు. "నీ కెంత కావాలి?" అన్నాడతను. మూడువేలు కావాలన్నారు వర్మగారు. అతడు తీసుకురావడానికి వెళ్ళాడు. మరో మిత్రుడు కనిపించాడు.

ఆయన కూడా డబ్బు తీసుకురావడానికి వెళ్ళాడు. పాలు సప్లయి చేసే వ్యక్తి కనిపించాడు. ఆ పని పురమాయింపు అయ్యేసరికి వంటమనుషులు వచ్చారు. వాళ్ళకి ప్రోగ్రాం ఇచ్చి, వర్మగారు మిత్రులతో కలసి కిరాణాదుకాణం వద్దకు వెళ్ళారు. "ఒక వెయ్యి మందికి సరిపడా సామానులు ముందు కట్టించండి. కేపటి కేం కావాలో తర్వాత చూద్దాం. ఇదిగో, ఈ మూడు వేలూ అడ్వాన్సుగా ఉంచండి. అన్నీ అయినతర్వాత అక్కౌంటు చూసుకోవచ్చు" అన్నారు వర్మగారు.

ప్రార్థన సమయానికి పదినిముషాలముందు మాస్టరుగారు వచ్చి "పనులు నడుస్తున్నాయా? నేను చూడవలసినవి ఇంకేమైనా ఉన్నాయా?" అన్నారు వర్మగారితో. ఇలాంటి చోట్లనే మనం జాగ్రత్తగా సమాధానం చెప్పవలసి ఉంటుంది. మనలను పట్టి చూడడానికే ఇలాంటి ప్రశ్నలు అడుగుతూ ఉంటారు. ఆయన చూడకుండా పనులెలా జరుగుతాయి? అక్కడ మనం కేవలం సాధనాలు మాత్రమే అనుకున్న నాడు పతనం ఉండదు. నావల్లనే ఇవన్నీ జరుగుతున్నాయి అనుకుంటే ఎదురు దెబ్బ తప్పదు.

ఇంతలో పత్తివాడపాలెం నుంచి గ్రామస్థులతో సహా లక్ష్మినాయుడుగారు వచ్చి నమస్కారం చేశారు. అందర్నీ మాస్టరుగారు ఆప్యాయంగా పలుకరించారు. నాయుడుగారు "మాస్టరుగారూ! అన్ని కూరగాయలూ తేగలిగాము గాని గుమ్మడికాయలు మాత్రం తేలేకపోయాం" అన్నారు బాధగా. మాస్టరుగారు నవ్వి, లేనిచోటునుంచి గుమ్మడికాయలెలా వస్తాయి? ఉన్నచోటు నుండి వస్తాయి గాని!" అంటుండగానే ఒక వాను వచ్చి ఆగింది. వాను నిండా గుమ్మడికాయలే!

'పనులు చూడాలి'

ఒక వాక్యం మనం ఉచ్చరించినపుడు ఒక అర్థం ఇస్తుంది. అదే వాక్యం గురువు ద్వారా అయితే మరొకలా అర్థం వస్తుంది. వారి మాటలను అర్థం చేసుకోవడంలో సాధారణంగా పొరపాటు పడుతుంటాం. ఒకమారు ప్రభాకరశాస్త్రిగారు వారి యింట్లో జరిగే పెళ్ళికి రమ్మనమని ఉత్తరం వ్రాశారు. "రెండు మూడు రోజుల ముందుగానే తిరుపతికి నీవు రావలసినది. ఇచ్చట పెళ్ళి పనులు చూడవచ్చు" అని అందులో సారాంశం. పెళ్ళిపందిరి వగైరా వేయించటానికి శాస్త్రిగారు నన్ను రమ్మన్నారని రెండు రోజులు ముందుగానే తిరుపతి వెళ్లి శాస్త్రిగారిని కలుసుకున్నాను. నేను వెళ్ళేటప్పటికి శాస్త్రిగారు ప్రార్థనా మందిరంలో విశ్రాంతిగా కూర్చున్నారు. అక్కడ చేరిన కొంతమంది యోగమిత్రులతో యోగాన్ని గురించి వివరిస్తున్నారు. పెళ్ళి హడావిడి అక్కడ ఏమీ కనిపించలేదు. ఆ మరుసటిరోజు కూడా ఇలా గోష్ఠితోనే గడచి పోయింది. తెల్లవారేసరికి అన్ని పనులు సవ్యంగా ఏర్పాటు చేయ బడి ఉన్నాయి. ఉదయం శాస్త్రిగారు లేచి మొఖం కడుక్కుంటూ "ఏమయ్యా, పెండ్లి పనులు నడుస్తున్నాయా? నీవు చూస్తున్నావా?" అన్నారు. "నేను చూడలేదండి. రాత్రి నేను నిద్రపోయేసరికి ఏ హడావిడీ లేదు. ఉదయం లేచేసరికి అన్ని పనులు జరిగి ఉన్నాయి." అన్నాను. ఆయన నవ్వి "ఆ విషయం చూడటానికే నిన్ను రమ్మన్నాను" అన్నారు. ఏ గురువైనా ఇలాగే మాట్లాడతారు. ఒక శిష్యుడు వచ్చి మాస్టరుగారితో "బియ్యం సరిపడాలేవు" అన్నాడు. "అయితే వస్తాయి" అన్నారు మాస్టరుగారు. ఇంతలోనే బియ్యం బస్తాలు రావటం జరిగింది. గురుపూజలలో ఏ పనైనా ఇంతే, అప్రయత్నంగానే జరిగిపోతుంది. ఈ విషయంలో మనం కొంత తెలుసుకోవలసింది ఉంది. మనకంటూ మనం పనులు చేసుకోవటం మొదలు పెట్టినప్పుడు మనం ఎంతో ప్రయత్నం చేస్తాం కదా!

అయినా అన్ని పనులూ సవ్యంగా జరుగవు. దీనికి కారణం, ఆ పనులు మన కోసం మనం చేసుకోవటం కనుక. మనకోసం మనం చేసుకోవటంలో స్వార్థం గాని, లోభం గాని, అహంకారం గాని ఎంతో కొంత పాలు ఉండక తప్పదు. కాని ఇంకొకరికి మనం చేసి పెట్టేటప్పుడు, పదిమందీ కలిసి చేసుకునేటప్పుడు ఏ ఒక్కరి కోసం కాదు గనుక పనులు చక్కగా జరిగిపోతాయి. మబ్బులు వర్షించ టంలో ఏ లోటూ ఉండదు. కాని నదులలోని నీరు మనం విని యోగించుకోవటంలో లోపం ఉంటుంది. దీనికి కారణం ఆ నీటిని అందరూ వినియోగించుకొందామనే, మంచితనం లేకపోగా, ఎదుటి వానికి వినియోగపడకుండా చూసే దుర్బుద్ధి ఉండటం. గురుపూజ లలో పనులు ఏఒక్కరూ ప్రత్యేకంగా చేయుటం ఉండదు. అందరూ కలిసి చేయటం ఉంటుంది. ఒకరి కోసం ఒకరు చేసుకోవటంలో ఉండే సదుపాయం, ఆనందం అందరికీ ఆ మూడురోజులూ అర్థమవు తాయి. జీవితం అంతా అదే అనుభవంతో గడపటం నేర్పటానికే మాస్టరుగారు ఈ ఏర్పాటు చేశారు. పనులు మనం చెయ్యటం అనేది పోయి, మనద్వారా జరగటం అంటే ఏమిటో గురుపూజ లలో తెలుస్తుంది.

మగపెండ్లి వారలెవ్వరు
అగపడగా రాదు ఇచట; అందరుగూడా
తగు నాడు పెండ్లి వారన
మొగమాటం బేమిలేదు; ముఖ్యం బిదియే!

గురుపూజలలో పనులు జరిగే విధానంలో ప్రత్యేకంగా గుర్తించవలసినది ఒకటి ఉంది. మామూలుగా ఏదైనా ఒక ఫంక్షన్ గాని ఒక ఉత్సవంగాని ఏర్పాటు చేసినపుడు ఎవరెవరు ఏయే పనులు చెయ్యాలి అనేది ముందుగానే ఏర్పాటు చేయబడి ఆ ప్రకారం నడ వటం జరుగుతుంది. గురుపూజలలో ప్రత్యేకంగా వీరు మాత్రమే

ఈ పనులు చేయాలి అని ఉండదు. ముందుగా పనులు ప్రారంభించటానికి మాత్రం కొంతమందికి కొన్ని పనులు అప్పగిస్తారు. ఆ తరువాత గురుపూజలలో పాల్గొనటానికి వచ్చిన సోదరులే తమపనులు తాము చేసుకొంటూ, ఇతరులకు సహాయం చేస్తారు. వచ్చినవారు తమకు తామే నీటివసతి, భోజన వసతి మొదలైనవి కల్పించుకుంటారు. గురుపూజలకు చాలామంది అతిథులుగా, ఆహ్వానితులుగా కాక సోదరులుగా, సేవకులుగా వస్తారు. గురుపూజల ప్రాంగణంలో దిగగానే వెంటనే ఏదో ఒక పనిలోనికి అడుగు పెట్టడం జరుగుతుంది. సాధారణంగా లోకంలో ఇంతపని చెయ్యవలసి వస్తుందే అని బాధ పడుతూ ఉంటారు. గురుపూజలలో అయితే ఇంతకంటే ఎక్కువపని, ఇంతకంటే తక్కువ కాలంలో, ఇంతకంటే బాగా ఎలా చెయ్యగలం? అని ఆలోచిస్తూ ఉంటారు. దీనివల్లనే ఎంతపని చేసినా అలిసిపోవటం ఉండదు. పనిచేస్తూ విశ్రాంతి పొందటం అనేది ఇక్కడ మనకు అభ్యాసం అవుతుంది. ఇంకొక విషయం కూడా ఉంది. ఒకడు చేస్తున్నపని ఎక్కువ అనిగాని, ఒకడు చేస్తున్నపని తక్కువ అనిగాని ఉండదు. ఎవరు ఏపని చేసినా మాస్టరుగారికి సమర్పణంగానే చేస్తారు. ఆపనిలో మాస్టరుగారిని చూసి చేస్తారు.

పని చేస్తున్న దృష్టి ఎవ్వరికీ ఉండదు. ఉదయం 4 గంటలకు లేచిన దగ్గరనుండి రాత్రి 12 గంటలవరకు పని చేసినా అలసిపోవడం ఉండదు. వంటలు చేసేవారు, చేయించేవారు అయితే తొమ్మిదవ తారీకు నుండి 14 వ తారీకు వరకు నిద్రపోవటం ఉండదు. నిద్ర లేకుండా, విశ్రాంతి లేకుండా ఇంతమంది ఎలా శ్రమపడ గలుగుతున్నారు? ఒకటే రహస్యం. శ్రమ అని భావించక పోవటమే! చేయ వలసినపని చేయటంతప్ప దానిని గూర్చిన చర్చలు గాని, విమర్శలుగాని ఉండవు.

ప్రేయరు హాలులో అందరినీ వరుసలో కూర్చో పెట్టడం, సమయానికి అందరికీ టిఫిన్లు అందించడం, వడ్డనలు చేయటం,

ఒకటేమిటి ఏపనులు అయినా చకచక జరిగిపోతుంటాయి. 11 గంట లకు వడ్డన మొదలు పెడితే రెండు, మూడు గంటల వరకు జరుగు తూనే ఉంటాయి. అయినా వడ్డించేవారికి విసుగు ఉండదు. అల సటా ఉండదు. ఇంతమందికి వడ్డిస్తుంటే, ఇంతమందీ సంవత్సరానికి ఒకసారి కలిసి కబుర్లు చెప్పుకుంటూ తృప్తిగా భోజనాలు చేస్తుంటే ఇక వడ్డించేవారికి ఆకలి ఎక్కడ ఉంటుంది ?

వంటల విభాగం అంతా కామేశ్వర రావుగారు ఆయనతో పాటు ఖర్గపూరు నుండి వచ్చిన కొంతమంది సోదరులు చూస్తుంటారు. కర్మ యోగాన్ని మానవ రూపంలో చూడాలంటే కామేశ్వరరావు గారినే చూడాలి. ఆ అయిదు రోజులూ అసలు ఆయన నిద్రపోయింది ఉండదు. అలా అని ఆయన నీరసించినట్లూ ఉండరు. రూపు కట్టిన ప్రేమతో ఆయన చేయించిన వంటలు, వడ్డనలు, గురుపూజలకు హాజరయిన ఇంతమందికీ శక్తిని ప్రసాదించి పనులు చేయిస్తుం టాయి అంటే అతిశయోక్తి కాదు. ఇక్కడేకాదు, ఎక్కడయినా, ఎవరయినా వంటచేసేవారు, తప్పదు అని కాకుండా ప్రేమతో వంట చేస్తే, ఆ వంటను రుచి చూచిన అందరూ పరిపూర్ణ ఆరోగ్యవంతు లవుతారు. అలాంటివారి చేతి వంటలు తినే అదృష్టం కలగటం కూడా పూర్వజన్మ సుకృతమే! అప్పుడప్పుడు మాస్టరు గారూ వడ్డన చేస్తుంటారు. వంటలు చేస్తుంటారు. రమణ మహర్షి ఇలాగే చేస్తుండేవారు. వండి పెట్టడంలో ప్రత్యేకమైన ఆధ్యాత్మిక రహస్యాలు, విలువలు ఉంటాయి. గురుపూజలలో వడ్డించేవారూ ఇంతే! "కొంచెం వేయించుకోండి సార్! మళ్ళీ మా చేతి వడ్డన సంవత్సరం వరకూ చూడరు... అలా మొగమాటపడతారేమిటి సార్? మనం అంతా ఒక్కటే. మీకు ఈ గురుపూజలు కొత్త అయినా, గురుపూజలకీ, గురువుగారికీ మీరు క్రొత్తకాదు." ఇలా ఛలోక్తులు వేసుకుంటూ వడ్డిస్తారు.

ఇక కార్యక్రమాలు కూడా ఎంతో బ్రహ్మాండంగా జరుగుతుంటాయి. మాస్టరుగారి ఉపన్యాసాలను గూర్చి ప్రత్యేకంగా చెప్పేదేమీ ఉండదు. చెప్పటం సాధ్యం కాదు కూడా! మాస్టరుగారి రూపం ఎంత నిండుగా ఉంటుందో ఎంత గంభీరంగా ఉంటుందో ఎంత ప్రసన్నంగా ఉంటుందో, ఎంత తేజస్సు నిండి ఉంటుందో చెప్పలేము. అన్నికళలూ ఆయనలో నిండి ఉంటాయి. అదివరకు మాస్టరుగారు వేరు, గురుపూజల మూడురోజులూ మాస్టరుగారు వేరు. ఇది భ్రమ కాదు. ఇది అనుభవంతో తెలుసుకోవలసిన సత్యం! గురుపూజలలో మాస్టరుగారి రూపం ఎన్ని జన్మలకయినా మరపురానిది. మనం గుర్తుంచుకో వలసిన అవసరం ఉండదు. హృదయం అంతా అదే రూపు నిండి ఉంటుంది. అందులో ఏముందో వివరించటం సాధ్యం కాదు.

సాయంత్రం పూట మాస్టరుగారి వద్ద శిక్షణ పొందిన పిల్లలు లలితా సహస్రనామం, దుర్గాస్తవం, సౌందర్యలహరి మొదలయిన స్తోత్రాలతో పూజ చేస్తారు. ఈస్తోత్రాలతో, గానంతో పూజా మందిరం అంతా నిండిపోతుంది. ఇక భజనలు, సంకీర్తనలు, మిగిలినవారి ప్రసంగాలు బ్రహ్మాండంగా జరుగుతాయి.

గురుపూజలను గురించిన మరికొంత వివరణ యిది. మరికొంత యింకొకమారు ప్రస్తావిస్తాను. ఈవిషయం ముగించే ముందు రఘుపతి వెంకటరత్నంగారు వ్రాసిన కొన్ని వాక్యాలు వ్రాస్తాను.

"I dreamt and found the world is full of beauty.
I woke up and found the world is full of duty"

ఈ duty, దాని విశ్వరూపం గురుపూజలలో మనకు కనిపిస్తుంది.

## కోడూరులో గురుపూజలు

కృష్ణాజిల్లా, దివితాలూకాలో కోడూరు అనే గ్రామం ఉంది. సోదరుడు మోపిదేవి కృష్ణస్వామిగారి స్వగ్రామం అది. అతడు ఆంధ్రా యూనివర్సిటీలో తెలుగు M. A. చదువుతుండగా మాస్టరుగారితో పరిచయం అయింది. మాస్టరుగారి విద్యావిధానం, చికిత్సా విధానం అతన్ని ఆకర్షించాయి. అదే మార్గాన అతడు పయనించడానికి నిశ్చయించుకున్నాడు. కోడూరులో తన అనుయాయులైన యువకుల సహాయంతో ఒక విద్యాలయాన్ని, ఒక హోమియో వైద్యాలయాన్ని ప్రారంభించాడు. చుట్టుప్రక్కల ఎన్నో గ్రామాల నుండి ఎందరో రోగులువచ్చి, ఈ వైద్యాలయంలో వైద్యసహాయం పొందుతున్నారు. విశాఖపట్టణంలో మాస్టరుగారు ఏయే కార్యక్రమాలు నడుపుతున్నారో, ఆ కార్యక్రమాలన్నీ కోడూరులో కూడా నిర్వహించాలని కృష్ణస్వామి సంకల్పం. ఈ సంకల్పమే కోడూరులో కూడా గురుపూజలుగా రూపు దిద్దుకుంది. 1974 వ సంవత్సరం అక్టోబరు 11, 12, 13 తేదీలలో కోడూరులో మొదటిసారిగా గురుపూజలు జరిగాయి. అన్ని ప్రాంతాల నుంచీ సోదర బృందం వచ్చి చేరారు.

చాలా సారవంతమైన ఆ ప్రాంతపు జీవశక్తి అంతా అక్కడి యువకుల కార్యాచరణ శక్తిలో కనిపిస్తుంది. మధురకవి క్షేత్రయ్యగారి మువ్వ గోపాలుడు తన మోహనమురళీ రవళిని పలికించిన ప్రదేశం అది. అది నేడు సోదరబృందంవారి ఓంకార గానంతో ప్రతిధ్వనించింది. సుసర్ల దక్షిణామూర్తిగారి వంటి సంస్కృత విద్వాంసులకు జన్మ నిచ్చిన గడ్డ అది. అది నేడు సోదర బృందంచేసిన ఓంకారగానంతో ప్రతి ధ్వనించింది. ఆ దివి సీమను సిద్ధేంద్రయోగి కూచిపూడి నాట్యసరస్వతీ నూపురాల ఘలంఘులలతో ప్రతిధ్వనింప జేశారు. నేడు ఆ సీమ మాస్టరు సి. వి. వి. గారి

నామోచ్చారణతో నిండిపోయింది. సంస్కృత విద్యకు కూడా పుట్టి నిల్లయిన ఆ గడ్డ నేడు మాస్టరుగారి యోగవిద్యా ప్రసంగాలతో పరిపుష్టి చెందింది.

కృష్ణవేణి అనే పేరుగల కృష్ణానది పాయమీదుగా, విజయవాడనుండి కోడూరుకు బస్సు నడుస్తుంది. కోడూరు గ్రామం సముద్ర తీరాన ఉంది.

యథాప్రకారంగా గురుపూజలు ఆరుగంటలకు ప్రేయరుతో ప్రారంభమైనాయి. అన్ని కార్యక్రమాలూ విశాఖపట్టణం గురు పూజలలో వలెనే కొనసాగాయి. మేము గుంటూరు మిత్రుల మంతా ఒకచోట భోజనం చేస్తున్నాము. మాస్టరుగారు అటు వైపు వచ్చి నవ్వుతూ "అంతా ఒకేచోట కూర్చుని భోజనం చేస్తు న్నారే!" అన్నారు. అంతే! అందరం వెంటనే విడిపోయి ఎవరి పనులలోకి వాళ్ళం వెళ్ళి పోయాం.

అసలు కోడూరులో గురుపూజలు ప్రారంభమైన విధానం, మాస్టరుగారితో కృష్ణస్వామిగారి పరిచయం అయిన పద్ధతి మరొక చోట చెప్పుకుందాం.



ఎ ని మి ద వ కి ర ణ ము

# నిర్మాణ ప్రణాళిక

మాస్టరుగారి జన్మకారణాల్లో ముఖ్యమైనవి — అడుగు పెట్టిన ప్రతిచోటా వేదమనే జ్యోతిని వెలిగించడం, వేద మార్గం వెంట మనను నడిపించడం, మనలో 'నేను' అనే జ్యోతి వెలిగించి, మనచేత వేదం దర్శనం చేయించి, మన జీవితాలను వేదమయం చేయడం మొదలైనవి.

భారతదేశం వేద ధర్మాన్ని ప్రపంచపు నలుమూలలకూ వ్యాప్తి చేసిన దేశం. పూర్వం ఈ దేశంలో గురుకులాలు ఉండేవి. గురువులు శిష్యులను చేరదీసి, చిన్నతనం నుంచే చక్కని సమగ్ర మైన శిక్షణ ఇచ్చేవారు. పట్టణ వాతావరణానికి దూరంగా ఒక ప్రశాంతమైన ప్రదేశం ఎంచుకుని, అక్కడ ఆశ్రమ నిర్మాణం చేసుకునేవారు. క్రూరజంతువుల బాధ లేకుండా ఉన్న ఒక నదీతీర ప్రదేశాన్ని సాధారణంగా ఎన్నుకునేవారు. అటువంటి నివాస యోగ్యమైన ఆశ్రమ వాతావరణంలో శిష్యులకు బాల్యం నుంచి యవ్వనం వచ్చేవరకు శిక్షణ యిచ్చేవారు. దాన్ని బ్రహ్మచర్య దీక్ష అంటారు. ఆ దీక్ష అయిన తర్వాత కొంత కాలం దేశ సంచారం చేయించేవారు. శిష్యుడు ఆశ్రమంలో నేర్చిన విద్యను ఈ

సంచారంలో అనుభవ పూర్వకంగా రూఢిచేసుకునే అవకాశం కలిగేది. ఆటుపైన గృహస్థాశ్రమం స్వీకరించేవాడు శిష్యుడు. కాలక్రమంలో ఈ యువకులే గురువులై గురుకులాలు స్థాపించి నిర్వహించేవారు. గురుకులాలు అడవుల్లో నెలకొల్పుకోవడం, కేవలం పవిత్రవాతావరణం కోసమే గాని, నగరవాసులపై ఎలాంటి విముఖభావంతోనూ కాదు. వర్ణాశ్రమ ధర్మాలు సంకరమైపోకుండా ఆనాడు పరమ పవిత్రంగా ఆచరించబడుతూ ఉండేవి.

కాని కాలక్రమంలో వర్ణాశ్రమ వ్యవస్థ, ఆ పరమ ధర్మమార్గం నుంచి ప్రజల జీవితాలు దూరమైపోసాగినాయి. ఆ ధర్మాల విలువ తెలియని సంకీర్ణ నగర వాతావరణంలో పెరిగిన భారతీయుల సంఖ్య ఎక్కువైపోయింది. వేదం చదువుకున్న పండితులు వేద ధర్మాన్ని అనుష్ఠించడం మానివేసి, వేదంపైన తామేదో హక్కు సంపాదించినట్లు అహంకరించడం, సామాన్య ప్రజలకి దూరంగా ఉండడం అలవాటు చేసుకున్నారు. ఆనాడే జాతి పతనానికి నాందీ వాచకమైంది. పండితుల సంఖ్య పెరిగింది. దర్శనం చేయవలసిన వేదాలను, ఉపనిషత్తులను చర్చలలోనికి లాగి పాండిత్యం ప్రదర్శించుకోవడం ప్రారంభించిన వేదపండితుల చేతిలోపడి, వేదం ప్రజలకు దూరమైపోయింది. ఇలాంటి పరిస్థితుల్లో, వేదోద్ధరణ తన అవతారవిశేషాల్లో ఒకటిగా దిగివచ్చినవాడు శ్రీకృష్ణుడు. యజ్ఞశాలలు నిర్మించి, యజ్ఞాలు జరిపించి, వేదమూర్తులను ఆదరించి, వేదాన్ని, వేద ధర్మాన్ని దేశం నలుమూలలా వ్యాపింపజేశాడు. దేవాలయాలు కట్టించాడు. ఆగమ శాస్త్రాన్ని స్థాపింపజేసి పూజాదికాలను ప్రజలకి అలవాటు చేయించాడు. మళ్ళీ జాతిలో నూతనోత్సాహాన్ని, చైతన్యాన్ని కలిగించినవాడు శ్రీకృష్ణుడే! శ్రీకృష్ణుని భక్తుడైన వేదవ్యాసుడు కలగలుపుగా కలిసిపోయిన వేదాన్ని మళ్ళీ నాలుగు వేదాలుగా క్రమబద్ధంగా విభజించాడు. ఈ వేదం అందరికీ అర్థమయ్యే విధంగా వేదధర్మాన్ని

లోక వృత్తాంతానికి సమన్వయ పరచి, పాత్రల ద్వారా, సంఘటనల ద్వారా, పురాణాలద్వారా, కథల ద్వారా అందించాడు. అలా వచ్చినవే భారతం, భాగవతం, మిగిలిన పురాణాలు. ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడు అవతరించకముందు వేదానికి ఉన్న విలువ వేరు, ఆ తరువాత విలువ వేరు. కృష్ణుడు శరీరాన్ని చాలించే ముందు మైత్రేయునికి భాగవత మనేపేర భాగవత ధర్మాన్ని ఉపదేశించాడు. మైత్రేయుడు విదురునికి మిగిలిన ప్రియశిష్యులకు ఉపదేశించాడు. అప్పటినించీ ఈ కార్యక్రమం సాగుతూనే ఉంది. అయితే ఇది ఇంత వరకూ కేవలం వ్యక్తుల మధ్యనే జరిగింది. ఆ సంస్కారం ఉన్న వారు మాత్రం వేదాన్ని అందుకో గలిగారు.

## పునరుజ్జీవనం

కలియుగం నడుస్తున్న కొద్దీ జాతి అంతకంతకూ నిర్వీర్యం అయిపోసాగింది. మధ్య మధ్యలో జాతికి పునరుజ్జీవనం కలిగించడానికి చాలమంది మహానుభావులు ప్రయత్నిస్తూనే వచ్చారు. శంకర భగవత్పాదులు, రామానుజులు, మధ్వాచార్యులు, వల్లభాచార్యులు, చైతన్య ప్రభువు మొదలైనవారు అటువంటివారే. అయినా జాతిలో సోమరితనం, స్వార్థం, అసూయ, నాస్తికత్వం మళ్ళీ మళ్ళీ పెరుగుతూనే ఉన్నాయి. ఈ ఇరవయ్యవ శతాబ్దంలో కూడా ఇదే పరిస్థితి వచ్చింది. ఇటువంటి పరిస్థితిలో మళ్ళీ అదే కార్యక్రమం మాస్టరుగారు నిర్వహించబూనుకున్నారు. ఈ శతాబ్ద ప్రారంభంలో మేడమ్ బ్లావెట్‌స్కీ మొదలైన వారు ఎంతో ప్రయత్నం చేశారు. వారి అనంతరం మళ్ళీ కార్యక్రమం కుంటు పడింది. ఈ కార్యక్రమాన్ని మాస్టరుగారు చేపట్టారు. వేదానికి సరైన అర్థం మాస్టరుగారు చెబుతున్నారు. పురాణాలలోని పాత్రలకు, సన్నివేశాలకు, ఉపదేశాలకు, వేదాలలోని సూక్తాలకు, మహర్షులు, అవతారమూర్తుల జీవిత సన్నివేశాలకు సమన్వయం

సాధించి చెప్పడం మాస్టరుగారికి ఒక్కరికే సాధ్యం. ఇంతవరకు ఎందరో మహానుభావులను, మహాత్ములను, గురువులను దర్శనం చేసుకున్నాము. వారి బోధనలను విన్నాము. కాని ఇలాంటి సమన్వయం మాత్రం ఎక్కడా లభించలేదు.

సమన్వయం ఒక్కటే కాదు. మాస్టరుగారి వాక్కులలో ఒక అమృతమయమైన శక్తి ఉంది. అది అయస్కాంతీకరణ శక్తి వంటిది. ఇనుపముక్క అయస్కాంత స్పర్శతో అయస్కాంతంగా మారినట్లు, ఆయన వాక్కులు మన జీవితాలనే వెలుగుగా మార్చి వేస్తాయి. వేద ధర్మంలోనికి, పురాణ ధర్మంలోనికి, అవతార మూర్తుల ఉపదేశాలలోనికి మన జీవితాలు కరిగిపోతాయి. మన జీవితాలను ఇలాంటి దివ్యత్వంలోనికి కరిగించడమే మాస్టరుగారి ముఖ్య కార్యక్రమం. వేదం అర్థం కావాలంటే ముందుగా నేర్చుకోవలసిన శాస్త్రాలే ఎన్నో ఉన్నాయి. వాటినన్నింటినీ గుర్తుంచుకుని పండితమార్గంలో అర్థం చెప్పడం మొదలు పెడితే ఇక మనం వేదం జోలికి పోలేము. అసలు అలా చెప్పడం మొదలుపెట్టిన నాటి నుంచే వేదం మనకు అంటకుండా పోయింది. కాని మాస్టరుగారు ఏ పురాణం చెప్పినా, ఏ శాస్త్రం చెప్పినా, ఏ వేదం చెప్పినా, ఏ కావ్యం చెప్పినా అర్థం కాకపోవడం అంటూ ఉండదు. కారణం ఏమిటంటే, ఆయన ప్రతి శాస్త్రాన్నీ సమన్వయం చేసి దర్శనం చేయించగలరు. ఆయన వేదాన్ని, పురాణాలను జీవితాలకి ఎలా సమన్వయ పరుస్తారో వివరిస్తాను.

## వేదపురుషుని సన్నిధి

మాస్టరుగారు శిష్యులందరిచేతా వేదాధ్యయనం చేయిస్తూంటారు. బృందాలు బృందాలుగా ఇప్పటికి ఎందరో వేదం నేర్చుకున్నారు. ఇంకా నేర్చుకుంటున్నారు. ప్రతి పూర్ణిమకు ఏకాదశ రుద్రాభిషేకం జరుగుతుంది. మహాశివరాత్రికి, కార్తీక పూర్ణిమకు

తరవాత నాలుగు గంటలపాటు మహాన్యాస పూర్వక మహా రుద్రాభి షేకం జరుగుతూ ఉంటుంది మాస్టరుగారి ఆధ్వర్యంలో. మాస్టరు గారి సంప్రదాయానికి చెందిన ప్రతి యింటిలోనూ అనుదినమూ గాయత్రీ జపమూ వేదగానమూ జరుగుతూ ఉంటుంది. చాలా చిన్న వయసులో ఉన్న పిల్లలు వేద పఠనం చేస్తూఉంటే చూడ ముచ్చటగా ఉంటుంది. కలుషితమైపోయిన నగర వాతావరణంలో, దానితోబాటు కలుషితం కాకుండా ప్రశాంతంగా, నవ్వుతూ, హాయిగా మాస్టరుగారి శిష్యబృందం జీవిస్తున్నదంటే, ఈ వేదా ధ్యయనమే కారణం. జీవితాలు దీనికి అంకితం చేయడమే కారణం. పురుష సూక్తంలోని సహస్ర శీర్షుడైన పురుషుడు అంటే వారికి మాస్టరుగారే! ఉపదేశించే గురువుగా, అనుగ్రహించే దైవంగా, సంరక్షించే తల్లిగా, పోషించే తండ్రిగా, కష్ట సుఖాలు వినే స్నేహితుడుగా, కష్టంలో ఆదుకునే ఆప్తుడుగా, శుభకార్యాలలో బంధువుగా, అనారోగ్యాన్ని నయం చేసే వైద్యుడుగా, మంచి చెడ్డలు వివరించే ధర్మదేవతగా, ఈ అన్ని సత్యాలూ రూపు కట్టిన సత్య స్వరూపుడుగా, సమస్తంగా అందరూ ఆయనను దర్శనం చేస్తారు. చిన్న చిన్న విషయాలు మొదలు పెద్ద విషయాలదాకా ఆయనను ఆదర్శంగా చేసుకొని జీవితాన్ని నడుపుకుంటారు. కనుకనే మాస్టరుగారిని అనుసరించే వారి జీవితాలకు 'నాకు ఇది కావాలి' అనే అర్థిత్వం ఏనాడూ లేదు. "నీకేం కావాలి?" అని అడిగి ఇంకొకరికి సహాయం చేసే స్థితిలోనే అందరూ ఉంటారు. ఈ దివ్య జీవితాలకు కారణం ఒక్కటే – వేదమార్గాన్ని అనుస రించడం. "వేదాన్ని నమ్మినవారు, అనుసరించినవారు ఎప్పుడూ దేనికీ బాధపడవలసిన అవసరం లేదు." అని చెబుతూ ఉంటారు మాస్టరుగారు. ఈ సత్యానికి వారే నిదర్శనం, వారి శిష్యుల జీవితాలే నిదర్శనం.

## సార్థక సరస్వతి

మాస్టరుగారి వద్దకు ఒకనాడు వేద పండితులు ఒకరు వచ్చారు. మాస్టరుగారిని ఇలా అడిగారు: "ఏమండీ! మీరు వేదాన్ని అందరికీ చెబుతున్నారట? అది చాలా తప్పు. ఆ విషయమై మీతో వాదించాలని వచ్చాను." మాస్టరుగారు వెంటనే యిలా అన్నారు: "తమరు రెండు మూడు రోజులు ఉండండి. మీతో వాదించగల సమయం భగవంతుడు నాకు ఇవ్వలేదు. చేతనైనంత వరకు ఇతరులకేమైనా సహాయం చేసి పెట్టడంలోనే కాలం అంతా సరిపోతున్నది. ఇంక వాదించడానికి సమయం ఏది? ఏ పనులూ లేకుండా వాదనలకు సిద్ధంగాఉన్న మరో పండితుని వెదికి మీకు అప్పగిస్తాను. అటువంటి వ్యక్తి లభించాక తీరుబడిగా మీరిద్దరూ వాదించుకుందురుగాని. అంతవరకూ మీరు శ్రమ అనుకోకుండా వేచి ఉండండి." ఈ మాటలకి ఆ పండితుడు గాభరా పడ్డాడు.

వెంటనే అతడు మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా మాస్టరుగారే యిలా అన్నారు. "వాక్కు అంటే సరస్వతి. ఆ వాక్కు ఇతరులను ఆశీర్వదించడానికి, ఇతరులను ఉత్సాహపరచడానికీ, ఇతరులకు ఉపదేశం చేయడానికి, ధైర్యం చెప్పడానికి ఉపయోగిస్తే సార్థకమవుతుంది. వాదనలవల్ల ఏమొస్తుంది? ఇంత కాలంగా మీరు చేసిన వేదాధ్యయనం వలన మీ మనస్సులో ఏ మంచి సంకల్పం అయినా ఉంటే అది కార్యరూపంలో పెట్టండి. మీవంటి పండితులు వేద మార్గాన్ని విడిచి, వాదోపవాదాల మార్గాన పడబట్టే జాతి యిలా పతనమైంది. ఈ పాపం ఊరికే పోయేదికాదు. వేదాన్ని వెలిగించడానికి బదులు మీరు చీకటి నింపుతున్నారు. ఇప్పటికైనా మంచి మార్గాన పయనించండి. మా పిల్లలందరూ చిన్న వయస్సునుంచీ వేదాన్ని సస్వరంగా అధ్యయనం చేస్తున్నారు. అంతే కాదు. అందులోగల అర్థాలను,

దేవతలను తమ సత్ప్రవర్తనద్వారా దర్శనం చేస్తున్నారు. ఇంకా మీబోటి పెద్దలు ఇలాగే ఉంటే, పెరిగి పెద్దవారైన తర్వాత ఈ పిల్లలు మిమ్మల్ని ప్రక్కకు నెట్టక మానరు. వెళ్ళండి."

మాస్టరుగారి మాటలు వింటుంటే నాకు గుండెలు దడ దడ లాడాయి. ఆయన ప్రణాళిక కన్నులముందు మెదిలింది. ఆయనకు హృదయంలోనే నమస్కారం చేశాను. ఆయన సాన్నిధ్యంలో ఉండే మహదవకాశం మాకు లభించింది. అంతకన్నా అదృష్టం ఏముంది?



తొమ్మిదవ కిరణము

# యోగ వికాసము

" Preach the Gospel
Treat the sick "
— Christ

" జ్ఞానాన్ని భోధించు - రోగులను సేవించు "

మాస్టరు సి. వి. వి. గారు కూడా ఇదే భావాన్ని మరో విధంగా సెలవిచ్చారు. " Prana Treat. Yoga Teach. " ముఖ్యమైన సేవ ఆర్తజనసేవ. అతి ముఖ్యమైన బోధ యోగ బోధ.

వేదం చదవడం, దేవాలయాలు నిర్మించడం, ఉపన్యాసాలివ్వడం—ఇవన్నీ ఇతరులకు మనవల్ల ఏ విధంగానైనా సహాయం జరుగుతున్నపుడు ప్రయోజనకరమైనవే. లేకపోతే ఇవన్నీ వ్యర్థమే! పూవులను దండగా కూర్చవలెనంటే దారం కావాలి కదా! అలాగే మనం చేసే ఎన్నో పనులు సార్థకం కావాలంటే ఇతరుల రూపంలో ఉన్న భగవంతుని సేవించుట అనే దారం కావాలి. సేవాభావం లేకపోతే ఇవన్నీ వ్యర్థం. అడవులకి పోవడం, తపస్సు చేసుకోవడం, శరీరాన్ని శుష్కింపజేయడం, ఉపవాసాది వ్రతాలు చేసుకోవడం-ఇవన్నీకూడా మనస్సులో సేవాభావం లేక

పోతే వ్యర్థమంతే! కనుకనే క్రీస్తు, బుద్ధుడు, రాముడు, కృష్ణుడు, జనకుడు మొదలైన వారి జీవితాలను ఆదర్శంగా తీసుకోవలసి ఉంటుంది. వీరి యోగ మార్గాన్ని అనుసరించి యిచ్చిందే మాస్టరు సి. వి. వి. గారి యోగమార్గం. ఇందులో మనం తెచ్చుకోవలసిన సాధన సామగ్రి, సరంజామా ఏమీ లేదు. తిథి వార నక్షత్రాలు, ముహూర్తం అక్కర్లేదు. మనం చేయవలసింది ఒక్కటే. అది "ఏమీ చేయకుండా ఉండడం, ఊరకుండడం, అంతా మాస్టరు గారికి వదిలి వేయడం" అంతే!

ఇక్కడే సి. వి. వి. గారి శిష్యులు ఈ వాక్యాలను అపార్థం చేసుకుని వెనుకబడ్డారు. చేయవలసిన కర్మాచరణం మాని, "అంతా మాస్టరుగారే చూసుకుంటారు. మనం ఏదైనా చేస్తే మనం చేసిన వాళ్ళ మవుతాము. ఏమి చేయవలసిందీ మాస్టరుగారే చూసుకుంటారు. మనకు తట్టించేది, మనచేత చేయించేది ఆయనే గదా!" అనడం సాగించారు. ఇవన్నీ సమర్పణగా, వైరాగ్యంగా వాళ్లు అనుకుంటూ, ఇతరులను కూడా అనుకోమంటారు. కాని ఇవి కేవలం సోమరితనానికి, కరడు గట్టిన స్వార్థానికి నిదర్శనాలు.

## అ న న్య భ క్తి

శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పిన
"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః"
అనే శ్లోక భావాన్ని

"అనన్యా శ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహా మ్యహమ్."

అనే శ్లోకభావాన్ని మాస్టరు సి. వి. వి. గారు ఇంగ్లీషులో యిచ్చారు. "అన్యమైన చింత వదలి నన్ను స్మరించండి. అన్ని ధర్మాలు వదలిపెట్టి నన్ను శరణు వేడండి". అంటే, 'నేను' అనేది అన్ని ధర్మాలకు మూలం. దానికి ఆవల ఇంకేదీ లేదు. అట్టి 'నన్ను' శరణువేడండి." అని పై శ్లోకాల అర్థం. ధర్మమంటే ఏమిటి? ధర్మాన్ని ఎలా ఆచరించాలి? అని వితర్కించే స్థితి కాక, ధర్మంగా ఆచరిస్తూ ఉండే స్థితి అది. ఆ ధర్మం నుంచి చిల్లర ధర్మాలన్నీ పుట్టాయి. మనం అటువంటి ధర్మ స్వరూపంగా ఉండడం, చిల్లర ధర్మాలన్నీ సమర్పణ చేయగలగడం కావాలి. మనకి నచ్చినది, మనకు మంచి అనిపించినది, మనం ధర్మం అనుకున్నది-ఇవన్నీ మన మనస్సు యొక్క విన్యాసాలు. 'నేను' అనే పరమాత్మ ప్రజ్ఞ వీటన్నిటికి పైన ఉన్నది. అది క్రింది లోకాలను అన్నింటిని వెలిగించాలంటే, దాని చుట్టూ ఉన్న పొరలకు ఉన్న మసిని తొలగించుకోవాలి. అంటే ఇంద్రియాలు మనస్సునందు సమర్పణ చెందాలి. అలాగే మనస్సు బుద్ధియందు, బుద్ధి ఆత్మయందు సమర్పణ చెందాలి. అప్పుడు ఆత్మ అనే వెలుగు అన్నిటి యందు, అంటే మన సంకల్పంగా, ఊహలుగా, ఆచరణగా దిగి వస్తుంది.

మనం చేయవలసింది మనకై మనం ఏమీ చేయకుండా ఉండడం. మనలో పనిచేస్తున్న ఈ వెలుగు మన ద్వారా ప్రసరిస్తూ ఉన్నప్పుడు మధ్యలో మనం అడ్డుపడకుండా ఉండడం. సూర్యరశ్మి మన యిండ్లలోకి ప్రసరించాలంటే మనకై మనం ఏమీ చేయనక్కర లేదు. మన కిటికీలు మూయకుండా ఉండాలి, అడ్డుగా ఏదీ ఉంచకూడదు — అంతే! మనం చేస్తున్న పనులన్నీ మనమే చేస్తున్నామనే భ్రమ కొన్ని జన్మలవరకూ ఉంటుంది. కాని ఈ పనులు మనం చేస్తున్నవి కావు, మన ద్వారా జరుగుతున్నవి అని మనకు తెలియడానికి కొన్ని జన్మలు పడుతుంది. ఈ తెలిసినదానియందు విశ్వాసం కలగడం, ఆ తర్వాత గురి కుదరడం, తర్వాత అభ్యాసం చేయడం,

ఆ తర్వాత దర్శనం చేయడం – ఇది కొన్ని జన్మల సాధన. గుండె కొట్టుకోవడం, శ్వాస క్రియ జరగడం, రక్తం ప్రసరించడం – ఇవన్నీ వాటంతట అవే జరుగుతున్నాయి గాని మనం చేస్తున్నవి కావు గదా! ఈ ప్రక్రియలో మనం చేయవలసింది ఏమైనా ఉంటే, అది ఏమీ చేయకుండా ఉండడం. అంటే జరుగుతున్నదానిని పరిశీలించడం. చేయడం అంటూ ఉంటే ఆ ప్రజ్ఞలతో సహకరించడమే – గాని జరుగుతున్నదానికి అడ్డుపడడం కాదు. అడ్డుపడడం అంటే యోగ భ్రష్టత చెందడం, అనారోగ్యం. అందరినీ వదలి అడవులకి పోవడం, పురాణాదులకు ప్రత్యేకంగా స్వంతంగా వ్యాఖ్యానాలు వ్రాయడం యోగ భ్రష్టతకు వేర్వేరు రూపాంతరాలే. వైరాగ్యం, భక్తి, సమర్పణ మార్గాలు వదలిపెట్టి మాయలు మంత్రాలతో ప్రజలను భ్రమ పెట్టడం, సాటి సోదరులను వదలి అరణ్యాలలో ఆశ్రమాలను నిర్మించడం, సంసారం బంధమని భ్రమపడడం, నేను వైరాగ్యవంతుడనని అహంకరించడం మొదలైనవి కూడా యోగ భ్రష్టుల వికార చేష్టలే.

ఇలాంటి వికారాలు జీవితంలో లేకుండా ఉండాలంటే, రాముడు, కృష్ణుడు, క్రీస్తు, జనకుడు మొదలైన వారిని ఆదర్శంగా తీసుకోవాలి. వీరందరూ సాటి మానవుల మధ్యనే ఉండి అక్కడే యోగాన్ని సాధించినవారు. సాటి మానవులకు యోగాన్ని ఉపదేశించినవారు. ఇతరులకి సేవ చేయడంలో ఆనందం పొందినవారు. ఆనందం అంటే ఎవరికి వారుగా కూర్చుని ఆనందించడం కాదు. సేవ చేయడం అంటే, ఇతరులు బాధల్లో ఉన్నారు అనే జాలితో కాదు. మన శరీరంలో ఒక భాగం బాధపడుతున్నప్పుడు ఆ బాధ శరీరం అంతటా ఉన్న "మనం" అనుభవిస్తాము గాని, "పాపం ఈ చెవి బాధ పడుతోంది" అని జాలిపడము. అలాగే మన సాటివారు బాధ పడుతుంటే ఆ బాధ మనమే పడుతున్నట్లు అనుభవించ గలగాలి. అప్పుడు మనం చేసే సేవ, ఒక మాట, ఒక స్పర్శ, ఒక చూపు బాధార్తులకు ఉపశమనం కలిగిస్తుంది.

యోగపారిజాతం

మాస్టరు సి. వి. వి. గారు బోధించిన యోగం క్రొత్తది కాదు. సనాతనమైనదే. యీ కాలపు మానవుల మనః ప్రవృత్తి, స్వభావాలకు అనుగుణంగా, సనాతనమైన యోగాన్నే మరో విధంగా మాస్టరు సి. వి. వి. గారు బోధించారు. "ఇతరులనుండి ఏ సహాయం కావాలని నీవు కోరుకుంటున్నావో, ఆ సహాయం నీవు ఇతరులకు చెయ్యి. ఇతరులు నీకు ఏం చేయకూడదనుకుంటున్నావో అది యితరులకు చేయకు. ఇతరులు 'మాకు ఇది కావాలి' అని నిన్ను కోరినపుడు, వారి కోరికల ననుసరించి కాక, వారికి నిజంగా ఏది అవసరమో అది చేసిపెట్టు. ఇతరులు మాట్లాడుతుంటే, వారి మాటలలోనుండి నేను ఏం మాట్లాడుతున్నానో విను. ఈ మార్గంలో సాధన చేస్తే, ఏనాడూ నీకు కావలసినదంటూ ఏదీ ఉండదు." అన్నారు మాస్టరు సి. వి. వి. గారు. యోగ సాధన అంతా ఈ ఉపదేశంలోనే ఉంది. ఇప్పుడు మొగ్గలుగా మనకి కనిపిస్తున్న యీ వాక్యాలు, మనం సాధన చేస్తూ ఉన్న కొద్దీ వందల రేకులు విచ్చుకుంటూ దివ్యమైన యోగ పరిమళాలను వెదజల్లుతాయి.

"నీవు చేయవలసిన పని ఊరకుండడం" అని చెప్పిన మాస్టరు సి. వి. వి. గారు మళ్లీ ఇవి చేయమని చెప్పడం ఏమిటి ? అని సందేహం రావచ్చు. ఎవరికైనా సహాయం కావలసి వచ్చినపుడు సహాయం చేయడం, అవసరం లేనప్పుడు దానిని గురించి ఆలోచించకుండా ఉండడం, సహాయం చేసిన తర్వాత కూడా చేసిన సహాయాన్ని గురించి గట్టిగా చెప్పుకోవడంగాని, మురిసిపోవడంగాని చేయకుండా ఉండడం కావాలి. ఆ సహాయాన్ని గురించి వివరించవలసి వచ్చినపుడు మాత్రమే దాన్ని గురించి మాట్లాడాలి, లేనపుడు మౌనంగా ఉండాలి. ఇతరులు మనను నిందించినపుడు మనస్సులోనైనా రోషపడకూడదు. చేయవలసిన పనిని సకాలంలో

శ్రద్ధతో చేయగలగాలి. సమస్త జీవరాసులయందు గల వాసుదేవుని దర్శించడం, ఎన్నడూ అహంకరించకుండా ఉండడం అవసరం. ఈ సాధన చేస్తే ఊరకుండడం అంటే ఏమిటో అర్థమవుతుంది. రమణ మహర్షి వద్దకు వెళ్లినప్పుడు ఏదైనా అడిగితే, 'ఊరకుండప్పా' అనేవారు. అంటే, "ఓ మనసా, ఎగరబోకు!" అని అర్థం.

యోగసాధన అంటే కన్నులు మూసుకొని తపస్సు చేయడం, ధ్యానం చేయడం కాదు. అష్టాంగ యోగమార్గంలో ధ్యానం, ధారణ ఒక భాగమేగాని, ధారణ ఒక్కటే యోగం కాదు. మాస్టరు సి. వి. వి. గారు చెప్పినది ఒక్కటే. "కన్నులు మూసుకుని నన్ను స్మరించు. మిగిలినది నేను చూసుకోగలను" అని. ఇది అర్థమయితే చాలు. శ్రీ కృష్ణుడు భగవద్గీత అంతా బోధించిన తర్వాత చిట్టచివరగా ఒక్కమాట చెప్పాడు. "నీ వెరిగిన ధర్మాలు, నీ వెరిగిన అధర్మాలు అన్నీ వదలి, నన్ను శరణు వేడు." అన్నాడు. ఈ రెండింటి పరమార్థం ఒక్కటే. జీవుని గమ్యం దేవునిగా మారడం. జీవుడు, దేవుడు అనే రెండు స్థితులు గాక, "నేను" అనే అఖండమైన వెలుగుగా మారడం. ఇదే శరణు జొచ్చడం అంటే. స్మరించడం అంటే 'నేను' అనే వెలుగుగా మారడం. మహాత్ములందరూ బోధించింది యిదే. అయితే దానిపై విశ్వాసం కుదరడానికి చాలా జన్మలు పట్టవచ్చు. ఎందుకంటే, చాలా సులువైనది, సమస్యలు అన్నీ తీర్చేది, కష్టాలనుంచి గట్టెక్కించేది అయిన దివ్య శక్తియే ఆనందం. కాని మానవుల అభ్యాసం వేరు. సమస్యలు సృష్టించుకోవడం, వాటి పరిష్కారం కోసం చర్చలు చేసి అలసిపోయినట్లు కనిపించడం, భ్రాంతిలోనే జీవించడం, తనను తాను మోసం చేసుకొని ఇతరులను మోస గించటం అనేవి మానవునికి అభ్యాసం అయిపోయాయి. ఆ అల వాటు పడిన మనస్సు ఒక్క సారిగా ఆనందంలోకి, శాశ్వతమైన వెలుగులోనికి ప్రవేశించమంటే ఎలా ప్రవేశించగలదు? ఎంతో

కాలం జైలులో నేలమీద పడుకున్నవాడు, విడుదలై వచ్చిన తర్వాత పరుపుమీద పడుకుంటే నిద్రపట్టక బాధపడతాడు. కొంత కాలం కాలికి సంకెళ్ళు తగిలించుకుని కటిక నేలమీదే నిద్రపోదా మనిపిస్తుంది. మానవుని మనస్సు కూడా అంతే.

"వైద్యో నారాయణో హరిః"

ఈ విషయాలన్నీ మాస్టరు సి. వి. వి. గారు బోధించినవి కావు. వారిని స్మరించగా మనస్సులో భాసించినవి. మాస్టరుగారి మార్గంలో, చికిత్స చేయడం అనేదానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. నేటి మానవుడు సంకుచితమైన అభిప్రాయాలతో, స్పర్థలతో, అసూయలతో మానసిక రోగియై పోయాడు. ఇతరుల పట్ల ద్వేషం, అసూయ మొదలైన వాటితో ప్రాణశక్తిని, వ్యర్థంచేసుకుని శక్తి హీనులై పోతున్నారు. శరీర శ్రమ చేయలేక, సుఖజీవనానికి అలవాటుపడి, ఆరోగ్యకరమైన ఆహారానికి బదులుగా, నాలుకకు రుచిగల అనారోగ్య పదార్థాలను తినడం అభ్యాసం చేసుకుంటు న్నారు. శారీరకంగా రోగగ్రస్తులై పోతున్నారు. గర్విష్ఠులు, కామాంధులు, స్వార్థపరులు, అహంకార ప్రియులు - అందరూ మానసిక రోగులే! ఇన్ని కక్ష్యలలోనూ ఉన్న రోగులను చికిత్స చేసి బాగుచేయడం మాస్టరుగారి కార్యక్రమం. సి. వి. వి. గారిని భౌతికంగా దర్శించకపోయినా, సి. వి. వి. ప్రేయరు చేస్తూ, తానే సి. వి. వి. యోగమార్గంగా మారి, తన వెంట శిష్యులను నడిపిస్తున్న వారు మన మాస్టరుగారు. నిజంగా చెప్పాలంటే, మన మాస్టరు గారు సి. వి. వి. శిష్యులైన యోగమిత్రులలో ఒకరు అని చెప్పడం భావ్యం కాదు. మాస్టరుగారే సి. వి. వి. గారి యోగమార్గం. ఈ తేడా తెలియడమే ఒక పెద్ద అనుగ్రహం, ఒక ఉపదేశం. మాస్టరుగారి నడవడి, మాస్టరుగారి వాక్కు, మాస్టరుగారిచ్చిన మందు, మాస్టరుగారు మనతో మాట్లాడకుండా ముభావంగా

ఉండడం—ఇవన్నీ మాస్టరుగారి చికిత్సావిధానంలో భాగాలే! ఇలా ప్రతి సంఘటనలో, ప్రతి సన్నివేశంలో మనకు చికిత్స జరుగుతూనే ఉంటుంది. ఈ సత్యం దర్శన మిచ్చినవారు మాస్టరుగారి దరికి చేరడానికి సిద్ధంగా ఉన్నవారు. ఆయనను అర్థం చేసుకోవాలని, విమర్శించాలని కుతూహల పడేవారు మాస్టరుగారిని చేరడానికి ఇంకా కొంతకాలం పడుతుంది. అది కొన్ని సంవత్సరాలు కావచ్చు; కొన్ని జన్మలు కావచ్చు. దీనికి ఏ సందేహమూ లేదు. రోగం అంటే శారీరక అనారోగ్యం మాత్రమేననీ, చికిత్స అంటే మందులు వేయడం మాత్రమేననీ తెలిసిన యీ కాలంలో మాస్టరుగారి యీ చికిత్సావిధానంపై నమ్మకం కుదరడం కష్టమే. అయితే ఎప్పటికైనా ఈ విశ్వాసం ఉచితీరాలని తరతరాల మానవుల అనుభవం చెబుతున్నది. మా అనుభవంకూడా అదే చాటిచెబుతుంది.

మొట్ట మొదటగా గురుపాదులు (శ్రీ) వేటూరి ప్రభాకర శాస్త్రిగారు మాస్టరు సి. వి. వి. గారిని కలుసుకున్నప్పుడు సి. వి. వి. గారు ఇలా చెప్పారు: "ఇప్పటి నుంచి నీ ఆరోగ్య రక్షణభారం నేను వహిస్తాను. నీవు ఏమీ భయపడకు. తృప్తిలో జీవించు." ('యోగక్షేమం వహామ్యహం' అన్నాడు కృష్ణుడు!) నేను మొదటిసారి ప్రభాకరశాస్త్రిగారిని కలుసుకున్నప్పుడు వారిలా సెలవిచ్చారు. "నీవు ఈవేళనుంచి బాగానే ఉంటావు. నీ పరిసరాలలో ఉన్నవారిని గురించి ఆలోచించు. నీ ప్రక్కనున్నవారి ఆనందం కోసం ప్రయత్నించు. నీకు తృప్తి, ఆనందం లభిస్తాయి. ఇతరులను సేవించు; నీ ఆరోగ్యం కుదుట పడుతుంది. ఇతరులకు సహాయపడు: నీకు సహాయం లభిస్తుంది. ఇతరులకు క్షేమం కలగాలని మనస్సులో తలచుకో; నీకు క్షేమం చేకూరుతుంది." వారు చెప్పిన ఆ క్షణం నుంచి ఆ దివ్యబోధతోనే జీవితం నడుస్తోంది. నన్ను నడిపిస్తూ ఉన్నది ఆ వెలుగే. నాపైన మాత్రమే కాక, నా చుట్టూ ఉన్న వారి యెడల కూడా ఆ వెలుగు ప్రసరించడం మన యోగమిత్రు

లందరూ ఎరిగిన విషయమే! ప్రేమ కరుణ ముద్దగట్టి, మూర్తి కట్టిన వారు శాస్త్రిగారు. వారికి ఒక్కటే తపస్సు. అందరి ఆనందమే తన ఆనందం కావాలని. మన మెక్కడ ఉన్నా అక్కడ సుఖ శాంతులు విస్తరించాలని. మన వద్దకు వచ్చినవారు స్వస్థత పొంది, ఆరోగ్యవంతులై సుఖంగా ఉండాలని. "సి. వి. వి. గారే మనకు రక్ష. ఆయన స్మరణమే మనలను కాపాడగలదు" అని బోధించే వారు శాస్త్రిగారు. ఆయనకు సి. వి. వి. గారి యెడల గల అచం చలమైన విశ్వాసమే ఆయనను దివ్యపురుషులను చేసింది, మనలను తరింప జేస్తున్నది.

అన్నిటికి మాస్టరొక్కరే
యున్నారను నిశ్చయింపు టుత్సాహంబున్
నిన్నున్ నన్నున్ మనలన్
వెన్నాడును కాచునింక వెరపేమిటికిన్!

ఎన్నో బాధలు వచ్చును
అన్నిటికిని నాగజాలు నట్టి బలంబున్
తిన్నని సాధన కుదరక
ఉన్నప్పుడు బాధలన్ని ఒదుగును వెలుగై

శాస్త్రిగారి పరిచయం అయిన తరువాత చాలా మందిలో తమ తమ ప్రవర్తనలో చక్కని మార్పు వచ్చింది. ఆయన శరీ రంతో ఉన్నప్పుడేకాదు, ఆయన శరీరం వదలిన తరువాత కూడా ఆయన స్మరణ వల్ల విచిత్రమైన మార్పులు జరగటం ఆయన దివ్య శక్తికి నిదర్శనం. ఆ మధ్య శాస్త్రిగారి శిష్యులలో ఒకరు నా వద్దకు వచ్చారు. "నాకు చాలా మంత్రాలు వచ్చును. కాని అవి ఏవీ నా అజీర్ణ వ్యాధిని తగ్గించ లేకపోతున్నవి. చాలా కాలం నుంచి యీ వ్యాధితో బాధపడుతున్నాను. నాకు ఉపశమనం కలిగిం చండి" అన్నాడు. అప్పుడు నా చేతిలో జామపండు ఉన్నది. నేను

వారికి ఆ పండు ఇచ్చి, 'తినండి' అన్నాను. ఆయన భయపడ్డారు. జామిపండు తింటే బాధ ఎక్కువ అవుతుందన్నారు. "నేను మీకు చెప్పవలసిన పనిలేదు. అయినా గుర్తు చేస్తున్నాను. మనం ఏమైనా బాధలు చెప్పకుంటే శాస్త్రిగారు ఏం చేసేవారు? దాని వలన మనకు ఎప్పుడూ బాధలు తగ్గడమే గాని, ఎక్కువ కావడం ఎప్పుడైనా జరిగిందా? తీసుకోండి తగ్గుతుంది" అన్నాను. ఆయన, "శాస్త్రిగారు శరీరంతో ఉన్న రోజులవి. కాని ఇప్పుడు ఆయన లేరుగదా!" అన్నారు. నాకు ఆశ్చర్యం వేసింది. శాస్త్రిగారు అంటే వారి భౌతిక శరీరం కాదు. ఆయన బ్రతికి ఉన్న రోజుల్లో అయితే మాత్రం, గురువు భౌతిక శరీరాన్ని రాసుకుంటూ కూర్చున్నందువల్ల ప్రయోజన మేమైనా ఉంటుందా? శరీరం ఉన్నా లేకపోయినా వారి నుండి మనకు ప్రసరించేది ఆ వెలుగే కదా! ఈ విషయం తెలియనప్పుడు గురువును ఆశ్రయిస్తే ఏం? ఆశ్రయించకపోతే ఏం? అని నా మనస్సులో అనిపించినా బయటికి అనలేదు. ఆయనతో ఇలా అన్నాను.

"శాస్త్రిగారు శరీరంతో ఉన్నప్పుడు కూడా మనం ఏం చేసే వాళ్ళమో మీకు గుర్తుండే ఉంటుంది. ఆయన పేరున ఉత్తరం వ్రాసి పోస్టు చేసే వాళ్ళం. ఆ ఉత్తరం వారికి చేరక ముందే వ్యాధులు తగ్గటం మొదలెట్టేవి. ఉత్తరం ఆయనకు చేరడం కన్న వారికి మన ప్రార్థనా విషయాలు తెలియడం ముఖ్యం. మనం భక్తితో ప్రార్థన చేసిన క్షణంలోనే వారికి ఈ విషయం తెలియగలదు. అసలు మనం ఉత్తరం వ్రాసేటప్పుడు శాస్త్రిగారు తిరుపతిలోనే ఉన్నారని నమ్మక మేమిటి? వారు ఎక్కడైనా ఉండి ఉండవచ్చు. అయినా మనకు వ్యాధులు తగ్గుతూనే ఉండేవి. కనుక అప్పటికీ ఇప్పటికీ మనను రక్షించేది వారిలోని దివ్యశక్తి, ప్రేమ, కరుణలే నని తెలియడం లేదా?" ఇలా చెప్పే సరికి ఆయన సమా

ధాన పడి జామపండు తిన్నారు. దానితోనే వారి కడుపునొప్పి తగ్గి పోయింది.

నేను విశాఖపట్టణం వచ్చినప్పుడు మాస్టరుగారిని దర్శించాను. నాకు వారిలో శాస్త్రిగారే కనిపించారు. శాస్త్రిగారి ప్రతిబింబమే మాస్టరుగారుగా కనిపించింది. రోగార్తులై తమ వద్దకు వచ్చిన వారిని ఎంతో ప్రేమతో పలకరించడం, దయతో వారి బాధలు తొలగించడం అనే దివ్యమైన కార్యక్రమం సరిగ్గా తిరుపతిలో శాస్త్రిగారి వద్ద జరిగినట్లే, వైజాగులో మాస్టరుగారి వద్ద కూడా జరగడం నేను గమనించాను. తనను నమ్మిన వారి యెడ తనను తాను అర్పించుకునే తన్మయత్వం, వాత్సల్యం, ముఖంలో అవే వెలుగు రేఖలు - ముమ్మూర్తులా శాస్త్రిగారే మళ్ళీ మాస్టరుగారిలో నాకు కనిపించారు. ఒకే వెలుగు ఇన్ని రూపాలతో, ఇన్ని విధాలుగా దిగి రావటం, పలకడం అంటే యిదేనని నాకు దర్శన మయింది.

## ఉత్సాహమూర్తి

మాస్టరుగారి యింటిలో ప్రతిరోజూ ఉదయం మందులివ్వడం జరుగుతుంది. ఎన్నో గ్రామాలనుంచి, పరిసర ప్రాంతాలనుంచి వేలాదిగా రోగార్తులు వస్తుంటారు. మాస్టరుగారు డిస్పెన్సరీ మొదలు పెట్టిన తర్వాత ఇన్ని సంవత్సరాలుగా ఒక్కరోజు కూడా డిస్పెన్సరీ ఆపుచేసింది లేదు. మాస్టరుగారు, ఆయనతో బాటు ఆయన పిల్లలు, ఆయన శిష్యులు రోగులకి వైద్య ప్రదానం చేస్తుంటారు. రోగి చాలా ప్రమాదకరమైన పరిస్థితుల్లో ఉంటే నెలల తరబడి నిద్ర లేకుండా సేవలు చేసిన రోజులున్నాయి. వారిలో ప్రతిక్షణం ఉత్సాహం కనిపిస్తుందేగాని ఏ మాత్రం అలసట కనిపించదు. ఉపకారం చేస్తున్నామన్న భావం కనిపించదు. ఎంతో కాలం నుంచి పెద్ద పెద్ద డాక్టర్ల వద్ద కూడా జబ్బు తగ్గని వారు మాస్టరుగారి వద్దకు వచ్చి రోగాలు నయం చేసుకుంటారు. దీనికి కారణం

ఒక్కటే. వ్యాధులతోగాని, సమస్యలతోగాని బాధపడేవారు తమపై తమ కుండే విశ్వాసం కన్న, వ్యాధిపైనో, సమస్యలపైనో ఎక్కువ విశ్వాసం ఉంచుతారు. పదే పదే ఆ బాధలను స్మరించడం వల్ల ఆ బాధలు మరింత ఎక్కువవుతాయేగాని తగ్గవు. మనస్సు కామధేనువు వంటిది. మనం ఏది కోరితే అదే ఇస్తుంది. మాస్టరుగారితో పరిచయమైన తర్వాత, వాత్సల్యపూరితమైన ఆయన అనునయ వాక్యాలు ఆ రోగులలో మాస్టరుగారిపై విశ్వాసం కుదురుకునేటట్లు చేస్తాయి. ఆ తరవాత వారిపై వారికే విశ్వాసం కలిగి కుదురుకుంటుంది. నిరంతరం వ్యాధిని తలచుకోడానికి బదులు, మాస్టరుగారిని, వారిలో గల వాత్సల్యాన్ని, వారి సాన్నిధ్యాన్ని తలుచుకోవడం మొదలు పెడతారు. దీనితో ముందు మనస్సు నుంచి నెమ్మదిగా వ్యాధి లక్షణం తొలగిపోవడం ప్రారంభమవుతుంది. అసలు వ్యాధి ప్రారంభమయ్యేది మనస్సునుంచే అనే సత్యం ఆధునిక వైద్య శాస్త్రానికి ఇంకా అంతుపట్టని విషయం. ఈ విషయం అంతు చిక్కక పోవడం వల్లనే, చాలా వ్యాధులు నయంకాకుండా మిగిలిపోతున్నాయి. ఈ విజ్ఞానం ఆయుర్వేదంలోను, హోమియోపతీలోను సమగ్రంగా ఉంది. కనుకనే మాస్టరుగారు హోమియో వైద్య విధానం అవలంబించారు. డిగ్రీ పుచ్చుకుని బోర్డు కట్టిన ప్రతీ ప్రాక్టీషనరూ డాక్టరు కాలేడు అంటూంటారు మాస్టరుగారు. డాక్టరు వృత్తి ఒక కళ. వచ్చిన రోగిని పలకరించడం, వాడి మానసిక లక్షణాలను బట్టి వాడిని ప్రశ్నించడం, వాడి ప్రవర్తనను చేష్టను గమనించడం మొదలైనవి డాక్టరు చేయగలిగి ఉండాలి. రోగిపట్ల ఎప్పుడూ విశ్వాసం, ప్రేమ ఉండాలి. అవే ఆ రోగిని రక్షించగలవు.

'విశ్రాంతి అంటే పనే!'

మాస్టరుగారు విశ్రాంతి కోరని ఉత్సాహవంతులు. నిరంతర కార్య దీక్షాపరులు. అప్పుడప్పుడు ఆయనకి జ్వరం వస్తూఉంటుంది

చిన్న చిన్న జ్వరాలు అయితే విశ్రాంతి తీసికోవడం అలవాటు లేదు ఆయనకు. 105 డిగ్రీల వరకు జ్వరం వస్తే, చలి వణికి స్తూంటే – అప్పుడు ఆయన విశ్రాంతి తీసుకుంటారు. అంటే శరీరాన్ని మంచం మీద విశ్రమింపజేసి కదలకుండా పడుకుంటారు – అంతే! ఆయన చేసే పని మాత్రం మారదు. ఏదో ఒక పుస్తకమో, వ్యాసమో, ఒక ప్రణాళికో తయారు అయిపోతుంది ఆ సమయం లోనే. ఆయన కాలికి తీవ్రమైన కురుపు వేసి, దాదాపు నెలరోజులు మంచం ఎక్కించింది. ఆ నెలరోజుల్లోనూ భాగవతం ప్రథమ స్కంధానికి వ్యాఖ్యానం తయారైంది. మరోసారి ఆయనకు విపరీతమైన జ్వరం వచ్చింది. 'మిథిలా కాలనీ' ప్రణాళిక తయారైంది. ఆయనకు జ్వరం వంటి అల్ప బాధలు వచ్చిన సమయాల్లో కూడా చక్కని కార్యక్రమాలు నడుస్తుంటాయి. దివ్యమైన సంకల్పాలు, వాని నుండి దివ్యమైన కార్యక్రమాలు అమలులోనికి వస్తుంటాయి.

ఇలాంటి పరిస్థితిలో కూడా ఎవరైనా రోగికి బాగుండలేదంటే ఉన్నపాళంగా లేచి బయలుదేరి వెళ్ళి చికిత్స చేస్తారు. ఈ శక్తి మాస్టరుగారికి ఎలా వచ్చింది? మాస్టరుగారిని అడిగితే "నాదేముంది? నాలోని శక్తి, బలం అంతా పెద్ద మాస్టరుగారే" అంటారు. ఆదివారం వందల మంది రోగులు వైద్యం కోసం ఎక్కడెక్కడి నుంచో వస్తారు. మాస్టరుగారు వారి మధ్యకు వెళ్ళి వారిని పలుకరించి మందులు ఇస్తున్న దృశ్యం చూస్తుంటే మాస్టరుగారు క్రీస్తుగా కనిపిస్తారు. క్రీస్తు యొక్క దివ్య ప్రేమ స్పర్శను మాస్టరుగారిలో ఎవరైనా పొందగలరు. చాలామందికి అనుభవంలో ఉన్న ఒక విషయం వ్రాస్తాను.

## అమృత స్పర్శ

వరల్డు టీచర్ ట్రస్టు చైర్మన్ P. S. S. వర్మ గారి భార్య అన్నపూర్ణ. ఆమెను ఒకసారి చాలా జబ్బు చేసింది. ఎన్ని

మందులు వేసినా తగ్గలేదు. అటువంటి ప్రమాదకరమైన పరిస్థితిలో మాస్టరుగారు ఎక్కడికి వెళ్ళారో కనుక్కుంటే పూర్ణా థియేటర్‌లో సినిమాకు వెళ్ళారని తెలిసింది. వెంటనే వర్మగారి స్నేహితులు కొంతమంది సినిమాహాలుకు వెళ్ళారు. ఇంటర్వెల్‌లో కలుసుకుంటే మాస్టరుగారు చాలా కోపంగా ముఖం పెట్టారు. (కోపంగా కనిపించడమంటే కోపంగా ఉండడంకాదు. ఈ తేడా గమనించాలి.) ఆయన ఇలా అన్నారు. "నాకు మీరేమీ డబ్బు లివ్వడం లేదు. సినిమా హాలులోకికూడా వచ్చి, మందు ఇవ్వమని అడగడంలో మీ ఉద్దేశం నాకు అర్థం కావడం లేదు. సాయంత్రం వచ్చి మందు ఇవ్వగలను. ఈలోగా కావలిస్తే వేరే డాక్టరుకి చూపించండి". ఈ మాటలతో వారికి మండిపోయింది. వారు వెళ్ళి ఆ కోపం వర్మగారిపైన చూపించారు. అవతల భార్య ప్రాణాపాయ స్థితిలో ఉంది. ఇవతల మాస్టరుగారు చూస్తే ఇలా అంటున్నారు. వర్మగారికి అయోమయమైపోయింది. స్నేహితులు వేరే డాక్టరుని తీసుకురమ్మని చెప్పి చెప్పి, విసిగి, కోపపడి, కేకలువేసి, "ఇక నీ ముఖం చూడము" అంటూ వెళ్ళిపోయారు. వర్మగారు చేసేదిలేక అన్నపూర్ణనే అడగడానికి వెళ్ళారు. ఆమె, "నాలో ఉన్నది రాచ రక్తం. పోతే ప్రాణం పోతుంది, మహా అయితే! అంతే గదా! భయం వేస్తే మీరుకూడా బయట ఉండండి. ఆయన వచ్చి మందు వేస్తే వేస్తారు. లేకపోతే లేదు. చూద్దాం" అన్నారామె. ఇక వర్మగారు ఏం చేయగలరు, ప్రేయరు తప్ప? ప్రేయరు మాత్రం చేసే స్థితిలో ఉన్నదా మనస్సు? రాత్రి చాలా ప్రొద్దుపోయాక మాస్టరుగారు తాపీగా దిగారు. కూర్చుని వర్మగారిని పిలిచి, ఇడ్లీ తీసుకు రమ్మన్నారు. అంత రాత్రివేళ ఇడ్లీ ఎక్కడ దొరుకుతుంది? సరే కానీ, అని వెళ్ళారు వర్మగారు. ఒక కాకాహోటలులో అప్పుడే ఇడ్లీ వాయ తీస్తున్నారు. అవి తెచ్చారు వర్మగారు. మాస్టరుగారు ఆమెచేత ఇడ్లీ తినిపించారు. మరునాటి ఉదయానికి

ఆవిడ జబ్బు ఏమయిందో ఆశ్చర్యం! ఆనాటినుంచి అన్నపూర్ణగారు ఇడ్లీ చేయడం ప్రారంభించారు. ఆ సమయానికి ఇంటికి ఎవరు వస్తే వారికి ఇడ్లీ పెడుతూ ఉండడం వారియింట్లో ఒక ఆచారమైపోయింది. ఇది చదివిన వెంటనే కొందరికి అనుమానం రావచ్చు - అందరికీ మాస్టరుగారు ఇడ్లీలు ఇచ్చి జబ్బులు నయం చేయవచ్చును గదా, అని! తప్పక తగ్గించవచ్చు, అన్నపూర్ణగారికున్న ధైర్యంలో, సమర్పణలో వెయ్యోవంతైనా ఉంటే! ఇది ఒకరినొకరు పరీక్షించి తేల్చవలసిన విషయం కాదు. ఎవరికి వారు తేల్చుకోవలసినది. ఇలా మాస్టరుగారి ట్రీట్‌మెంటు ఎన్నో రకాలుగా ఉంటుంది.

ఇక మాస్టరుగారి కార్యక్రమాలలో రెండవది ఉపన్యాసాలివ్వడం. మాస్టరుగారి ఉపన్యాసాలను గురించి ముందే కొంత వ్రాశాను. ప్రతిరోజూ సాయంత్రం 6 గంటలకు ఉపన్యాసం జరుగుతుంది. ఆదివారంనాడు వారి యింటివద్దనే రామాయణం చెబుతారు. ప్రస్తుతం సుందరకాండలో ఉంది. సోమవారంనాడు యారాడ పార్కులో భాగవతం ప్రసంగం జరుగుతుంది. మంగళవారం నుండి శుక్రవారం వరకు ప్రస్తుతం భాగవతం తృతీయ స్కంధం చెబుతున్నారు. మొన్నమొన్నటి వరకూ శనివారంనాడు వేదం క్లాసు జరిగింది. ఆ క్లాసులో సుపర్ణ సూక్తాలకు వ్యాఖ్యానం విపులంగా చెప్పారు. ఆ తర్వాత ఋగ్వేదంలోని కొన్ని మొదటి సూక్తాలు వివరించారు. ఆ క్లాసులు మళ్ళీ ప్రారంభమవుతాయి మాస్టరుగారి సంకల్పాన్ని బట్టి. ఈ కార్యక్రమాలను జ్వాల్‌కూల్ మాస్టరుగారి పరిభాషలో చెప్పాలంటే Teaching అంటారు. మాస్టరుగారి కార్యక్రమంలో Healing కి ఉండే స్థానం Teaching కీ ఉంది. దీనికోసమే మాస్టరుగారు ఇప్పటికి నాలుగుసార్లు చాలా దేశాలు పర్యటించి వచ్చారు.

ఇక మాస్టరుగారి మూడవ కార్యక్రమం రచనా వ్యాసంగం. వారి రచనలు చదివినవారికి తెలుస్తుంది, వాటికిగల స్థానం ఎలాం

టిదో! ఒక సంఘటన ప్రస్తావిస్తే ఈ విషయం మరింత విశదమవుతుంది. మాస్టరుగారు గుంటూరులో ఉన్నప్పుడు 'మిహిర' అనే జ్యోతిష మాసపత్రికను నడిపేవారు. ఆపత్రిక ప్రతులు మదరాసులోని దివ్యజ్ఞాన సమాజానికి పంపుతుండే వారు. బెల్జియం దేశం నుంచి వచ్చి, నీలగిరులలో ఉన్న కోటగిరివద్ద ఆశ్రమం నిర్మించుకుని, శిష్యురాలితో సహా ఉంటున్న ఆల్బర్ట్‌శశీ అనే యోగి, మదాసు వచ్చినప్పుడు 'మిహిర' పత్రికను చదవడం జరిగింది. ఆయన వెంటనే మాస్టరుగారికి ఉత్తరం వ్రాసి తన ఆశ్రమానికి రావలసినదిగా ఆహ్వానించారు. 1963 జూలై 2వ తేదీన మాస్టరుగారు ఆయన ఆశ్రమానికి వెళ్ళారు. ఆల్బర్ట్ శశీ ఒక ఆధ్యాత్మిక గురువు. మాస్టరు జ్వాల్‌కూల్ గారి మార్గానికి చెందినవారు. తన పూజా మందిరంలోనికి ఎవరికీ ప్రవేశం ఇచ్చేవారు కాదు. ఆయన తన పూజామందిరంలోనూ, మాస్టరుగారు తన గదిలోనూ ప్రేయరు చేసుకునే వారు. ఆరోజు శశీ ప్రేయరు చేసుకుంటూఉంటే, మాస్టరు సి. వి. వి. గారి పెద్దఫొటో ఒకటి ఆయనకు ధ్యానంలో కనిపించింది. అదే ఫొటో మాస్టరుగారి వద్ద చూచినపుడు ఆయన ఆశ్చర్యపోయారు. వెంటనే సి. వి. వి. గారిని గురించి మాస్టరుగారిని అడిగి తెలుసుకున్నారు. ఒక గురువు ఇంకా తనకు పరిచయం కావలసి ఉందనీ, ఆయనతో పరిచయం కాగానే వారివద్దకు వెళ్లి శిక్షణ పొందవలసిందనీ తన గురువు తనను ఆజ్ఞాపించారని శశీ చెప్పారు. మాస్టరుగారే తనకు పరిచయం కావలసి ఉన్న గురువు అనీ, అది తన అదృష్టమనీ అన్నారు. ఆనాటి నుంచీ మాస్టరుగారిని తనతో బాటు తన పూజా మందిరంలోకి తీసుకు వెళ్లేవారు. మాస్టరుగారు ఆయన ప్రక్కనే కూర్చుని, ఆయన ధ్యానం చేస్తున్నప్పుడు కలిగిన అనుభవాలు వివరించి చెబుతూఉండేవారు. మాస్టరుగారు అక్కడ ఉన్న రోజుల్లో శశీకి భగవద్గీత సమగ్రంగా ఉపదేశించారు. శశీ మాస్టరుగారి ఉపదేశాలను టేపురికార్డు చేసుకుని తన యోగ

విద్యాలయాలు అన్నింటిలోనూ ప్రసారం చేశారు. తన శిష్యుల కందరికీ మాస్టరుగారి యోగ మార్గంలోనే శిక్షణ యివ్వడం ప్రారంభించారు. మాస్టరుగారి చేత Spiritual Astrology అనే గ్రంథాన్ని వ్రాయించి అచ్చు వేయించారు. ఇంతవరకు వెలువడిన జ్యోతిశ్శాస్త్ర గ్రంథాలన్నింటిలోనూ ఇది ఒక ప్రత్యేకత గలది.

తరువాత శకీ స్వదేశానికి వెళ్ళారు. తిరిగి శరీరం వదలడానికి కొన్ని నెలలు ముందుగా భారతదేశం వచ్చి, మాస్టరుగారి సాన్నిధ్యంలో కొద్ది రోజులు గడిపారు. స్వదేశానికి తిరిగి వెళ్లిన తర్వాత కొద్దినెలలకే ఆయన శరీరం వదలి పెట్టారు. ఈసారి భారతదేశం వచ్చినపుడు ఆయన మాస్టరుగారిచేత వ్రాయించినది Spiritual Psychology అనే గ్రంథం. అందులో మాస్టరుగారు ఇచ్చిన ధ్యానవాక్యాల సముదాయాన్నే (Course of Meditations) ప్రస్తుతం శక్కీగారి యోగ మిత్రులందరూ అనుసరిస్తున్నారు.

1972 వ సంవత్సరంలో శక్కీ గారి మేనకోడలు ఎలిజబెత్ వార్నన్ ఆహ్వానంమీద బెల్జియం వెళ్ళారు మాస్టరుగారు. ఆమె ఆహ్వానించడం, ఆయన వెళ్ళడం అనేవి సంఘటనలు మాత్రమే. ఇది కార్య ప్రపంచం. దీని వెనుక ఒక కారణ ప్రపంచం ఉంది. అది మైత్రేయుల సంకల్పమైన తూర్పు పడమరల సమగ్ర సమ్మేళనము. తూర్పు దేశీయులకు, పాశ్చాత్య దేశీయులకు నడుమ చక్కని సమన్వయం సాధించి, విశ్వ మానవ సౌభ్రాత్రం, వసుధైక కుటుంబం స్థాపించడం మైత్రేయుల ప్రణాళిక. దీనికోసం అవతరించిన మహానుభావులలో మాస్టరుగారొకరు. ఈ కార్యక్రమం కోసమే మాస్టరుగారు నాలుగు సార్లు విదేశాలు పర్యటించారు. వేల మంది పాశ్చాత్యులు మాస్టరుగారి శిష్యులై, జాతి మతాతీతమైన విశ్వ ప్రేమను చవి చూశారు. విశ్వ సోదరత్వానికి దారితీసే యోగ మార్గానికి తమను తాము సమర్పించుకొని, ఆ యోగమార్గాన

జీవితాలు గడుపుతున్నారు. పాశ్చాత్యుల జీవితంలో మొట్టమొదట సారిగా జాతిభేదాల అడ్డుగోడలు తొలగిపోయాయి. క్లైమిష్ కుటుంబాలవారు ఫ్రెంచి కుటుంబాలవారితో కలసి భోజనాలు చేయడం, జాతిభేదాలు పాటించకుండా ఒకరి కార్యక్రమాల్లో ఒకరు పాల్గొనడం, ఒకరి కష్టసుఖాల్లో ఇంకొకరు పాలు పంచుకోవడం జరుగుతోంది. ఈ పర్యటనను గురించిన మాస్టరుగారి డైరీ 'నావాణి' లో గత ఆరు సంవత్సరాలుగా ప్రచురింపబడుతోంది.

ఈ ప్రాక్ పశ్చిమ సమన్వయం అనే కార్యక్రమంలో భాగంగానే మాస్టరుగారు "The Yoga of Patanjali" అనే పేర పతంజలి యోగశాస్త్రాన్ని, "The Mandra Scripture" అనే పేర భగవద్గీతను ఆంగ్లభాషలో రచించారు. ఆయన బోధనల వెనుక, రచనల వెనుక ఉన్న కార్యక్రమం, సంకల్పం ఒక్కటే. ఆ సంకల్పాన్ని అనుసరించి మన జీవితాలను మలచుకోవడంకన్న కావలసింది లేదు.

## జ్యోతిర్మూర్తి

ఒక పెద్ద కార్యక్రమం అసలు జరుగుతున్నప్పుడు మధ్య మధ్యలో చిన్న చిన్న పనులు తగులుతూనే ఉంటాయి - రైలులో ప్రయాణం చేసేవాడికి గమ్యం చేరేలోపున ఎన్నో స్టేషన్లు తగిలినట్లు. ముందు ఎప్పటికప్పుడు వీటిని పరిష్కరించుకుంటూ వెడుతూనే ఉండాలిగదా! అవే మాస్టరుగారి అనుయాయుల జీవిత సమస్యలు, కుటుంబ సమస్యలు, ఆరోగ్య సమస్యలు మొదలైనవి. ప్రతిక్షణం మాస్టరుగారిని నమ్మి అనుసరించేవారిని ఆయన ఎప్పుడూ నడుపుతూనే ఉన్నారు. ఆయనకు రాని శాస్త్రమంటూ లేదు. జ్యోతిషం, సాముద్రికం, శకునం, రమల, సంఖ్యా శాస్త్రం, పక్షి

శాస్త్రం, ప్రశ్న శాస్త్రం–ఒక్కటేమిటి? అన్నింటి యందు మాస్టరుగారు సిద్ధులు. ఎవరికి ఏ సమస్యలు వచ్చినా, ఎవరికీ హానికలగకుండా, ఎవరి మనస్సుకీ బాధకలగకుండా పరిష్కరించే నేర్పు మాస్టరుగారి కున్నది.

నేను ఒకనాడు, "మీరు సంకల్పిస్తే చాలు – సమస్యలన్నీ పటాపంచ లవుతాయి." అన్నాను. ఆయన చిరునవ్వు నవ్వి, "నేను సంకల్పం చేయడం అనేది ఉండదు. ఒకవేళ ఏదైనా సంకల్పం వస్తే నాద్వారా రావలసిందే గాని, నేనుగా సంకల్పించడం అంటూ ఉండదు. ఎవరి కేది కావాలో అది యివ్వడానికి, వారు ఉన్న కక్ష్యనుండి పై కక్ష్యలోనికి లేవనెత్తడానికి వచ్చినవాడిని నేను. నాకు వేరే సంకల్పాలు అంటూ ఏముంటాయి?" అన్నారు. భక్తితో నమస్కరిస్తే చాలు ఈ మాటలలో ప్రవేశించవచ్చు. అర్థం కావాలంటే, భాగవతం ఈ చివరినుంచి ఆ చివరదాకా చదవాలి. భగవద్గీతను దర్శనం చేయాలి. పతంజలి యోగసూత్రాలను అనుష్టించి, కైవల్య స్థితిని పొందాలి. అప్పుడుగాని మాస్టరుగారు ఏ కక్ష్యనుంచి మాట్లాడారో సమగ్రంగా అర్థంకాదు.

### మనోమోహనం

ఇలాంటి మహానుభావుల సన్నిధిలో నిత్యం ఉండగలగడం అదృష్టమో, దురదృష్టమో ఎవరికి తెలుసు? ఎంతో లోతయిన విషయాలను చాలా తేలిక భాషలో చెప్పడం, అదికూడా ఏదో సంభాషణ మధ్యలో దొర్లించి వేయడం మాస్టరుగారు చూపే లీలల్లో ఒకటి. ఇలాంటి విషయాలు మాస్టరుగారు ప్రతిరోజూ ప్రతి నిముషం చెబుతూ ఉండడంతో మాలో చాలామందికి ఇవి అతి సామాన్యమైన విషయాలై పోయాయి. అనుక్షణం వారి సన్నిధిలో ఉంటూ, వారివెంట వెలువడే వ్యాఖ్యలు వింటూ ఉండగలగడం అదృష్టం. ఎప్పుడూ వింటూనే ఉండడంచేత అందులో ఉన్న

దివ్యత్వాన్ని గ్రహించలేక అతిసామాన్యంగా తీసుకోవడం మా దురదృష్టం. మాస్టరుగారు బయటి ఊళ్ళకు వెడితే ఆయన వెంట వెళ్ళే అదృష్టం కలిగితే తెలుస్తుంది, ఆయన మాటల్లో ఉన్న శక్తి ఎంతటిదో! ఆయన విశాఖపట్టణంలో చెప్పే విషయాలకన్న గంభీర మైన విషయాలు అతి తేలికైన భాషలో చిన్న చిన్న పిట్టకథల లాంటివి చెబుతుంటారు. అంతా మనకి చెప్పిందే అన్నట్లుంటుంది. కాని ఆ ఉపన్యాసం విన్న తరువాత అక్కడి వారందరూ పొందిన తృప్తి, అనుభూతి, దర్శించిన వెలుగు, అనుభవించిన ఆనందం చూస్తే మనకి తెలుస్తుంది-మనం పొందలేక పోతున్నదేదో వారు పొందగలుగుతున్నారని! ఇలాంటి అనుభూతిని రుచి మరిగిన వారే మాస్టరుగారు ఊరువెడుతున్నప్పుడు ప్రక్కన చేరుతారు—తమను కూడా తీసుకు వెడతారేమోననే ఆశతో. ఆఖరిక్షణం వరకు ప్రయత్నం చేయడం మానవ ధర్మం గనుక రైలు కదిలే వరకూ కూడా ఉంటారు. మాస్టరుగారి ఉపన్యాసం రెండు గంటలు విన్న తరువాత ఎంతమంది సమస్యలు తీరిపోతాయో, ఎందరి సందేహాలు పటాపంచలవుతాయో, ఎంతమందికి మనోబలం పుంజుకుంటుందో, ఎందరి జీవితాలకు చక్కని ప్రణాళికలు ఏర్పడతాయో, ఎంతమందికి ఒక గమ్యం అంటూ స్థిరమవుతుందో, ఎంతమందికి కృష్ణుని వేణు గానం వినిపిస్తుందో మనం ఊహించలేము. ఈ సందేహాలు తీరడాన్ని గురించిన ఒక ఉదాహరణ.

## అనటం – వినటం

ఒక శుక్రవారం ప్రార్థన, పూజ అయిన తరువాత, మాస్టరుగారు అందరికీ మందులు ఇస్తున్నారు. పెద్ద ఆఫీసరుగా పని చేసి రిటైరై, యోగాభ్యాసం చేస్తున్న పెద్దవారొకరు మాస్టరు గారిని సమీపించి ఇలా అన్నారు. "నేను నిత్యం ప్రాణాయామం చేస్తున్నాను. ఓంకారం కూడా సాధన చేస్తున్నాను. మా గురువు

గారు కూడా ఓంకారం చేస్తూ ఎందరిచేతనో చేయిస్తున్నారు. ఎందరో ఓంకారాన్ని ఉచ్చరించగా విన్నాను. ఆ వినడం వేరు, మీరు ఉచ్చరిస్తూ ఉండగా వినడం వేరు. ఇందులో ఏదో విశిష్టత ఉంది. నాకు చాలా ఆనందంగా ఉంది''. మాస్టరుగారు ఇలా అన్నారు: "ఓంకారం ఉచ్చారణని నేనూ వింటూఉంటే ఆ ఉచ్చారణ అలా ఉంటూ ఉంది''. "అది కాదండీ! మీరు అలా ఓంకారం అంటూ ఉంటే నేను వింటున్నాను. అది చాలా విశిష్టంగా ఉంది'' అన్నారాయన. మాస్టరుగారు చిరునవ్వుతో, "అవును. నేను వింటూ ఉంటే చాలా విశిష్టంగానే ఉంటుంది''. ఆయనకి అయోమయం అయిపోయింది. మాస్టరుగారి మాటల్లో భావం అతనికి అర్థం కాలేదు. అందుకే మళ్ళీ "మీరు వినటం కాదండీ! మీరు అనటం చాలా బాగుంది'' అన్నారాయన.

మాస్టరుగారు ఇలా వివరించారు. "నేను ఓంకారం ఉచ్చరిస్తూ నేను వింటూ ఉంటే ఎంతో విశిష్టంగా ఉంటుంది. ప్రయత్నించి మనం ఓంకారం ఉచ్చరించడం వేరు. దానంతట అదిగా మనలో నుంచి వస్తూ ఉంటే దానిని మనం వినటం వేరు. అలా వినడం సర్వశక్తి మంతమైనది. మనం మాట్లాడడం వేరు. మనద్వారా మాటలు రావడం వేరు. నేను ఏమైనా మాట్లాడుతుంటే మీరు వింటారు. మీరు ఏమైనా మాట్లాడుతుంటే నేను వింటాను. ఇది సామాన్యమైన పద్ధతి. పురుష ప్రయత్నంతో నిమిత్తం లేకుండా మనలోని దివ్యవాణి పలుకులు అపౌరుషేయంగా వెలువడుతుంటే అది మనం వినటం వేరు''. మాస్టరుగారి ఈ మాటలలోని తీయందనాలను రుచి చూడాలంటే, ముందు చెప్పినట్లు, మాస్టరుగారితో బయటి ఊళ్ళకు వెళ్ళి అక్కడ ఆయన ఉపన్యాసాలు వినే అదృష్టం కలగాలి. లేకపోతే ఏ అభిప్రాయమూ లేకుండా కూర్చుని ఆయన ఉపన్యాసాలు వినాలి.

ఒకసారి మాస్టరుగారితో చేబ్రోలు వెళ్ళాను. అక్కడ రామమందిరంలో రుద్రాభిషేకం చేయించారు మాస్టరుగారు.

భక్తులలో ఒక్కొక్కరు వచ్చి రుద్రునికి అభిషేకం చేసి వెళ్ళి పోతున్నారు. శాస్త్రిగారు, రాముడు మామయ్యగారు, సాంబశివ రావుగారు మొదలైన వారు నమకం చమకం గానం చేస్తున్నారు. మొదట మాస్టరుగారు కూర్చుని నమకం చదువుతూ అభిషేకం ప్రారంభించారు. తరువాత లేచి నిలుచుండి, ఒక గిన్నెలోని అభిషేక జలాలు ఎత్తునుంచి క్రింద ఉన్న శివలింగంపైన పడేటట్లు వదలసాగారు. అప్పుడు ఆ జలధార నాపైకి వస్తున్నట్లు అనిపించింది. కళ్లు మూసుకుని చూస్తూంటే ఆ జలధార నా తలను తాకుతున్నట్లు అనిపించింది. ఆ జలధార తేజోధారయై నా సహస్రారం నుంచి క్రిందికి దిగివచ్చి, వెన్నెముక మధ్యమార్గం ద్వారా క్రిందికి దిగిపోతున్నట్లు అనిపించింది. ఆ తేజోధార క్రిందికి దిగి వచ్చి మూలాధారాన్ని తాకి పైకి ఎగసి, శరీరమంతటా వ్యాపించడం ప్రారంభించింది. ఏదో చిత్రమైన ఆనందానుభూతి. కళ్ళు తెరచి చూశాను. సాంబశివరావుగారు నా ప్రక్కనే కూర్చుని నమకం పారాయణ చేస్తున్నారు. నేను నా అనుభవాన్ని వారికి వివరించాను. ఆయన కూడా వెంటనే ప్రశాంతంగా కనులు మూసుకుని, భక్తితో మాస్టరుగారికి నమస్కారం చేసి కూర్చున్నారు. వారికీ అలాంటి అనుభవమే కలిగింది. ఇటువంటి అనుభవాలు మాస్టరుగారి సన్నిధిలో నాకు చాలాసార్లు కలిగాయి. మాస్టరుగారు ఒక మాట మాట్లాడినా, ఒక చిరునవ్వు నవ్వినా, ఒక చూపుచూసినా, అభిషేకం చేసినా, మరి ఇంకేమి చేసినా ఎవరో ఒకరికి ఆనంద స్పర్శ కలుగుతుంది. ఆయన జీవితం లోకకళ్యాణం కోసమేనని ఎప్పటికప్పుడు స్ఫురిస్తూ ఉంటుంది. ఆయన జీవితంలోని సన్నివేశాలను మళ్ళీమళ్ళీ గుర్తు చేసుకోవడం కన్న కావలసిన దేముంది?



పదవ కిరణము

# రక్షకుడు - శిక్షకుడు

మాస్టరు సి. వి. వి. గారు ఇచ్చిన ఉపదేశాల్లో "Prana Treat, Yoga Teach" అనేది ఒకటి. "ప్రాణానికి చికిత్స చేయి. యోగాన్ని బోధించు" అని! చాలామంది సాధకులు ఈ వాక్యాలను ప్రేయరు సమయంలో మూడుసార్లు ఉచ్చరించి, కనులు మూసుకుని, ఏవో అనుభూతులు కలుగుతాయని వేచి ఉంటారు. కొన్ని సంచలనాలు (Workings), అనుభూతులు కలుగుతూ ఉంటాయి. కాని మాస్టరుగారి యోగ వాక్యాలు అక్కడికే పరిమితమైనవి కావు. శ్రీకృష్ణుని యోగమార్గం, సి. వి. వి. గారి యోగమార్గం రాజయోగ విధానానికి చెందినవి. ఈ మార్గాలలో అనుభూతి అంటే లోపల కలిగే సంచలనాన్ని నిర్వహించడం, ఆ నిర్వహణలో ఏమరుపాటు లేకుండా ఉండడం ముఖ్యం. అంటే ఆ సంచలనాలు మనలో ఏ ప్రయోజనం కోసం వస్తున్నాయో, ఆ మాస్టరుగారి సంకల్పానికి అనుగుణంగా మన జీవితాన్ని నిర్వహించు కోవడం. సామాన్యంగా అందరూ పరిస్థితులు తమను ఎలా ఈడ్చుకుపోతే అలా పరుగులు పెడుతూ, పడుతూ లేస్తూ జీవితాన్ని సాగిస్తుంటారు. అలా కాకుండా పరిస్థితులను, ఆ పరిస్థితుల సమాహార స్వరూపంగా ఉన్న జీవితాన్ని మనం నిర్వహించ గలగాలి. ఆ నిర్వహణకు మాస్టరుగారి సంకల్పాన్ని చుక్కానిగా వినియోగించుకో గలగాలి.

మనకు ఎదురైన సన్నివేశాలను మాస్టరుగారి సంకల్పాలుగా గ్రహించడం, ఆ పరిస్థితులలో మన వంతు సత్కార్మాచరణం మనం చేయడం అవసరం. ఇతరులు ఏం చేశారు, ఏం చేయలేదు అనే విషయాలను మనం పట్టించుకోకుండా ఉండడం మరీ అవసరం. ఆ ధర్మాలు వల్లించడానికి బదులు, ఆచరించి చూపాలి. మన కర్మాచరణలో ఇతరులకు బాధ కలుగకుండా చూసుకోవాలి. ఇతరులకు మన సహాయ సహకారాలు అందించ గలగాలి. వారు మనకి ఏమి సహాయం చేశారు అనే దేవిరింపు మన మనస్సులో నుంచి తప్పుకోవాలి. మనం సహాయం చేయకపోతే మనకన్నా సమర్థవంతంగా సహాయం చేసేవాడు మరొకడు ఉంటాడని గ్రహించాలి. ఈ గ్రహింపు వస్తే, ఈ సహాయం మనం గనుక చేస్తున్నాం—అనే వ్యామోహం అహంకారం తొలగి పోతాయి. ఇవన్నీ సాధకుడు ఎక్కవలసిన మెట్లు. కన్నులు మూసుకుని లోన ఉన్న వెలుగును దర్శించడం అంటే, కన్నులు తెరచి వ్యక్తులలోను, ప్రపంచంలోను ఉన్న వెలుగును దర్శించాలి. అంటే వారి రూపంలో ఉన్న భగవంతుని సేవించ గలగాలి. ఈ సేవించే విధానం ఒక్కటే మార్గం. ఈ ఒక్క మార్గాన్నే ఎందరో అవతార మూర్తులు, ఋషులు, పరమగురువులు ఒక్కొక్కరు ఒక్కొక్క విధానంలో ఉపదేశించారు. వీటిలో సి. వి. వి. గారు బోధించినది "Prana Treat, Yoga Teach" అనేది.

ఈ మహా వాక్యాలలోని దివ్యత్వాన్ని తాను జీర్ణించుకుని, తన సాన్నిధ్యంలో ఆ దివ్య చైతన్యాన్ని మనకి అందించేవారు మన మాస్టరుగారు. ఆయన ఔదార్యం మనశ్శాంతి నిస్తుంది. ఆయన ఉపదేశం బుద్ధి ప్రచోదనం చేస్తుంది. ఆయన అనుగ్రహాశీర్వచనం కర్మ బంధాన్ని ఛేదిస్తుంది. ఆయన స్పర్శ వెన్నెలలాగా చల్లనై, నూతనోత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగిస్తుంది. ఆయన తన మాటల ద్వారా, హెచ్చరికల ద్వారా, చివరికి చీవాట్లద్వారా కూడా

చికిత్స చేస్తుంటారు. శారీరక, మానసిక, బుద్ధి జాడ్యాలలో అన్నిటికీ ఈ చికిత్స జరుగుతూ ఉంటుంది. అది గమనించగలిగిన సమయం రావడమే జీవితంలో ఒక చక్కని మలుపు. అప్పుడప్పుడు మాస్టరుగారు అంటూంటారు. "మీ గురించి మీరు ఏమీ చేసుకోనక్కర లేదు. నేను మీ కోసం చేసేదానికి అడ్డం రాకండి". ఇలాంటి మాటలు చాలా సులువుగా సూటిగా ఉంటాయి కనుక అర్థం కావడమే కష్టం. అర్థమైనా ఆచరించడం మరీ కష్టం. అవి అర్థమై ఆచరించగలిగితే జీవితంలో ఒక పెద్ద మలుపు వచ్చినట్లే.

సాధారణంగా మాస్టరుగారిని బాగా ఎరిగి ఉన్నవారు కూడా గమనించలేని విషయాలు కొన్ని ఉన్నాయి. సామాన్యంగా లోకంలో ఎంత పెద్ద డాక్టరైనా మందు వెయ్యగలడుగాని ప్రాణం పోయలేడు గదా! ఎంత పెద్ద గురువులైనా ఉపదేశాలు చేయగలరు గాని, మందు లివ్వలేరుగదా! మనకు తటస్థపడే వాళ్ళలో కొంతమంది, "ఈ శరీరం తాత్కాలికమే! క్షణభంగురమైన వాటి కోసం బాధపడడం అవివేకం" అనే వేదాంతులు. మరికొంత మంది "తర్వాత, పై లోకంలో అంటూ ఏముంది? ఈ శరీరానికి కావలసినవి సమకూర్చుకోవడమే కావలసింది." అనే నాస్తికులు. అంటే కొందరు ఒక వైపుకు, కొందరు మరో వైపుకు తెగలాగే వాళ్ళేగాని, ఈ రెండిటికీ నడుమ సమన్వయం సాధించి చెప్పేవాళ్ళు, ఈ రెండిటికీ జీవితంలో సమానమైన స్థానం ఉన్నదని చెప్పేవాళ్ళు చాలా తక్కువ. ఈ సర్వ సమన్వయ దృష్టి మాస్టరుగారి వద్ద ఉంది. ఆయన నుంచి ఆయన శిక్షణలో తయారవుతున్న యువకులకూ అలవడింది. ఎవరికి ఏ బాధ కలిగినా, చల్లని ఉపశమన వాక్యాలు చెప్పడం, వారి బాధలకు పరిష్కారం చెప్పడం, అవసరమైన చోట మందు వేయడం, మందుకి అవకాశం లేనిచోట ప్రేయర్ చేసిగాని, బొట్టు పెట్టి గాని, ఆ బాధను నివారణ చేయడం, మాస్టరుగారి శిక్షణలోని చిన్న పిల్లవానికి కూడా సర్వ

సామాన్యమై పోయింది. ఈ చల్లని మార్గం మాస్టరుగారి నుంచే వచ్చింది. మాస్టరుగారికి అంకితం అయిపోయిన జీవితాలు గల శిష్యులకు ఇది అలవాటై పోవడంలో ఆశ్చర్యమేముంది?

" నీకేమి బాధ లేదు "

సోదరుడు Ch. S. N. రాజు P. U. C. చదువుతున్న రోజులు. బోటనీ ప్రాక్టికల్ పరీక్షలకి వెడుతున్నాడు. అదే ఆఖరి ప్రాక్టికల్, రెండు గంటలకి. ఇంకా ఐదు నిముషాలే టైముంది. ఇంతలో అతని ప్రక్కనున్న అబ్బాయికి విపరీతమైన తలపోటు వచ్చింది. అతను నిలబడలేక, రెండు చేతులతోనూ తల పట్టుకుని వరండాలో కూలబడిపోయాడు. తోటి విద్యార్థులు 'అయ్యో!' అన్నారే గాని ఎవరు చేయగలిగింది ఏముంది? ఏమైనా చేద్దామన్నా సమయమేదీ? ఇంతలో బెల్లు కొట్టనే కొట్టేశారు. అందరూ లోపలికి వెళ్ళిపోయారు. ఆ కుర్రవాడెవరో రాజుకి తెలియదు. అయినా వదలి వెళ్ళలేకపోయాడు. మందు తెచ్చి వేద్దామంటే మెడికల్ షాపు ఆ టైములో ఉండదు, పైగా అది చాలా దూరంలో ఉంది. పోనీ మాస్టరుగారి యింటికి వెడదామంటే, ఎక్కడ A. V. N. కాలేజీ, ఎక్కడ చినవాల్తేరు? అతని కేమీ తోచలేదు. ఒక నిశ్చయానికి వచ్చి, ఆ కుర్రవానితో ఇలా అన్నాడు. "చూడు బ్రదర్! కళ్ళుమూసుకో! నీకు తలనొప్పి తగ్గించే బాధ్యత నాది" అతను కళ్ళు మూసుకున్నాడు. వెంటనే రాజు సి. వి. వి. గారిని, మాస్టరుగారిని తలచుకొని అతని నుదుటిపై ప్రేమతో స్పృశించాడు. రెండు నిముషాల్లో తలనొప్పి తగ్గిపోయింది. ఏమిటిది? మాయా? మంత్రమా? అని ఆ కుర్రవాడు ఆశ్చర్యపోతూనే ప్రాక్టికల్‌కి వెళ్ళిపోయాడు. చాలా బాగా చేశాడు. ప్రాక్టికల్ అయిపోగానే లేబరేటరీ నుంచి బయటికి అడుగు

పెట్టాడు — అంతే! తలనొప్పి మళ్ళీ పట్టుకుంది. ఇంతసేపూ నీ కోసమే కాచుకున్నా నన్నట్లు!

రాజు ఇలా అన్నాడు : "ఇంతసేపు నీ తలనొప్పి తగ్గడం, నిజంగా తగ్గడం కాదు. నీ పరీక్షలకి అడ్డం రాకుండా తాత్కాలికంగా తగ్గింది. నీకు నయం చేయమని నేను మా గురువుగారిని ప్రార్థించాను. ఆయన అనుగ్రహం వల్ల ఇంతసేపు తగ్గింది. ఇప్పుడు మళ్ళీ వచ్చిందీ అంటే నీవు ఈ బాధ అనుభవించవలిసే ఉందన్న మాట. అంటే ఎప్పుడో ఎవరికో తలనొప్పి కలిగించే పని చేసి ఉంటావు. ఇప్పుడు. నువ్వు చేయవలసింది ఏమిటంటే, డాక్టరు నద్దకు వెళ్ళి మందు వాడటం." ఈ మాటలు విని ఆ కుర్రవాడు ఎంతో కృతజ్ఞతతో, "నీ దయవలన నా పరీక్ష నిలబడింది" అన్నాడు. "నా దయకాదు. నేను చేయగలిగింది చేశాను. ఎప్పుడో నీవుకూడా ఇలా ఆపదలో ఉన్నవాడికి సహాయం చేసి ఉంటావు. కనుకనే ఇప్పుడు నా ద్వారా సహాయం లభించింది. అయినా ఇందులో ఒకరికొకరు సహాయం చేసేదేముంది – మనం అనుకోవడం తప్ప? ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. ఏ నిముషంలో అయినా, ఎవరికైనా మనవల్ల సహాయం కావాలంటే చేయడానికి సిద్ధంగా ఉండు. సహాయం చెయ్యి. ఇదే నా గురువు నాకు నేర్పింది. నేను నీకు చెబుతున్నదీ యిదే!" అన్నాడు రాజు.

"Prana Treat, Yoga Teach" అంటే ఇది! మాస్టరుగారు అనే మహా సముద్రంలోనుంచి ఒక్క బిందువైనా పూర్తిగా గ్రహించలేని మాబోటివారే ఇలా చేయగలుగుతుంటే ఇక మాస్టరుగారిని గురించి ప్రత్యేకంగా చెప్పేందుకేముంది? సోదర బృందంలోని వారి అనుభవాలను ఉదాహరిస్తే విషయాలు హృదయానికి నాటుతాయి గాని, సాంకేతికంగా వివరించి ప్రయోజనమేముంది?

## రైతురాజు సమర్పణ

విశాఖజిల్లా దొడ్డిగల్లు అనే గ్రామంలో చింతలపాటి వెంకట సూర్యనారాయణరాజుగారు అని ఒక రైతురాజు ఉన్నారు. సంప్రదాయమైన కుటుంబంలో పుట్టారు. దైవచింతన, గురువులను సేవించడం, చేతనైనంతవరకు ఇతరులకి సహాయం చేయడం అనే వాటిని జీవితలక్ష్యాలుగా ఆచరిస్తూ జీవిస్తున్నారు. రాజకీయాలలో కొంత ప్రవేశించినా, తనచేతిలోనిది ఎంతోకొంత రాజకీయాలకు అర్పించిన వారేగాని, అటునుంచి యిటు రాబట్టింది లేదు. దీన్ని బట్టే ఆయన అమాయకులని, మంచి వారని అర్థమవుతుంది. కాలానికి, పరిస్థితులకి తలఒగ్గి, అన్నిటినీ మాస్టరుగారి లీలలుగా సమర్పణ చేసుకోగలిగిన ఆయన పరిస్థితులు తెలిస్తే, మనకెన్నో సమస్యలు, సందేహాలు తీరిపోతాయి.

ఆయన సతీమణి పేరు అమ్మాజీ. ఆమెకు దైవచింతన ఉంది గాని, ప్రార్థన, పూజ మొదలైనవి అలవాటు లేదు. తనకు తోచింది చెప్పడం, చేయడం అనే త్రికరణ శుద్ధి ఆమె కుండేది. ఎవరైనా గురువుగారి మాట చెబితే, "ఏం గురువులో ఏమిటో? వాళ్ళు వచ్చి మనకి అన్నం పెడతారా? మందులు వేస్తారా? మరీ యింత పిచ్చి అయితే ఎలా? భక్తి ఉంటే నమస్కారం చేయవచ్చు. అంతేగాని, ప్రతి చిన్న విషయానికీ ఆయన వద్దకు పరుగెత్తుకుని పోవడం, ఏం చేయమంటారు అని అడగడం, ఆయన చెప్పడం, ఆయన చెప్పకపోతే అంతవరకు కాచుకుని ఉండడం – ఇదో పిచ్చి. నాకేమీ నమ్మకం లేదు." అనేవారు. ఎవరైనా కాస్త తలనొప్పిగా ఉందంటే, "అసలు మనిషికి ఎందుకు జబ్బు వస్తుంది? కడుపు నొప్పులు, తలనొప్పులు ఎందుకు వస్తాయి? తిన్నది అరక్క!" అని తీసి పారేసేవారు. ఆమెకు అసలు అనారోగ్యం అనేదే ఉండేది కాదు. కాని అకస్మాత్తుగా ఆమెకు అనారోగ్యం ఆరంభమయింది.

లేడీడాక్టరుకి చూపించారు. "వెంటనే ఆపరేషను చేయించకపోతే ఈమె బ్రతకదు" అన్నారు. రాజుగారు మాస్టరుగారిని సంప్రదించారు. అప్పటికే, ఇలాంటి కేసులు ఎన్నో ఉన్నాయి. ఆపరేషన్లు చేసిన తర్వాత నయంకాక, ఇకపైన ఇంగ్లీషు వైద్యం లేక మాస్టరుగారి వద్దకు వచ్చిన కేసు లున్నాయి. మాస్టరుగారు "ఇప్పటికే జబ్బు ముదిరింది. మన ప్రయత్నం మనం చేద్దాం. ఈ పరిస్థితుల్లో ఇంగ్లీషు వైద్యంకన్న హోమియోపతీయే మంచిది." అని విషయ మంతా వివరించారు.

అమ్మాజీగారికి ముందు అంత నచ్చలేదు. పిల్లలు ఏమైపోతారు? వాళ్ళకి పెళ్ళిళ్ళు అయ్యేదెలా? కుటుంబం ఏమవుతుంది? ఇలాంటి బాధలే ఆమె కుండేవి. కాని చేసేది లేక ఆమె మాస్టరుగారి వైద్యానికి అంగీకరించారు. విశాఖపట్టణం వచ్చిన వెంటనే మాస్టరుగారు పరీక్షచేసి మందు ఇచ్చారు. ఆ తర్వాత వారం రోజులవరకు ఆయన కనిపించలేదు. ఇంతలో ఆమెలో అనుకోని మార్పులు వచ్చాయి. ఆమెకు కొంచెం నయమయింది. ఆమె తన పిల్లలను పిలిచి "మాస్టరుగారిని చూడాలని ఉంది. ఆయన పూజ చేస్తుంటే కూర్చోవాలని ఉంది. ఆయనకు తీరిక లేకపోతే నేనే వెడతాను" అనేవారు. కాని లేవగలిగే పరిస్థితిలో ఆమె లేరు. అందుకే ఆమెను మాస్టరుగారి వద్దకు తీసుకు వెళ్ళలేదు. మాస్టరుగారు అక్కడ యింటికి వచ్చి కూడా ఆమెను చూడకుండా వెళ్ళిపోయిన రోజులున్నాయి. ఆమె మాత్రం ఆయన స్మరణలో కాలం గడిపేది. ఆయన నిరీక్షణలో కాలం గడిపేది. "అయ్యో! పూజకు వెళ్ళే అవకాశం లేకపోయిందే!" అని పరితపించేది. "మాస్టారూ, మాస్టారూ!" అని కలవరించేది. అప్పుడప్పుడు మాత్రం మాస్టరుగారు వచ్చి చూసి వెడుతుండేవారు. ఆమెకు నయమవుతున్నట్లుగా ఉంది. కాని నయమైనట్లు లేదు.

మాస్టరుగారు విదేశాలకు వెళ్ళే ప్రయాణం దగ్గరపడింది. ఆమెకు కొంచెం నయమయింది. ఇంటికి తీసుకెళ్ళమని చెప్పారు మాస్టరుగారు. మహానుభావుడుగా కాకపోయినా, డాక్టరుగానైనా ఆమె పరిస్థితి ఆయనకు తెలీదా? ఆయన ఆదేశం ప్రకారం రాజుగారు ఆమెని తమ ఊరు తీసుకెళ్లారు. అక్కడకు వెళ్ళిన తర్వాత ఆమెకు బాగా నయమైంది. చాలా రోజులవరకు చాలా బాగున్నారు. ఈలోగా ఆమె ప్రవృత్తిలోను, సంస్కారంలోను వింత వింత మార్పులు వచ్చాయి. అంతవరకు పిల్లలు, కుటుంబం తప్ప ఆమెకు వేరే ప్రపంచం లేదు. రాను రాను ఆమెకు ఆ ధ్యాసే పోయింది. నిరంతరం మాస్టరుగారిని గూర్చిన ధ్యానం, ఆయనను చూడాలన్న తపన. ఇక్కడ మరో విచిత్రం. రాజు, సత్తిబాబు ఆమె కడుపునగన్న పిల్లలు కాదు. కాని తన సొంత పిల్లలకంటే వారిపట్ల ఆమె ప్రత్యేకమైన అభిమానం చూపసాగారు. దీనికి కారణం ఒక్కటే. వారిద్దరూ ఆమె మందుపట్ల చాలా శ్రద్ధ చూపేవారు. అయితే, ఆమె వారిపట్ల చూపే అభిమానానికి కారణం వారు మందు తెచ్చి యిస్తున్నారనేది కాదు. నిజమైన జీవితపు విలువల పట్ల ఆమెలో మేల్కొన్న ప్రజ్ఞకు నిదర్శనం ఆ అభిమానం. "రాజు వస్తే బాగుండును. సత్తిబాబు వస్తే బాగుండును" అని ఆమె అనుకునేవారు. ఇద్దరిలో ఎవరైనా వెడితే, "మీరు ఇక్కడ కూర్చోండి. మాస్టరుగారిని గురించి చెప్పండి. వింటాను. ఇక నాకు మందులు అక్కరలేదు" అనేవారు. ఒకసారి రాజు, "ఆసుపత్రిలో జాయిన్ అవాలని ఉందా?" అని అడిగాడు. ఆమె, "నాకు జాయిన్ అవాలని లేదు. బ్రతికినా, చనిపోయినా నాకు ఒక్కటే. ఏ నిర్ణయం చేసినా, మాస్టరుగారు చేయవలసిందే" అన్నారు. అది మూర్ఖత్వం కాదు. బాగా పండిపోయిన చింతపండు చింతగుల్లనుంచి దానంతట అదే వేరు అయిపోయిన పరిపక్వ వైరాగ్యస్థితి. ఆమె శరీరం వదలే చివరి క్షణాలు దగ్గరకు వచ్చాయి. అందరినీ పిలిపించారు. చూశారు.

తమ అమ్మ గారిని చూడాలనిపించింది. చూశారు. అంతే! ఎవరి తోనూ మాట్లాడలేదు. ఎవరివైపూ చూడలేదు. మనసులోనూ కోరికలు లేవు. ఉన్నట్లుండి రామనామ స్మరణ మొదలుపెట్టారు. "నమస్కారం మాస్టర్ ఇ. కె." అన్నారు. తనను బయటికి తీసుకు వెళ్ళమని చెప్పారు. అటుపైన ఇంకే మాటలూ వినబడలేదు. ఆమెను బయటికి తీసుకువెళ్లారు. ఆమె శరీరం వదలివేశారు. ఆమె కర్తవ్యం ముగిసింది.

## నిశ్చల మూర్తి

అయితే ఇందులో ఇంకా జరిగినది ఎంతో ఉంది. రాజుగారిని ఊళ్లో అందరూ ఎన్నో రకాలుగా నిందించారు. డబ్బుకు లోభించి మందులు ఇప్పించలేదన్నారు. అసలు మొదటినుంచీ ఆమె అంటే ఇష్టం లేదన్నారు. మాస్టరు గారంటే అంత మూఢభక్తి కూడదని, ట్రీట్‌మెంటు మార్చమని ఎంత చెప్పినా వినలేదని ఇలా తలకొక రకంగా ముఖంమీదనే నిందించారు. ఆయన తమ్ములు అయినా సమాధానం చెప్పారుగాని ఆయన మాత్రం నోరు విప్పలేదు. శవం అలా వీధిలో పడి ఉండగా ఇలా అందరూ అన్ని రకాలుగా తిడుతుంటే, బాధపడడం అంటూ ఉంటే ఆయన ఎంత బాధపడి ఉంటారో మనం అర్థం చేసుకోగలం. మాస్టరు గారినీ అన్ని రకాలు గానూ, అన్నారు. "అసలు ఆ గురువు ఒక గురువా? రోగి యిలా ప్రాణాపాయ స్థితిలో ఉంటే పోయి విదేశాలలో తిరుగుతాడా? అతన్ని నమ్ముకున్నారు గదా! ఆ మాత్రం ఆయనకు బుద్ధి ఉండ నక్కరలేదా?" ఇలాంటి వ్యాఖ్యానాలు ఊరంతటా మారు మ్రోగాయి. రాజుగారు మాత్రం మేరుపర్వతంలాగా అచంచల ధైర్యంతో మౌనం వహించారు.

ఈ విషయం తెలుసుకుని రాజు, సత్తిబాబు విశాఖ నుంచి బయలుదేరి వెళ్ళారు. దారిలో అంతా ఆలోచనలే! నాన్నగారెలా

ఉన్నారు? చెల్లెళ్ళు ఎలా ఉన్నారు? ఈ షాక్‌ను వాళ్ళు తట్టుకో గలరా? అందరూ నాన్నగారిది తలలో మాటా అంటుంటే ఆయన ఎలా తట్టుకోగలరు? తలచుకుంటేనే బాధగా ఉంది వారికి. వాళ్ళు ఇంటికి వెళ్ళేసరికి దహన సంస్కారాలు పూర్తయినాయి. రాజు గారు మామూలుగా ఉన్నారు, చెల్లెళ్ళు మామూలుగా ఉన్నారు! వారి ముఖాలలోగాని, మనసుల్లోగాని ఏ బాధా కనిపించలేదు. రాజుకే అద్భుతం అనిపించింది. దానితో బాటు దర్శనమూ కలిగింది. మాస్టరుగారిచ్చిన శిక్షణ, నిజమైన వైరాగ్యస్థితి అతనికి దర్శన మిచ్చాయి. ఇక తాను అక్కడ చేయగలిగింది ఒక్కటే—వారినుండి చేతనైతే ఏమైనా నేర్చుకోవడమే! ఇటువంటి నిశ్చలస్థితి నాన్నగారికి రావడానికి ఎన్ని జన్మలు సాధన కావాలి? కాని ఇంత త్వరలో ఆయన కెలా సిద్ధించింది? కనీసం మాస్టరుగారి పేరయినా తలవని పెద్దమ్మగారు చివరి రోజుల్లో నిరంతరం ఆయన స్మరణలోనే ఎలా కాలం గడిపారు? ఆమెకు ఎంతో బలంగా పెనవేసుకుని ఉన్న బంధుత్వబంధాలు, సంసార బంధాలు ఎలా తెగిపోయాయి? ఆమె మనస్సుకు అంతటి నిశ్చలస్థితి ఎలా లభించింది? అంత చిన్న వయస్సులోనే తల్లి కోల్పోయిన ఆ పిల్లలు గగ్గోలు పెట్టకుండా అంత ధైర్యంగా ఎలా ఉండగలిగారు? ఇన్ని అనుమానాలు ఎలా సహించ గలుగుతున్నారు? అన్నీ ఊహకు అందని సరికొత్త విషయాలు. ఇంతకాలం మాస్టరుగారి ఉపన్యాసాలలో విన్నది, పుస్తకాలలో చదివినది దర్శన మిచ్చింది రాజుకి. ఆ తరువాత మాస్టరుగారు విదేశాలనుండి తిరిగి వచ్చారు. ఆయనతో రాజుకి జరిగిన సంభాషణ వల్ల "Prana Treat, Yoga Teach" అంటే ఏమిటో బాగా అర్థమవుతుంది.

## కర్మవాసనలు

మాస్టరుగారు ఇలా వివరించారు. "మనిషికి చేసిన అనారోగ్యం అతని పూర్వజన్మకర్మ వాసనకు సంబంధించినది. ఆ కర్మ

ఫలితాన్ని రోగం రూపంలో అనుభవించడం కొంతవరకు ఉంటుంది. రోగం అనుభవిస్తున్న స్థితిలో ఇది కష్టంగానే ఉన్నా అనుభవించక తప్పదు. ఆహారాది దోషాల వల్లనో, మరే దోషంవల్లనో ఒక కురుపు వేసినప్పుడు డాక్టర్లు దానికి ఆపరేషను చేస్తారు. చాలా బాధ కలుగుతుంది. కాని కురుపు నయం కావడం కోసమే ఆ బాధ భరించి తీరాలి. ఇలాంటిదే ప్రకృతి కాస్త పెద్ద లెక్కలో చేస్తే దాన్ని రోగం అంటాం. మందులు వేయడంవల్ల జబ్బులు తగ్గడం అన్నది కొంతవరకు మాత్రమే సత్యం. ఇదే పూర్తి సత్యమైతే, మందులు వేస్తే అందరూ ఎందుకు బ్రతకరు? మందులు వేసే డాక్టర్లు, తయారుచేసే సైంటిస్టులే చనిపోతున్నారే?''

ఒకో జన్మలో తీరని జబ్బులుంటాయి. ఒకో జన్మ కేవలం జబ్బురూపంగా కర్మఫలాను బంధం తీర్చుకోవడానికే వస్తుంది. ఆ బంధం తీరిపోగానే ఆ జీవుడు శరీరం వదిలేస్తాడు. ఇక్కడ మరో విచిత్రం ఉంది. ఒక్కొక్కసారి ఆ జన్మకు సంబంధించిన శరీరంలో గల అణువులు అందుకోలేని మానసిక పరిణామం, సంస్కారం ఆ జీవికి కలగడం సంభవిస్తుంది. అంటే భక్తిగాని, సమర్పణగాని, వైరాగ్యంకాని అలాంటి పరిస్థితుల్లో ఉన్న జీవుడు రోగగ్రస్తమైన ఆ శరీరం వదలి మరో శరీరం ధరిస్తాడు. ఈ శరీరం వదలడం-ఇంతకన్న మంచి శరీరం ధరించడానికి మాత్రమే! మృత్యువు, జననం, కర్మసిద్ధాంతం-వీటిని క్షుణ్ణంగా తెలుసుకుంటే, మృత్యువు అనేది ఒక చింకి చొక్కా వదలి మంచి చొక్కా ధరించడంలాంటిదే ననీ, ఇందులో సంతోషించవలసిందే తప్ప, దుఃఖించవలసినది లేదనీ తెలుస్తుంది.

మీ పెద్దమ్మగారి విషయంలోనూ ఇదే జరిగింది. ఆమెకు కావలసిన శిక్షణ జరిగింది. చాలాకాలంగా లోపల ఉన్న రోగ కారణం వలన శరీరం శిథిలమై పోయింది. చాలా తక్కువ కాలంలో

ఆమెకు చాలా చక్కని అనుభూతి స్థితి లభించింది. అందువల్లనే ఆమెలోని జీవుడు శరీరం వదిలాడు. ఆమెకు సేవ చేయడంలో నిమగ్నమై ఉన్న పిల్లలు తల్లి అనే వ్యామోహంనుండీ, మమకారం నుండి విడివడి, ఒక జీవికి ఇంకో జీవి చేసే సేవగా భావించి చేశారు. అది వారికి సి. వి. వి. గారి పట్ల ఉండే విశ్వాసమే! రాజుగారి గురించి ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు".

ఇక్కడ చెప్పవలసింది కొంత ఉంది. మాస్టరుగారు రాజు గారిని మిథిలకు పంపించారు. ఇక ఊళ్లోవాళ్ళ మాటలకి లెక్క లేదు. "కుటుంబ బాధ్యతలు వదలి సన్యాసిలాగా గురువును గుడ్డిగా నమ్మి ఇతను మిథిలకు పోయాడు. ఇక ఇతని సంసారం తగులబడిపోయింది. ఇంకెవ్వరూ ఇతన్ని బాగుచెయ్యలేరు", అని అందరూ ముఖం మీదనే అన్నారు. రాజుగారు అందరికీ ఒక్కటే జవాబు చెప్పారు. "మాస్టరు గారంటే నాకు దైవం. ఆయన చెప్పింది తప్ప ఇంకొకటి చెయ్యలేను. ఇది బానిసత్వం అనుకున్నా, మూర్ఖత్వం అనుకున్నా మరి ఇంకేం అనుకున్నా అది మీకు సంబంధించింది కాదు. నాకు మంచి అనిపించింది నేను చేస్తున్నాను. ఈ విషయంలో మీవద్దకు సలహాకి వచ్చినప్పుడు మీరు తప్పక సలహా యిద్దురుగాని." ఊళ్లో అందరూ ఎంతో ఎదురు తిరిగారు. ఎంతో తూలనాడారు. అన్నిటికీ ఆయన అలాగే నిలబడ్డారు. ఇలాంటి సాధన ఆయనకు ముందునుంచీ జరగబట్టే, భార్య పోయిన క్షణాల్లో అంత నిబ్బరంగా చలించకుండా నిలబడగలిగారు.

ఇప్పుడు మళ్ళీ పై విషయమంతా జాగ్రత్తగా ఆలోచించి చూస్తే "Prana Treat Yoga Teach" అంటే ఏమిటో అర్థ మవుతుంది. గురువు అనే ప్రజ్ఞ మనలో ఎలా పనిచేస్తుందో, అన్ని

జ్వాలల వంటి పరిస్థితుల మధ్య నుంచి మనలను నడిపించి, శాశ్వతమైన సత్యంలోనికి, ధర్మంలోనికి ఎలా తీసుకువెళుతుందో, నిజమైన ఉపదేశం ఎలా జరుగుతుందో అనే విషయాలు ఎవరికి వారికే స్ఫురించాలి. ఎవరికి వారే తరచి తరచి చూసుకుంటే స్ఫురిస్తేనే ఎక్కువ ఉపయోగముంటుందనే ఇంకా ఎక్కువగా వివరించడం లేదు.



పదకొండవ కిరణము

# మాష్టరుగారి ప్రసంగాలు

ఉదయాన్నే లేచి చేసే సంధ్యావందనాన్ని గురించి మాష్టరు గారు ఒకసారి ఇలా చెప్పారు :

"ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ వామన స్తుతి పరత్వమున లేచి" అని పెద్దనగారు మనుచరిత్రలో వర్ణించారు. ఉదయానే నిద్ర నుంచి లేచినపుడు వామనమూర్తిని స్తుతించడం అనేది మనకు సంప్రదాయం. నిద్రనుంచి మరల మేల్కొన్న వెంటనే క్రమ క్రమంగా మన జ్ఞానం పనిచేయడం ప్రారంభిస్తుంది. ఆ ప్రజ్ఞ ఆరంభస్థితిలో చాలా చిన్నదిగా ఉంటుంది. తర్వాత క్రమంగా వికాసం చెందుతుంది. వామనావతారం ఈ ప్రజ్ఞ యొక్క వికాస విశేషాన్ని స్ఫురింపజేస్తుంది. వామనమూర్తి మొదట చాలా పొట్టివాడుగా ఉండి, క్రమంగా త్రివిక్రముడవుతాడు గదా! ఈ ఉద్దేశ్యంతోనే మొదట నిద్రనుంచి మేల్కొనగానే పెద్దలు వామన స్తవాన్ని పఠిస్తూ, ఆ మూర్తిని స్మరణకు తెచ్చుకుంటారు.

భాగవతం అష్టమస్కంధంలో బ్రహ్మదేవుడు వామన మూర్తిని స్తుతించాడు.

1. జయోరుగాయాయ భగవన్నురుక్రమ నమోస్తుతే
నమో బ్రహ్మణ్యదేవాయ త్రిగుణాయ నమోనమః

2. నమస్తే పృశ్నిగర్భాయ వేదగర్భాయ వేధసే
త్రినాభాయ త్రిపుష్టాయ శిపివిష్టాయ విష్ణవే.

3. త్వమాది రంతో భువనస్య మధ్య
మనంత శక్తిం పురుషం యమాహుః
కాలో భవనాక్షిపతీశ విశ్వం
స్రోతో యథాంతః పతితం గభీరమ్ ॥

4. త్వంవై ప్రజానాం స్థిరజంగమానాం
ప్రజాపతీనా మసి సన్నివిష్టః ।
దివౌకసాం దేవ దివశ్యుతానాం
పరాయణం నౌరివ మజ్జతోఽప్సు ॥

ఈ శ్లోకాల భావాలను హృదయస్థం చేసుకుని స్మరించాలి. తర్వాత ముఖం కడుగుకుని స్నానం చేయాలి. స్నానం చేసేటప్పుడు "ఆపోహిష్ఠామ" అని మొదలయ్యే మంత్రం పఠించాలి. ఈ మంత్ర పఠనం వల్ల పవిత్రమైన నీరు శరీరం పై భాగాన్ని శుభ్రపరుస్తుంది. ఈ శుచితో బాటు అంతశ్శుచి కూడా పొందాలి. మంత్రశక్తి మన శరీరం లోపల ఉన్న మాలిన్యాలను కూడా కడిగివేయాలనే భావంతో స్మరించాలి. మంత్రశక్తి అంటే మంత్రాన్ని, మంత్రార్థాన్ని, అధిదేవతను ధ్యానించడం వలన కలుగుతుంది గాని, కేవలం మంత్రాక్షరాలు పఠించడం వలన కలిగేది కాదు.

ధ్యానానికి కూర్చునే ముందు ఏదైనా అల్పాహారం తీసుకోవాలి. లేకపోతే పూజ మధ్యలోనో, ధ్యానం మధ్యలోనో ఆకలి వేసే అవకాశం ఉంది. మనస్సు అంతా ఆకలి వైపుకే ఆకర్షించబడుతుంది గాని, భగవంతుని వైపుకు సాగదు. కనుకనే మన పెద్దలు 'ఆచమనం' అనే పద్ధతి పెట్టారు. "ఓం కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా" అని మూడుసార్లు

పంచామృతాన్ని గాని, మరి ఇంకేదైనా మంచి రసాయనాన్ని గాని తీసుకోవాలి. ఆవుపాలు, పెరుగు, నేయి, తేనె, చక్కెర కలిపిన రసాయనం స్వీకరిస్తే మంచి ఉత్సాహం, తృప్తి ఏర్పడతాయి. ధ్యానానికి ఏకాగ్రత తేలికగా లభిస్తుంది. ముఖ ప్రక్షాళన అయినల్లే, ఉదరకోశ శోధనం, క్షాళనం జరుగుతాయి. క్రిందటి రాత్రి తిన్న ఆహారంలో జీర్ణం కాక మిగిలిన పదార్థాలు ఈ ద్రవం వలన క్రిందికి కొట్టుకుపోతాయి. కనుక తప్పకుండా కొద్దిపాటి ఆహారం తీసుకున్న తర్వాతనే ధ్యానం ప్రారంభించాలి.

## నిర్వీర్య వేదాంతం

రామాలయంలో తైత్తిరీయోపనిషత్తు పై మాస్టరుగారి ప్రసంగం :

వేదాన్ని గాని, ఉపనిషత్తుల్ని గాని సరిగా అర్థం చేసుకోవాలంటే మనం ఏర్పరుచుకున్న కొన్ని దురభిప్రాయాలు తొలగించుకోవడం అత్యవసరం. మన దేశంలో ముఖ్యంగా ఇటీవలి కాలంలో శుష్క వేదాంతులు బయలుదేరారు. వేదాన్ని దర్శనం చేయకుండా, వేదమార్గాన జీవించకుండా వేదాన్ని వేదాంతాన్ని చదువుకుని, తమకు సదుపాయమైన వేదాంతం చెప్పేవారు ఈ వేదాంతులు. వీరి మాటలు వినడం వల్లనే భారతదేశం కార్య శూరత్వం లేక నిర్వీర్యమైపోయింది. అనుస్యూతంగా వినవస్తున్న కొన్ని అభిప్రాయాలు మనని పతనం చేస్తాయి. అలాంటి వాటిని కొన్నింటిని తొలగించుకోవాలి.

"ఈ శరీరం శాశ్వతం కాదు. ఇది పాపకూపం. చీమూ, నెత్తురూ నిండినది. ఇందులోనుంచి ఎంత త్వరగా బయటపడితే అంత త్వరగా ముక్తి లభిస్తుంది. ఇంద్రియాలు మనను పతనం చేస్తాయి. వీటిని నమ్ముకున్నవాడు ఏ నాటికీ ముక్తి పొందలేడు." ఇలా సాగే వేదాంతుల బోధలు, కడుపునిండా అన్నం తిని వచ్చి గోడకి ఆనుకుని కునికిపాట్లు పడుతూ వినే ముసలివాళ్ళు బాగున్నా

యంటారు. ఇవి వినగానే చాలా సత్యం అనిపిస్తాయి. కాని ఇవి చెప్పిన స్వామీజీనే ఒక్క మాట అడగండి.

"స్వామీ! శరీరం మురికి కూపం, పాపకూపం కదా! అందులోంచి బయటపడడమే ముక్తి అన్నారుగదా! ఇదిగో పదునైన కత్తి. ఒక్కపోటు పొడుచుకుని ఈ శరీరంలో నించి బయటపడి ముక్తి పొందండి. పోనీ, ఇంద్రియాలు బంధనాలు గదా! ఈ రోజు నుంచి ఆహారం తీసుకోవడం మానేయండి." అని అడగండి. తాను చెప్పిన వేదాంతం నిజమే అయితే వెంటనే అలా చెయ్యాలిగదా! కానీ చెయ్యడు. తాను చెబుతున్నది ఎంతవరకు సత్యమో తనకు తెలుసు. ఇలాంటి స్వాములు ఒకరికి చెప్పగలిగేది ఏమిటి? విన్నవారు తరించేదేమిటి? కాని అమాయికులైన జనులు వీరి బూటకపు వేషభాషలకీ, పాండిత్యభ్రాంతికి మోసపోయి నమ్ముతూ ఉంటారు.

ఇలాంటిదే మరొకటి. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని సూత్రం. ఈ సృష్టి అంతా బ్రహ్మమేనని. "అహం బ్రహ్మాస్మి" అలాంటి దివ్యచైతన్య స్వరూపమైన బ్రహ్మము నేనే అని అర్థం. పూజ చేసుకునే సమయంలో మొదట, ఈ బ్రహ్మమును మనలోనికి ఆవాహన చేసుకుంటున్నాము. పూజ అయిపోయిన తర్వాత ఈశ్లోకం ఒకటి చదవాలని పెద్ద మనుష్యులు కొందరు అలవాటు చేశారు. "పాపోఽహం, పాపకర్మాహం, పాపాత్మా పాపసంభవః" అహం బ్రహ్మాస్మి అనుకునే నోటితో, మనస్సుతో పాపోఽహం అంటున్నాము. పోనీ ఈ పూజ చేస్తున్న పెద్దమనిషి ఎంతటి పాపాలు చేశాడో తనమట్టుకు తనకు తెలుసు గనుక 'పాపకర్మాహం' అన్నాడని సరిపెట్టుకుందాం. కాని 'పాపాత్మా' అంటున్నాడే పుణ్యాత్ముడు! అంటే పాపాలు చేసే తన మనస్సేకాక, తనలో ఆత్ముడుగా ఉంటున్న శివుణ్ణి పాపి అంటున్నాడు. పైగా 'పాపసంభవః' అంటున్నాడు. తానేగాక తనను కన్న తల్లిదండ్రులుకూడా పాపాత్ములై

పోతున్నారు - ఈయన నోటివెంట. అందరం బ్రహ్మంలో నుంచి పుట్టామని వేదాలు ఘోష పెడుతుంటే, ఈ మహానుభావుడు పాపంలోనుంచి పుట్టామని సెలవిస్తున్నారు. కనుక బ్రహ్మంగారు పాపస్వరూపులు కావాలి. 'శివోఽహం' అంటూ పూజ మొదలెట్టినవాడు 'పాపోఽహం' అంటున్నాడు. లోపల ఉన్న శివుడికెలాంటి కోపం రావాలి? కాని రాదు. శివుడు తన బిడ్డల అజ్ఞానానికి నవ్వుకుంటున్నాడు. ఇలాంటి మహాజ్ఞానులైన పెద్దల సంప్రదాయం ఉండబట్టే మన జాతి ఇలా తయారైంది. ఇటువంటి దొంగస్వాములు ఉండబట్టే నాస్తికులు తయారైనారు. అందుకే వేదాన్ని ఆశ్రయించాలి. వేదం శాశ్వతమైన ధర్మానికి సంబంధించింది. ఆచరణకు సంబంధించింది. సత్యానికి సంబంధించింది. వేదంలో ఈ శరీరానికి చాలా పవిత్రమైన స్థానం ఉంది.

ఈ శరీరం, మనస్సు, ఇంద్రియాలు, బుద్ధి, చిత్తం, అహంకారం ఇవేవీ 'నేను' కాదు. కాని ఇవన్నీ నాయందే ఉన్నాయి. ఏ ఒక్క మంచుగడ్డా నీరు కాదు. కాని అన్ని మంచుగడ్డలూ ఒకే నీటితో తయారైనాయి. పదిచెంబుల్లో చెరువునీరు ముంచితే, ఏ చెంబులోని నీరూ చెరువుకాదు. కాని అన్ని చెంబుల్లోనూ చెరువులో నీరే ఉంది. అలాగే నేను అనే ప్రజ్ఞయందు శరీరం, ఇంద్రియాలు, మనస్సు మొదలైనవన్నీ ఉంటాయి. అన్నీ 'నేను' అనే ప్రజ్ఞతో చేయబడినవే. అఖండమైన నేను అనే ప్రజ్ఞయందు ఇవన్నీ ఖండప్రజ్ఞలు. అఖండప్రజ్ఞనుంచి ఇవి పుడుతూ అంతరిస్తూ ఉంటాయి. కాబట్టి ఇవి తాత్కాలికం. శరీరమే నేను అనుకునే వాడికి మృత్యువు ఉంటుంది. మనస్సు నేను అనుకునేవాడు తన కోరికలు, మొదలైనవే తాను అనుకుని సుఖదుఃఖాలలో ఊగిసలాడుతాడు. బుద్ధియే నేను అనుకునేవాడు తన అభిప్రాయాలు, ఆదర్శాలే తాను అనుకుని, విలువైనవాటిని పోగొట్టుకుంటూ తనను తానే బంధించుకుంటాడు. ఈ అన్నింటిలో కాక 'నేను'

వేరే ఉన్నాననుకొని తాపత్రయపడేవాడు మోక్షం అనే ఒక కోర్కెల సాలెగూడు కట్టుకుని, అందులోనే చిక్కుకొంటాడు. ఈ అన్నింటియందూ ఉన్న ప్రజ్ఞ 'నేను' అని గుర్తిస్తున్నవాడు జనన మరణాలకి, సుఖదుఃఖాలకి అతీతుడై శాశ్వతానంద స్థితిలో ఉంటాడు. ఒకే దారానికి గుచ్చిన మణులలాగా అతనికి జన్మలుంటాయి. అలాంటివాడికి శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం మొదలైనవన్నీ పవిత్ర సాధనాలై ఉపకరిస్తాయి. వాడు లోకకళ్యాణార్థం, యజ్ఞార్థం జీవిస్తాడు. "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనమ్" అనే పవిత్ర వాక్కులోని వేదార్థాన్ని గ్రహించాలి. శరీరాలే దుఃఖ కారణాలైతే, మనం ఆరాధిస్తున్న రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు మొదలైన వారు అందరూ శరీర ధారులే గదా! వేద మంత్రాలను దర్శించి మనకి అందించిన వారు శరీరధారులైన ఋషులే గదా! భగవంతుని లీలా విహార స్థలమైన సృష్టి చూడాలన్నా, రుచికరమైన ఆహారాన్ని తీసుకుని లోన ఉన్న వైశ్వానరుడనే అగ్ని దేవుని అర్చించాలన్నా ఇంద్రియాలే ఆధారం కదా! భగవంతుని గురించిన మధుర భావనలు మనయందుండాలంటే మనస్సు ఉండాలి గదా! ఈ సృష్టి అంతా భగవంతుని లీలా విభూతి అని గుర్తిస్తే, ఇందులో పాప భూయిష్ఠమైనవి, పనికిరానివి అంటూ ఉండవు. మనం ఉపయోగించుకునే దాన్ని బట్టి ఉంటుంది.

## ఏకాంతం - రహస్యం

రహస్యం ఏకాంతం అనే పదాలకి కూడా సాధ్యమైనంత చెడ్డ అర్థాన్ని కల్పించారు మన పెద్దలు. మనలో ఉన్న ప్రజ్ఞ గుప్తంగా ఉంది. దీన్నే గుహ్యం, గూఢం, గోప్యం, రహస్యం అన్నారు వేదద్రష్టలు. అయితే మన మనస్సు అనే ప్రజ్ఞకి గుప్తం గాని, దానికది గుప్తం కాదు. మన లోన, బయట, అంతటా నిండి

ఉన్నది పరబ్రహ్మమే. పరబ్రహ్మంలోనే మనం నివసిస్తున్నాము, చరిస్తున్నాము. ఆ ప్రజ్ఞ అఖండమైనది. దానియందు మన పరిమిత ప్రజ్ఞ మేల్కాంచలేదు గనుక అది గుప్తంగా, గుహ్యంగా ఉంది. ఈ విద్య గుహ్య విద్య అంటే ఎవరికీ చెప్పకూడదని అర్థం కాదు. ఇది ఎవరికి వారుగా సాధించుకోవలసినదే గాని, ఒకరు సాధించి పెట్టేది కాదు. ఎవరికి వారు దర్శించవలసిందేగాని ఒకరికి ఒకరు చెప్పేది కాదు అని అర్థం.

"ఏకాంతంలో ఉపదేశం చేయాలి. ఏకాంతంలో ధ్యానం చేయాలి" అంటే, "ఎవ్వరూ వినరాదు. ఎవ్వరూ చూడరాదు, ఉండరాదు" అని భావం కాదు. ఏకాంతం అంటే మరి ఏ ఇతర భావాలకూ చోటు లేని ఏకాగ్రత అని అర్థం. నేను ఒక విషయాన్ని గురించి చెబుతుంటే, మీరు అందరూ మీ అస్తిత్వాన్ని మరచి పోయి నన్ను, నామాటలని వింటున్నారు. అది ఏకాగ్రత. అలాగే ఆత్మ అనే వెలుగు బుద్ధి, మనస్సు, ఇంద్రియాలు అనే వేర్వేరు శాఖలుగా చెదరి పోయినప్పుడు ఏకాంతం సిద్ధించదు. మనస్సు, బుద్ధి మొదలైనవన్నీ 'నా' యందు వెలుగుతూ ఉంటే, 'నేను' అనే ప్రజ్ఞ ఒక్కటే వాని ద్వారా వెలుగుతూ ఉంటుంది. ఈ స్థితిని మనయందు మనం ఉండటం, అలాగే అందరిలోను గల 'నేను' అను ప్రజ్ఞలో మనం జీవించడాన్ని ఏకాంతస్థితి అంటారు. ఇది ఒక్కటే సత్యం. అయినా ఇది మనకు దర్శనం కానంత వరకూ అతి రహస్యం. దర్శించిన తర్వాత అంతా బట్టబయలు. మనం దర్శించినా, దర్శించని వాడికి అది రహస్యమే! అంటే ఇది ఎవడికి వాడు బట్టబయలు చేసుకోవలసిందే. అంతేకాని, తలుపులు మూసుకున్నంత మాత్రాన తలపులు మాయమై ఏకాంత స్థితి లభించదు. తలపులు మాయం కావాలని ఎంత ప్రయత్నం చేసినా ప్రయో

జనం లేదు. తలపులు భగవంతుని పైకి మరల్చడం ఒక్కటే మార్గం. అప్పుడే ఏకాంతం సిద్ధిస్తుంది.

ఇలాగే గుప్తం అనే మాట కూడా. గుప్తం అంటే దాచుకోవలసింది అని అర్థం కాదు. దాచుకునే అవసరం మానవునికి మొదట ఎప్పుడు కలిగింది? ఒక వస్తువు చాలా విలువైనది అయినప్పుడు దాన్ని భద్రంగా దాచుకోవడం అవసరం. అదే కొంత కాలం తర్వాత మానవునిలో స్వార్థం పెరిగిన తర్వాత, ఇతరులకి అందకుండా దాచుకోవడం అనే అర్థం వచ్చింది. అసలు గుప్తం అంటే భద్రంగా ఉన్నది అని అర్థం. బ్రహ్మవిద్యకు గుప్తవిద్య అనే పేరు ఉంది. అంటే గ్రహించిన తర్వాత మళ్ళీ జారిపోకుండా జాగ్రత్తపడవలసిన విద్య. మళ్ళీ మళ్ళీ జాగ్రత్తగా గ్రహించి మనస్సులో భావన చేయవలసింది.

బ్రహ్మవిద్య ప్రారంభం కావాలంటే ఇలాంటి పొరలెన్నో తెగవలసినవి ఉన్నాయి. ఒక్కొక్క పొరనే త్రెంచడానికి ప్రయత్నం చేస్తూ ఉంటే జన్మలు జన్మలే వ్యయమైపోతాయి. దీనికి రాజయోగ విధానం ఒకటే మార్గం. సర్వ జీవరాసుల యెడల, సర్వ కాలాలలోనూ 'నేను' అనే భావం కలిగి జీవించడం.

## వేణుగానం

మాస్టరుగారు యారాడపార్కులో చేసిన భాగవతం ఉపన్యాసం :-

పాండవ పౌత్రుండు ముకుంద చరణారవింద వందనానంద కందాయ మానసుండయి...... అని పోతనగారు వర్ణించారు. ముకుంద చరణాలయెడ చిత్తం నిలిచే స్థితి పరీక్షిత్తు సాధించుకొన్నాడు. రాజ్యం, భార్య, పిల్లలు, బంధువులు అన్నింటిని పరిత్యజించి పరీక్షిత్తు తన చిట్టచివరి రోజులలో భాగవతమయంగా తన జీవితాన్ని చేసికొని, 'చనిపోయెను' అనే స్థితిని దాటి, శరీరాన్ని

పరిత్యజించాడు అనే స్థితికి చేరాడు. తాత్కాలికములయిన సంపదలు, బంధుత్వాల యెడల అమనస్కుడై శాశ్వతమయిన ఆత్మ ప్రపంచమునందు సర్వాంతర్యామి అయిన వాసుదేవుని నిలుపుకొని, నారాయణ స్మరణతో శరీరాన్ని విడిచిన మహాత్ముడు ఆయన. వయస్సు పెరుగుతున్నకొద్దీ, మానవుడు కొన్నికొన్నింటిపై కోరికలని త్యజిస్తుంటాడు. చిన్న పిల్లలుగా ఉన్నప్పుడు బంతి కోసమో, ఘూవుకోసమో తగవులాడుకోవడం సహజం. కాని పెద్దయిన తరువాత అలాంటి తగవులాటలకు మనస్సు ఇష్టపడదు. అలాగే హృదయం వికాసం చెందుతున్న కొద్దీ, మానవుడు తాత్కాలికమయిన సంపదల యెడ బంధాలను సడలించుకుని, దివ్యమయినది, ఆనందమయమయినది అయిన ప్రపంచంలోనికి అడుగు పెడుతుంటాడు. ఒక వస్తువుపై మోజు తగ్గాలంటే అంతకంటె విలువయినది, అందమయినది, మరొక వస్తువును చూపించటం చేయాలి. చిల్లర వస్తువులపై రుచి చిన్నపిల్లలకు మార్చాలంటే అంతకంటె ఆరోగ్యమయినది, రుచి అయినది అయిన మంచివస్తువు చూపించాలి. ఇది రాజయోగ మార్గం. పరీక్షిత్తు శుకయోగిని ఆశ్రయించి ఆయన వాక్కులద్వారా భాగవతం ఉపదేశం పొందిన వాడు. కృష్ణుని దివ్యలీలలు వింటూ, ఆ ఆనందంలో మునిగినవాడు ఆ రుచి మరగినవాడు. అందులకు ఆయన చిత్తం ముకుంద చరణార విందమందు లగ్నమయింది. భాగవతము యొక్క పరమోద్దేశం అదే! సమస్త ధర్మాలు, శాస్త్ర రహస్యాలతో వ్యాసుడు అష్టాదశ పురాణాలు, భారతం వ్రాసినా తృప్తి చెందలేదు. తెలియని దిగులు అతనిని ఆవహించగా భాగవతాన్ని రచించమని నారదుడు ఉపదేశిం చాడు. శాస్త్ర చర్చలు, ధర్మాధర్మ నిర్ణయాలు మానవుని ఉద్ధ రించలేవు. చక్కెర తీయగా ఉంటుందా, పుల్లగా ఉంటుందా అన్న వాదన వలన ప్రయోజనం లేదు. చక్కెర రుచి చూపించాలి. అలాంటి రుచి చూపించినదే భాగవతం. ఎవని హృదయం కృష్ణుని

పాదాలచెంత సమర్పణ చెందుతుందో, ఎవని మనస్సు ఆయన మధుర భావనలతో నిండుతుందో, ఎవని చేతులు ఆయనను అర్చిస్తాయో, ఎవని కనులు ఆయన దివ్య మంగళ స్వరూపాన్ని తిలకించి ఆర్ద్రము లవుతాయో, ఎవని చెవులు ఆయన కథలను, కళ్యాణగుణాలను విని పులకిస్తాయో, ఎవని మేను ఆయన స్మరణ మాత్రాన పులకిస్తుందో ఎవని పాదాలు ఆయనను చేరటానికి ఆరాటపడుతాయో, ఎవని శ్వాస ఆయన వేణువునందు పూరించబడటానికి ఉత్సాహపడు తుందో, ఎవని వాక్కులు ఆయన నామాన్ని ఉచ్చరించటానికి సంతసపడుతాయో అట్టివాడు పరమ ప్రేమ స్వరూపుడు. అట్టివాడు భగవంతునియందు జీవించువాడు. అట్టివాడు భాగవత స్వరూపుడు. అట్టివాడు మన కందరకు పూజనీయుడు. దీనిని మించిన సాధన లేదు. యోగసాధన పేర గ్రంథాలు చదవడం, ఏవేవో అభ్యాసాలు చేయడం, యోగసాధన చాల కష్టమని గొప్పలు చెప్పుకొనటం, యోగం పేర మన సాటివారినుండి వేరవడం, యోగం పేర ఇతరుల కంటె మన మధికులమని అహంకరించటం, యోగం పేర మనం భగవంతుని పక్షమని మూర్ఖంగా తలచడం పతనానికి కారణమవు తాయి. యోగమంటే ఆనందించటం. ఆ ఆనందము ఒక్క భగవంతునియందు మనస్సు నిలపడంలోనే సాధ్యమవుతుంది. దానికి ఏమి చేయాలి? ఎంత కాలం పడుతుంది ? ఆ ఆనంద స్థితి పొందాలని త్రికరణశుద్ధిగా నీవు విశ్వసించినంతవరకు. దీనికి పూర్వ జన్మ వాసనలు, కర్మ బంధం తీరనవసరం లేదా? అలాటి అనుమానం, సంశయం నీ మనస్సున ఇంకా ఉంది గనుక తప్పక నీకు మరికొన్ని వందల జన్మలు పడతాయి.

సి. వి. వి. గారు బోధించిన యోగమార్గ మిది. కృష్ణుడు బోధించిన యోగమార్గ మిది. నారదుడు బోధించిన యోగమార్గ మిది. జయదేవుడు, త్యాగరాజు మొదలైనవారు నాద బ్రహ్మో పాసన ద్వారా తరించవచ్చునని ఒక మార్గం చెప్పారు. అది సంగీత

మార్గం. సంగీతం, చిత్రలేఖనం, నాటకం మొదలైన కళల ద్వారా భగవంతునిలో లీనంకాగల ఉపాసనా మార్గాన్ని వారు అనుసరించారు. ప్రకృతిలోని సౌందర్యాన్ని ప్రతిబింబించే చిత్రలేఖనంపై మనస్సు లగ్నంకావడమంటే, ఆ సృష్టిచేసిన భగవంతునియందు లగ్నం కావడమే. పాట పాడేవాడు, వినేవాడు, పాట అనే మూడూ ఒకే స్థితిలో ఉండడం అనుభూతి. కర్త, కర్మ, క్రియల త్రిభుజమే ఈ సృష్టి. జీవితం ఒక త్రిభుజం. దీన్ని ఛేదించి, మధ్యలో ఉన్న కేంద్రం వద్దకు చేరడం అంటే, భూత భవిష్యత్ వర్తమానాలు, సత్వ రజ స్తమస్సులు, జాగ్రత్, స్వప్న, సుషుప్తులు అనే స్థితులు దాటి, 'నేను' అనే ప్రజ్ఞలోనికి ప్రవేశించడం. మనం సంగీతం వినడం ప్రారంభించినపుడు, గాయకుడిని, పరిసరాలను, చివరికి మన అస్తిత్వాన్ని మరచి పాటలోనికి కరగిపోతాము. ఇలాంటి దివ్యానుభూతి ఒక్క సంగీతంలోనే కలుగుతుంది. అందుకే ద్వాపరయుగంలో కృష్ణుడు వేణువును చేపట్టి, వేణుగానంతో లోకాలను పులకింపజేశాడు. తరింపజేశాడు. తనలో కరిగించుకున్నాడు. మనస్సు అనే గోపికలు కృష్ణుడనే భగవంతుని ప్రజ్ఞలో కరిగిపోవడం ఈ వేణుగానం వల్లనే. అనన్యం అనే స్థితిని చేరడానికి కృష్ణుడు తన యోగమార్గంగా వేణుగానాన్నే ప్రసాదించాడు. ఈ మార్గంలో మనం చేసేది ఆత్మ సమర్పణ ఒక్కటే. ఇంకేమీ చేయనక్కరలేదు. మిగిలిన యోగ మార్గాలు అన్నిటిలోనూ చేయవలసిన సాధన ఎంతో కొంత ఉంటుంది. ఈ మార్గంలో సమర్పణ తప్ప మరేమీ చేయవలసినది లేదు. ఈ సమర్పణ కుదిరే లోపున సంకీర్తనలు చేయడం, ప్రాణాయామం చేయడం, ఆసనాలు వేయడం, గ్రంథాలు దర్శించడం, చివరికి వేదాలు దర్శనం చేయడం మొదలైనవి ఉంటాయి. ఆత్మ సమర్పణ అంటే జీవుడు దేవుడు కావడం, శిష్యుడు గురువు కావడం, ఇనుపముక్క అయస్కాంతం కావడం!"

మాస్టరుగారు ఈ విషయాలు చెబుతుంటే నాలో ఇలా అనిపించింది. చాలామంది మాస్టరుగారి వద్దకు వచ్చి వారి సమస్యలు చెబుతూ ఉంటారు. మాస్టరుగారు అన్నీ విని, "నాతో చెప్పారు గదా! ఇక మీకేమీ ఫరవాలేదు. వెళ్ళండి" అంటారు. ఈ మాటలకి అంత అర్థం కనిపించదు. కాని ఆ మాటలపై విశ్వాసము ఉంచిన వారికి సరియైన రీతిలో సమస్యలు పరిష్కారం కావడం జరుగుతుంది. పరిష్కారం కాని సమస్యలే ఉండవు. దీనికి తార్కికంగా కారణాలు వెదకబోతే దొరకవు. అనుభవిస్తే మాత్రమే తెలుస్తాయి. కొందరు "నా మనస్సు బాగుండలేదు మాస్టరుగారూ!" అంటారు. కొందరు "నేను క్రమబద్ధంగా ప్రేయరు చేయలేకపోతున్నాను." అంటారు. మరికొందరు, "నేను మీ కార్యక్రమాలలో పాల్గొనలేక పోతున్నాను." అనీ, మరికొందరు, "నేను చాలా పాపాత్ముడను మాస్టరుగారూ!" అనీ ఇలా తలొక రకంగా చెబుతుంటారు. అన్నింటికీ మాస్టరుగారు నవ్వి, "నేనున్నాను గదా! అన్నీ నాకు వదలిపెట్టండి" అంటారు. అలా అనేటప్పుడు మనం ఆయనవంక మామూలుగా చూస్తే, ఆయన మామూలుగా నవ్వుతూనే కనిపిస్తారు. అంతేకాని, "సర్వధర్మాన్ పరిత్యజ్య" అన్న కృష్ణుడుగాని, "I am the Path" అన్న క్రీస్తుగానీ, "బుద్ధం శరణం గచ్ఛామి" అన్న బుద్ధుడుగానీ కనిపించరు. ఆయనలో వాళ్ళు కనిపించిననాడు, ఆయన మాటల వెనుక కృష్ణుని గీతను, వేణుగానాన్ని వినగలిగిననాడు తప్ప, మరెన్ని చేసినా విముక్తి లేదు. నిజంగా మాస్టరుగారిని అనుసరించడం అంటే తాను మాస్టరుగారు కావడమే. ఇది ఒక్క సమర్పణవల్లనే సాధ్యమవుతుంది. సమర్పణ అంటే మన ప్రత్యేకమైన అస్తిత్వం ఆయనలో కరగిపోవడం. మనం ఇంద్రియాలుగానో, మనస్సుగానో, బుద్ధిగానో జీవించడం కాక, ఆయనగా జీవించడం. ఆయనగా జీవించడం అంటే ప్రేమ అయి వెలగడం. ప్రేమ అనేది వ్యక్తులకి, పరిసరాలకి, పరి

స్థితులకి, అభిప్రాయాలకి, ఆదర్శాలకి అతీతమైనది. ఎవరినుండి దేనినీ ఆశించకుండా సేవచేయడం, ఆ చేసేటప్పుడు చేస్తున్నామని గుర్తు ఉండక పోవడం, సేవ చేయడంవలన పుణ్యం వస్తుందనే దురాశను వదలిపెట్టడం – ఇదీ ప్రేమకు తార్కాణం. సూర్యుడు ఉదయించడం మేఘాలు వర్షించడం అంటే ఏమిటో ఊహించగలిగితే, అదే నిజమైన ప్రేమ.

## ప్రా ర్థ నా ప్ర సం గం

1977 వ సంవత్సరం జనవరి 26వ తేదీ ఉదయం. సన్న సన్నని వెలుగు ఎక్కడినుంచో, "పీతాభాస్వ త్యణూపమా" అన్నట్లు వ్యాపిస్తోంది. అది కాంతీ కాదు, రంగూ కాదు. అలాంటి దింతవరకు చూడలేదు. అది మన అనుభవాని కిదివరకు అందనిది. కాని మన చుట్టూరా ఎప్పుడూ ఉండి ప్రసరిస్తూ ఉండేది – అదొక వింత కాంతి. మన చుట్టూ, మనకు వెలుపల నిండినది. ఒకవైపున చంద్రుడు వెన్నెల కాస్తున్నాడు. ఎదురుగా మరో బింబం కనిపించింది. అది సూర్యబింబం కాదు, ఆ వచ్చేది కాంతీ కాదు. ఏదో తేజస్సు. మనలోని ఆలోచనలు, భావనలు, ఎరుకలు, ఆలోకనాలు అన్నీ దాని స్వరూపాలేనా అనిపిస్తుంది. కానీ ఇవేవీ ఆ బింబం కాదు. అలాఅని అవన్నీ వేరుగా ఎక్కడో ఉన్నట్లు అనిపించడమూ లేదు. ఆ బింబంయొక్క అంశలుగా చిన్ని చిన్ని వెలుగులుగా ఇవన్నీ భాసిస్తున్నాయి. ఆ వెలుగులో ఒక పీఠం. ఆ పీఠంపైన ప్రేమరుకు కూర్చున్న భంగిమలో మాస్టరు సి. వి. వి. గారు కూర్చుని ఉన్నారు. అది ఒక వెలుగు తెలిదామర యైనది. అందులో చుట్టూరా సాధకులు శయనాసనంలో పండుకొని ఉన్నారు.

అందులో మధ్య మణీన్యాయంగా మన మాస్టరుగారు సతీ సమేతులై ఆసీనులై ఉన్నారు. వారికి ఒకవైపు శ్రీ P.S.S. వర్మ దంపతులు, ఇంకొకవైపున మేము. సి. వి. వి. గారు అనే తెల్లతామర బొడ్డుచుట్టూ రేకులులాగా యోగసాధకులు

శయనాసనాలలో పరుండి ఉన్నారు. కొందరు దంపతులుగా ఉన్నారు. కొందరు ఒంటరిగా ఉన్నారు. ఒకరికొకరి మధ్య అంతరం కనిపిస్తూనే ఉంది. కాని ఆ అంతరం కూడా ఏింత వెలుగుతో నిండి ఉన్నదేగాని, శూన్యంగా లేదు.

"అంగనా మంగనా మంతరే మాధవః
మాధవం మాధవం చాంతరే చాంగనా"

అన్నట్లు ఈ యోగసాధకులనే గోపికకూ గోపికకూ నడుమ నెమలిపింఛపు కాంతులు విలాసాలు చూపుతున్నాయి. అలాగే జీవునికీ జీవునికీ మధ్య ఆకాశం నాట్యం చేస్తుంది. ఆ చోటు మన లోను ఉంటుంది. మన చుట్టూ ఉంటుంది. అదిలేని చోటు లేదు. అది నిరంతరం. ఒకే వస్తువు. ఆ వస్తువుయొక్క వాస్తవ స్థితిని మనం గుర్తించినపుడు మనలోన ఉన్న వస్తువు ఒక్కటే అని గ్రహించగలం. ఆ వస్తువు వేద్యమైనప్పుడు అది శివదం. అదీ వేద్యమ్ అవుతుంది.

"వేద్యం వాస్తవ మత్ర శివదం." అన్న భావం చక్కగా ఇచ్చట ప్రదర్శిత మైంది. అందరిలోను 'నమస్కారం మాస్టరు C. V. V.' అన్న స్పందన పని చేయసాగింది. అది శబ్దం కాదు. ఏదో చలనం ఏదో కంపనం. ఒక దివ్యశక్తి యొక్క అనుకంపనం వలన నా కుండలిని కదల సాగింది. కుండలిని గట్టిగా బిగిసి పోతున్నట్లుగా తెలుస్తోంది. ఆ బిగువు నాచుట్టూ ఉన్న ఇతర సాధకుల కుండలినిలోను పనిచేయడం తెలిసింది. అన్ని కుండలి నులూ ఒకే ఒక చక్రముగా అయిపోయాయి. అన్నీ కలిసి ఒకే ఒక వలయంగా, ఒక శక్తివలయంగా కావడం స్పష్టంగా తెలియ సాగింది. వీటన్నిటికీ కేంద్ర బిందువుగా ఉన్న మాస్టరుగారిలో బయలుదేరి ప్రతి చిన్న కదలికకు ఈ కుండలినుల వలయాలన్నీ తెలియ వచ్చింది. ఈ కదలిక చాల సూక్ష్మంగా

ఉంటుంది. ఎంతో సూక్ష్మమైన పరిశీలన వలన మాత్రమే దీనిని గ్రహించ వీలవుతుంది. ఇంకా సూక్ష్మమైన పరిశీలన వలన మాత్రమే ఈ కదలికలు తనలోనే కాక ఇతరులలో కూడా పని చేయటం గ్రహించవచ్చును. ఇది అంత సులభమైన పనికాదు. కాని అసాధ్యం కాదు. సాధనయొక్క అనుభవం వలన సాధించ దగినది.

ఆ తరువాత ఈ సాధన చేస్తున్న అందరి మనస్సులూ ఒకే వృత్తిలోనికి రావడం ఆరంభ మయింది. వేరు వేరుగా నడచుచున్న మనస్సుల ప్రవృత్తులు క్రమంగా శాంతిని పొందాయి. అందరి మనస్సులు ఒక్క మాస్టరుగారి యోగ ప్రవృత్తియందు లగ్నం కాసాగాయి. అప్పుడు సాధకుల మనస్సులన్నీ ఒక గతిని అందు కున్నాయి. అనగా "మద్గతాంతరంగః" అన్న స్థితిని అందు కొన్నాయి. మనస్సులన్నీ మాస్టరుసందు నిలిచి పోజొచ్చినవి. మనస్సును మనం నిలపడం అనే ప్రశ్నలేదు. వాని అంతట అవే నిలిచిపోయి, అందరి అంతరంగములలో మాస్టరుగారి వెలుగు ఒక్కటే ప్రవహిస్తూ ఉండటం తెలియవచ్చింది. ఈ సాధన చేస్తున్న వారందరి శిరస్సులూ ఒకే ఒక వెలుగుయొక్క దండవలె భాసిం చాయి. ఒక వెలుగు చక్రం దానికి వెలుపలగా ఇంకొక వెలుగు చక్రం. ఇలా ఎన్నో వెలుగుల చక్రాలుగా విస్తరించటం గోచరించి నది. అది అంతా కలిసి ఒక వెలుగుగా, ఒక మాస్టరుగా గుర్తించు టకు వీలైంది. అట్టి అనుభవం శరీరానికి ఎంతో హాయిని, మనస్సుకు ఎంతో ఆనందాన్ని ప్రసాదించింది. ఇప్పుడు భాగవతంలోని మొదటి శ్లోకం గుర్తుకు వస్తోంది.

"వేద్యం వాస్తవ మత్రవస్తు శివదం తాపత్రయో న్మూల నమ్'' ఒకే వస్తువుయొక్క వి కా స మే, ఈ వస్తువు లన్నిటి

వాస్తవానికి వేద్యం. వేద్యం అనగా తెలిసివస్తుంది. ఆ మాస్టరు అను వెలుగే మన అందరిలోను వెలుగుతున్నది. విడివిడిగా వెలుగుతున్నదంతా ఒకే వస్తువు. ఒకే మాస్టరు అన్న భావం అనుభవంలోనికి వచ్చినప్పుడు ఎంతో ఆనందం కలుగుతుంది. దానినే శివదం అన్నారు. శివం అనగా శుభమును 'దం' అనగా ఇచ్చునది. అనగా అంతటా ఉన్నది ఒకే ఒక వెలుగు అని తెలియడమే ఆనందం. అట్టి తెలివి, ఎరుక మనకు లభించినప్పుడు తాపత్రియోన్మూలనం జరుగుతుంది. అంటే భార్య, పిల్లలు, ధనం వీటికోసం బాధపడి ఉడికిపోవడం ఆగిపోతుంది. ఒకే దారి, గమ్యం ఏర్పడుతుంది. ఒకే తపస్సు ఒకే పద్ధతిగా నడుస్తుంది. భాగవతంలో చెప్పిన 'వాస్తవం' అన్నా, పతంజలి యోగ సూత్రాల్లోని నిరంతర భావం అన్నా ఒకటే. ఈ నిరంతర భావాన్నే పతంజలి "నైరంతర్యము" అన్నారు. గురుపాదులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈ భావాన్ని ఇలా వర్ణించారు. "(శ్రీ) నిరంతరానంద విశ్రేయసార్థ సాధకము. అంటే అంతరం లేని సంపూర్ణమైన ఆనందం. ఏ కొరతా లేని నిండైన శ్రేయస్సు. అనగా కళ్యాణం ఇచ్చునట్టి సాధనము కావలయును" అని సెలవిచ్చారు.



పన్నెండవ కిరణము

# ఒక విచిత్ర వ్యక్తితో పరిచయము

మాస్టరు గారి జీవిత సన్నివేశాలు చెప్పుకుంటున్నప్పుడు ఒకనాటి రాత్రి ఒక విచిత్ర వ్యక్తితో పరిచయం అయిందని తెలుసుకున్నాం. ఆ రాత్రి ఆ విచిత్రవ్యక్తి సూచనపైన భగవద్గీత చదవడం ప్రారంభించారు మాస్టరుగారు. అంతవరకు ఆయనకు భగవద్గీత అర్థమైనది వేరు, ఆ రాత్రి అర్థమైన భగవద్గీత వేరు. అర్థ తాత్పర్యాలు, వ్యాకరణ విశేషాలు, పాండిత్యం వీటికి బదులుగా అనుభూతి ఆయనలో నిండి పోయింది. కృష్ణుడు, అర్జునుడు, సంజయుడు వెలుగులుగా కన్నుల ముందు గోచరించారు. అప్పటి స్థితి నిద్ర కాదు, మెలకువ కాదు. అది ఒక అనిర్వచనీయమైన ఆనంద స్పర్శ. తెల్లవారు జామున నాలుగు గంటలకు పురుషోత్తమ ప్రాప్తియోగం పూర్తి అయింది. ఆనాడు కలిగిన అనుభూతియే, దర్శనమే నేటివరకూ మాస్టరు గారి నుంచి ఉపదేశాలుగా, ఉపన్యాసాలుగా వెలువడు తున్నది. మాస్టరు గారు నాలుగున్నర గంటలకు సీక్రెట్ డాక్ట్రిన్ చదవడం మొదలు పెట్టారు. కొంత సేపటికి గది అంతా ఒక మంచుపొర క్రమ్మినట్లు అయింది. గోపురాలు, దేవాలయాలు, విగ్రహాలు, పర్వతాలు, గుహలు, సెలయేళ్ళు, ఈజిప్టులోని పిరమిడ్లు, ఎవరో తల పాగాలు ధరించిన వ్యక్తులు కొందరు కనిపించారు.

మరుసటి రోజు మళ్ళీ ఆయనను చూడాలనే కుతూహలంతో బయలు దేరారు మాస్టరు గారు. మాస్టరు గారిని చూచి ఆయన విచిత్రంగా నవ్వారు. ఆ నవ్వు పిట్ట కూతలాగా హీంకారంతో వినిపించింది. ఆ రోజున ఆయన మాస్టరు గారికి ఆచరణకు సంబంధించిన కొన్ని విషయాలు బోధించారు.

1. ప్రతిరోజూ డైరీ వ్రాయవలెను.

2. మనస్సునందు భాసించిన విషయములు ఆచరణయందుంచవలెను.

3. స్వప్రయోజనమునకై ఎవరినీ దేనినీ అర్థించ రాదు.

4. నాకిది కావలెనని మనస్సున దేనినీ నిలువ నీయరాదు.

5. నిన్ను గూర్చి గాని, నీ గ్రంథములను గూర్చి గాని ఎవ్వరినీ అభిప్రాయములు అడుగరాదు.

6. జ్యోతిషము, సాముద్రికము, శకునము, తంత్ర శాస్త్రము అధ్యయనము చేయవలెను.

7. ఎవరితో మాట్లాడు చున్నను వారిని దైవముగా ఆరాధించవలెను.

మాస్టరుగారు ఆక్షణమునుండి పై వాక్యములనే తన జీవితాదర్శములుగా చేసుకొని, జీవితమును అలా తీర్చి దిద్ది కొన్నారు. అందువలననే ఆయన సాన్నిధ్యమందు, ఆయన స్మరణతో కాలము గడిపే ఎవరైనను ఈ విధముగానే జీవితమును తీర్చిదిద్ది కొంటారు.

ఆ విచిత్ర వ్యక్తి మాస్టరుగారికి ఉపదేశించిన ఆ వాక్యములను కొంత వివరించటం అవసరం.

"ప్రతిరోజు డైరీ వ్రాయవలెను" అన్న ఉపదేశంలో ఇమడ్చబడి ఉన్న సాధనమార్గం, ఆచరణ యందున్న వారికి పొరలు పొరలుగా విచ్చుకుంటుంది. ప్రతిరోజూ ఉదయాన్నే లేచి స్నాన సంధ్యాదులు ముగించుకొని, పూజాదికములు అయిన తరువాత ఆ రోజు తను చేయదలచుకొన్న దినచర్య అంతా ఒక క్రమ పద్ధతిలో కాగితంపై వ్రాసుకొని ఆ ప్రకారమే ఆ పద్ధతిలోనే పనులు చేయటం అభ్యాసం చేసినవారికి ఈ ఉపదేశం వెనుకనున్న రహస్యం అర్థమాతుంది. రాత్రి పడుకొనే ముందు మరల ఆ డైరీని ముందుంచుకొని, ఉదయం చేయదలచుకున్న పనులలో ఎన్ని పనులు జరిగాయి, ఎన్ని జరగలేదు, దానికి కారణమేమిటని పరిశీలించు కుంటే మరుసటిరోజు ఆ పనులు చేయగల అవకాశం ఉంటుంది. డైరీ అనగానే అందులో ఏవేవో వ్రాయటం అనికాదు. మనకు పరిచయమైన వ్యక్తులు, వారితో జరిగిన సంభాషణలు, ఆరోజు మనం చేసిన ఖర్చులు, వాటి వివరాలు, మనం చదివిన గ్రంథాలు, అందులోగల ముఖ్యమైన అంశాలు, మనం చేయదలచుకొన్న పనులు, వాటి వివరాలు...ఇవన్నీ వ్రాసుకోవాలి. ఏ రోజు మనం చేసిన ఖర్చు ఆ రోజు అందులో వ్రాసుకోవటంవల్ల మన ఆర్థిక పరిస్థితిలో వచ్చేమార్పు మనం ఊహించలేనిది – తన సంపాదనకంటే ఖర్చు ఎక్కువ ఉన్నవాడు, మరలమరల అప్పులుచేసి ఆఅప్పులుతీర్చలేక బాధపడుతుంటాడు. ఏక్షణాన్నయినా, ఈఅప్పుల నుండి నేను విముక్తుడను కావటం ఎలా అన్న ప్రశ్న ఉదయిస్తే వాడికి ఇదే పరిష్కార మార్గం. ఖర్చు పెట్టిన ప్రతిపైసా ఎకౌంటు వేయగలవాడు, ఎవ్వరైనా, ఎప్పుడైనా ఈ డబ్బు నీవు ఎలా ఖర్చు చేశావని అడిగినపుడు ఎకౌంటు చెప్పగలవాడు తన ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుకోగలడు. అప్పచెప్పిన పనులను సక్రమంగా, బాధ్యతగా నెరవేర్చగలడు.

ఇంతేకాదు......

చేయవలసిన పనులు చేయటానికి టైము లేదని, టైము చాలటం లేదని ఎంతోమంది బాధపడుతుంటారు. కాకపోతే కొంత మంది పనులు చేసుకునే విధానం తెలియక బాధ పడుతుంటారు. కొంతమంది అలా బాధపడటంలో ఆనందం అనుభవిస్తూ బాధ పడుతుంటారు. కానీ మాస్టరుగారి దినచర్య చూస్తే మనకు తెలుస్తుంది, ఆయన అన్ని పనులు, ఉన్న ఇరవైనాలుగు గంటలలో ఎలా చేయగలగు తున్నారు? అన్నది. మనం ఆయన చెప్పిన పనులు అటుంచి, మనం చేయవలసిన పనులలో చేయవలసిన టైముకి ఎన్ని చేయగలుగు తున్నాం? ఎందుకు చేయలేక పోతున్నాం? అంటే సమాధానం ఇదే! మహర్షులు ఒక ఉపదేశం చేస్తే వాటి వెనుక ఇంత ఉంటుంది. ఇదికూడా మన మనస్సుతో మనం ఆలోచించిందే తప్ప, ఇంకా ఆ ఉపదేశాల వెనుక ఎంత ఉందో, అది ఆలోచించే వారికికాక ఆచరించే వారికి మాత్రమే అనుభవ మౌతుంది.

అప్పచెప్పబడిన బాధ్యతలు సక్రమంగా టైములో చేయాలన్నా, ఆర్థిక పరిస్థితి మెరుగు పడాలన్నా; ఇతరులతోడి సంబంధాలు సవ్యంగా ఉండాలన్నా, జీవితం ఏ ఆందోళన, అసంతృప్తి లేకుండా సాఫీగా సాగిపోవాలన్నా ప్రతిరోజూ డైరీ వ్రాయటం ఎంతో అవసరం.

ఇక రెండవది "మనస్సున తట్టిన విషయములు ఆచరణ యందుంచవలెను" అన్న మహావాక్యము. అయితే ఈ "మనస్సు" మాస్టరుగారి మనస్సు. మాస్టరుగారి మనస్సు అంటే తన గురువునకు సమర్పణమైన మనస్సు, తనదంటూ మనస్సున ఏదీ నిలవని మనస్సు. ఏ విషయమందైనను ఇతరులను ద్వేషించని మనస్సు ఇతరులయెడ భేదభావము, అభిప్రాయములు లేని స్వచ్ఛమైన, నిర్మలమైన మనస్సు. త్రికరణశుద్ధి గల మనస్సు. అది మాస్టరుగారి మనస్సు. అట్టి మనస్సులో తట్టిన దేదైనా కార్య

రూపం దాల్చి తీరుతుంది. మాస్టరుగారు "గోదావైభవం"లో ఒక ఉపదేశం చేశారు. "ఎంత మంచిదియైనను నీవు కోరినంత వ్యామోహమై నిల్చి యడ్డగించు" అని. అందుచేతనే మనస్సున దేనినీ నిలువ నీయవద్దు అని ఆ విచిత్రవ్యక్తి మాస్టరుగారికి ఉపదేశించారు. అంతేకాదు. మాస్టరుగారు కొన్ని నెలలపాటు, రోజుకి కొన్ని గంటలు బీచి ఒడ్డున ఒక రావిచెట్టు క్రింద కూర్చుని గాయత్రీ ధ్యానం చేసిన సంఘటన సోదర బృందంలోవారికి చాల మందికి తెలుసు. గాయత్రీ ధ్యానంలో మాస్టరుగారి వాక్కు గాయత్రీమయుమయింది. అందుచేతనే ఆయన నోటినుండి వెలువడిన ఏ వాక్కు అయినా, గ్రహించగలవారికి వేదవాక్కు.

ఇక మూడవది "నీ ప్రయోజనమునకు, ఎవరినీ, ఎప్పుడునూ, సహాయము అర్థించరాదు" అని. మాస్టరుగారి సన్నిహితులకు ఈ విషయం బాగా తెలుసు. మాస్టరుగారు తనకోసం ఎవరినీ దేనినీ కోరరనీ, ఎవరినయినా ఏదైనా కోరినా అది తనకోసం గాక, ఈ అందరికీ ఉపయోగించే పనికోసమేనని. అయితే, ఎవరి సహాయం అర్థించకుండా జీవించడం సాధ్యమా? అయినా ఒకరి సహాయం అర్థించకూడదు అన్నది అంత పెద్ద నియమమా? ఇది అహంకారం అవుతుందేమో? అన్న ప్రశ్నలు కొంతమంది మనస్సులలో రాక మానవు. ఈ ప్రశ్నలు సహజమే! కానీ మనం అర్థం చేసుకోవలసిన విషయం ఒకటి ఉంది. మాస్టరుగారు తనకోసమంటూ ఎవరినీ, దేనినీ అసలు ఇంతవరకూ కోరలేదా! ఇక కోరరా? అన్న విషయం. కోరవలసిన అవసరం ఆయనకు రాదు! ఎందుకంటే...అసలు ఆయన జీవితంలో ఆయన కంటూ ఏమైనా ప్రత్యేకంగా ఉందా? మరి ఆయనకు ఇల్లు ఉందికదా? ఉంది! కానీ అక్కడ ప్రతిదినం హోమం జరుగుతుంది. వందలమంది తమ దుష్కర్మలను అక్కడ రహితం చేసుకొని ఆరోగ్యాలు పొందుతారు. మరి మాస్టరుగారి ఇంటివద్దనే ప్రతిరోజు జరిగే డిస్పెన్సరీలో వందలమంది తమ అస్వస్థతకు

చికిత్స పొందుతారు. ఆవేదన నిండిన తమ జీవితాలలో ఆనందం నింపుకొంటారు. పరిపూర్ణ ఆరోగ్యంతో జీవిస్తారు. ఇక సాయంకాలం ఆ ఇంటి వద్దనే మాస్టరుగారి ఉపన్యాసములు – యుగయుగాల జ్ఞానం శ్రోతల కందుతుంది. యోగసాధన అనేది ప్రారంభమౌతుంది సోదరులకి. శతాబ్దాల సమస్యలకు పరిష్కారం అక్కడనే లభిస్తుంది. మానవ జాతి విముక్తికి ఒక మార్గం అక్కడనే దొరుకుతుంది, గ్రహించగలిగితే. ఇక అది మాస్టరుగారి ఇల్లేమిటి? మాస్టరుగారి జీవితంలో ఏ క్షణం చూసినా, అది మనకోసమే అని తెలుస్తుంది. కానీ పసరు మొగ్గలులాంటి సోదరులు మాస్టరుగారికేదో చేయాలని, చేస్తున్నామనీ అనుకుంటుంటారు – మాస్టరుగారి పేర చేస్తున్నామంటారు. ఏదో ఒక ఆధారం, ధైర్యం లేకపోతే పనులు చేయటం ఒక కక్ష్యవరకు కష్టం గనుక అలా అనుకోవటం సహజమే! కానీ అది సత్యం కాదు. మాస్టరుగారికి ఏదైనా మనం చేయటం అంటే, ఆయన చెప్పినట్లు, ఆయన సంకల్పాన్ననుసరించి చేయటమే !

ఆ విచిత్ర వ్యక్తి మాస్టరు గారికి ఉపదేశించిన ఆ వాక్యాల వెనుక నేను గ్రహించింది ఇది. "ఎవరితో మాట్లాడు చున్నను దైవముగా వారిని ఆరాధించ వలెను" అన్న వాక్యము వెనుక వాసుదేవోపాసన ఉంది. అందరిలో వసించే వాసుదేవుని ఉపాసన అనగా నిర్గుణుడైన పరబ్రహ్మన్ని కళ్ళు మూసుకొని ధ్యానించటం కాదు. శరీరధారులైన జీవుల చేష్టల నుండి వాసు దేవుని లీలా మయమైన జీవితాన్ని చూడగలగటం. జరుగుతున్న సంఘటనలు, పరిస్థితులు ఆయన లీలలుగా దర్శించి జీవించ గలగటం దానికి మార్గమే అందరినీ ఆయన రూపాలుగా ధ్యానించటం. భగవంతుడు ప్రత్యక్షంగా వచ్చి మనతో సంభాషించి ఇలా చేయమని ఎప్పుడూ చెప్పడు. ఆయన వాక్కులు మనం గ్రహించటం నేర్చుకోవాలి. ఎవరితో సంభాషిస్తున్నా ఆయనగా భావిస్తే ఆయన

వాక్కులు వారి నుండి వినిపిస్తాయి. అంతేకాదు వారికీ మనకీ అంతకు ముందుగల కామ క్రోధాలు, అభిప్రాయ భేదాలు నశించి పోయి ఇద్దరిలో గల వాసు దేవుడు మాటాడటం మొదలు పెడతాడు. ఇదీ సాధన.

మాస్టరు గారికి ఆయన ఆ వాక్యాలు చెప్పి వెళ్ళిపోతుండగా మాస్టరు గారు అడిగారు. "నేను మీకు ఎలా తెలుసు?" అని. ఆయన చెప్పారు "మిగిలిన వారు అందరూ తెలిసినట్లే" అని.

మాస్టరు గారు : మీ గురించిన వివరాలు తెలుసుకోవాలని ఉంది. నేను మిమ్మల్ని ఎప్పుడు, ఎక్కడ కలుసుకోగలను?"

ఆయన : నా గురించి తెలుసుకోవలసిన అవసరం లేదు. నేను నిన్ను కలుసు కోవడం తప్ప, నీవు నన్ను కలుసు కోవడానికి వీలు పడదు. చాలా విషయాలు నీకు తెలియ వలసినవి తెలుస్తాయి. నా గురించి మాత్రం కాదు."

మాస్టరు గారు : మా ఇంటిలో నేనొక్కడినే ఉన్నాను - మా ఇంటికి దయచేయండి.

ఆయన : నేను మీ ఇంటిలో నీతోపాటు తప్పక ఉంటాను. కానీ అది ఇప్పుడు కాదు.

మాస్టరు గారు : ఏమైనా టిఫిన్ తీసుకుంటారా?

ఆయన : నేను అడిగి నప్పుడు తప్పక ఇద్దువు గాని.

ఆ సంభాషణ అయిన తరువాత ఆయన వెళ్ళి పోయారు. మాస్టరుగారు ఇంటికివచ్చి ఆయన చెప్పిన బొమ్మ ఒక కాగితంపై గీసి సీక్రెట్ డాక్ట్రిన్ పుస్తకంలో పెట్టి చదవటం మొదలుపెట్టారు. గది మధ్యలో ఒక ఆకారం కనిపించింది. ఆజాను బాహువు,

విశాలమైన నుదురు, పెద్దకళ్ళు, చేతిలో కమండలము, వెన్నెలవంటి చల్లనైన చిరునవ్వు...ఆయన వైవస్వత మనువు. మాస్టరుగారు తనకు దర్శన మిస్తున్న ఆ దృశ్యాన్ని చూస్తూండగా మరల ఆ విచిత్ర వ్యక్తి వచ్చి మాస్టరుగారికి అనేక విషయాలు బోధించారు. సృష్టిపరిణామక్రమము, వాక్కు, పంచభూతములు, అణువులు, గ్రహములు, తిథులు, అహోరాత్రములు, యుగములు, కల్పములు, మన్వంతరములు మొదలైన అనేక విషయాలను ఆయన ఉపదేశించారు. అప్పటి నుండి మాస్టరుగారికి ఆయన అవసరమైనపుడెల్ల కనపించి చేయవలసిన కార్యక్రమాలను వివరిస్తూ ఉంటారు. ఆయన ఒకసారి వనజ అనే అమ్మాయికి, మరో సారి W. T. T. చైర్మన్ వర్మగారికి కనిపించిన విషయము సోదర బృందములోని వారికి చాలమందికి తెలిసినదే! అమెరికాలో మాస్టరు గారి ప్రియమిత్రులు శ్రీ B. G. శ్రీనివాసరావుగారి భార్య ప్రసవ సమయంలో ఆమెకు దర్శన మిచ్చారు. కానీ ఇంతవరకు ఎవ్వరికీ ఆయన పేరుగాని, ఆయనను గూర్చిన వివరములుగానీ తెలియవు.

కానీ ఒక్కటి మాత్రం సత్యం —

ఒక జాతికి, దేశమునకు మాత్రము కట్టుబడక యావత్ మానవజాతి శ్రేయస్సుకై సంకల్పించి, ఆ కార్యక్రమంలో భూగోళం నలుమూలలా సంచరిస్తూ, అవసరమైన వేళల, అర్హత గలవారికి దర్శనమిస్తూ తన ప్రణాళికను సాగిస్తూన్న ఒక జ్యోతి ఆయన. ఆయనను స్మరించి, ఆ ప్రణాళికకు మన జీవితాన్ని అంకితం చేసుకోవటం కన్న జన్మసార్థకత లేదు. పరస్పర సహకారం, ఇతరులయెడ మన సత్ప్రవర్తన, ఇతరులకు మనం చేయు సహాయం, జయాపజయముల చింత వదలి బాధ్యతలను నెరవేర్చుట, ఎట్టి పరిస్థితులలోనైనా, "మీకు నేనున్నాను" అన్న మాస్టరుగారి మాటపై విశ్వాస ముంచి జీవించ గలగటం – ఇవియే మనలను ఆయన వద్దకు చేర్చు మార్గాలు.

ప ద మూ డ వ   కి ర ణ ము

# దివ్య సాన్నిధ్యం

నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాం
తాపార భూత దయయును
తాపస మందార! నాకు దయసేయగదే!

భాగవతమందు పోతనగారు భక్తుల రూపమున చేసిన ప్రార్థన ఇది. భగవంతుని పాదకమలసేవ ఒకటియే కాక, ఆయన పాదకమలములను అర్చించెడి వారితో స్నేహము, ఆ భగవంతుని రూపములైన సాటి జీవుల యెడ మనకు గల భూతదయ కూడా మనలను పునీతం చేసి, మన జీవితములను భగవన్మయము చేస్తాయి.

అందుకే .........

సంవత్సరములుగా మాస్టరు గారి దివ్యసాన్నిధ్యంలో, ఆయన ప్రేమలో తమ జీవితాలను వెలిగించుకుని, జీవనాన్ని సాగిస్తున్న కొంత మంది సోదరుల దర్శనాలను క్లుప్తంగా తెలియజేస్తున్నాము. భగవంతుని లీలల నుండియే కాక, భక్తుల చరిత్రల నుండి కూడా సందేశాన్ని స్వీకరించటమే భాగవత మార్గం.

# మాస్టరుగారితో వర్మగారు

ఇప్పటికి తొమ్మిది సంవత్సరాల క్రిందట భీష్మ ఏకాదశినాటి రాత్రి P. S. S. వర్మగారు నిద్రిస్తూ ఉండగా, తన గదిలో వేల కొద్దీ సూర్యులు ఉదయించినట్లు అయి మేలుకున్నారు. ఆ కాంతి పుంజం మధ్య ఒక పురుషుడు దర్శన మిచ్చారు. ఆయనే గుంటూరులో మాస్టరుగారిని కలుసుకున్న విచిత్ర వ్యక్తి.

వర్మగారికి చిన్నతనం నుంచీ దేవాలయాలకు వెళ్ళడం అంటే అంత ఇష్టం ఉండేది కాదు. "ఈ దేహమే దేవాలయం. ఇందలి జీవుడు దేవుని అంశమే. ఈ దేహాన్ని శుభ్రపరచుకుని, అంతరంగాన్ని పవిత్రీకరణం చేసుకుని, హృదయంలో భక్తి నిలిపి, లోపల ఉన్న దేవుని అర్చించడమే నాకు తెలిసింది" అంటారాయన.

మొదటినుంచీ అరవింద యోగీంద్రులన్నా, అరవిందుల మాత అన్నా వర్మగారికి చాలా భక్తి ఉంది. అరవిందుల సాహిత్యం క్షుణ్ణంగా చదివారు. "To fight death and conquer is my interesting subject." అంటారాయన. ఆ భీష్మఏకాదశి నాడు అరవిందుల 'సావిత్రి' అనే గ్రంథాన్ని పారాయణ చేశారు. ఆ రాత్రే ఆయనకు పైన చెప్పినట్లు విచిత్ర వ్యక్తి దర్శనం లభించింది.

చాలా సంవత్సరాల క్రిందట విజయదశమినాడు మాస్టరు గారి ఉపన్యాసానికి వెళ్ళారు వర్మగారు. అదే మొదటిసారి ఆయనను చూడడం. కాని అంతకుముందే ఎక్కడో పరిచయమైనట్లుంది. ఆ ఉపన్యాసంలో మాస్టరుగారు అశ్వినీ దేవతలను గురించి చెప్పారు. చేయవలసిన సాధన చేస్తే అశ్వినీ దేవతలు కనిపించ గలరని చెప్పారు. ఉపన్యాసం అయిన తర్వాత వర్మగారు మాస్టరు గారిని కలుసుకున్నారు.

వర్మగారు : I want to see the twin gods on physical plane. Show me! (నేను అశ్వినీ దేవతలను భౌతిక దేహాలతో చూడవలెనని కుతూహలపడుతున్నాను. చూపించండి.)

మాస్టరుగారు : I will show you. Do this mantra for ten days and you will get what you need.

"తా మగ్నివర్ణాం తపసా జ్వలంతీం
వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్।
దుర్గాం దేవీగ్ం శరణమహం
ప్రపద్యే సుతరసి తరసే నమః॥"

మరునాటి నుంచి వర్మగారు భార్యతో సహా పదిరోజులు దీక్షతో మంత్రజపం చేశారు. పదవరోజు రాత్రి సంతర్పణ చేశారు. రాత్రి ఒంటిగంటకు కావలసిన దర్శనం జరిగింది. పాండిచేరిలో అరవిందమాత 'అరవిల్లి' ఆశ్రమం ప్రారంభించే సమయంలో మాస్టరుగారు వర్మగారివద్దకు వచ్చారు.

వర్మగారు : You should join me to organise a universal system. (ఒక విశ్వవ్యాప్తమైన నిర్మాణ ప్రణాళిక నిర్వహించడానికి మీరు నాకు సహాయం చేయాలి.)

మాస్టరుగారు : Yes. It is done. (అలాగే. ఇప్పటికే నీవు కోరినది జరిగింది.)

"అదే మాయిద్దరి పరిచయానికీ నాంది" అన్నారు వర్మ గారు. అప్పటినించీ విచిత్రమైన పద్ధతిలో శిక్షణ యివ్వడం ప్రారంభించారు మాస్టరుగారు. క్షత్రియ రక్తం ప్రవహించే వారికి, ఎవ్వరినీ లెక్కచేయక పోవడం, ఏదో సాధించాలనే తీవ్రమైన పట్టుదల, ఇతరులను తక్కువ వారుగా చూడడం, నాయకత్వం వహించాలనిపించడం, అందరూ తన ఆజ్ఞకు లోబడి మెలగాలని అనుకోవడం ఇటువంటి లక్షణాలు ఎక్కువమందిలో ఉంటాయి. అంటే రజోగుణ ప్రకోపం ఎక్కువగా ఉంటుంది. పరిపాలనకు, యుద్ధానికి కావలసిన పట్టుదల, సాహసం, మొండితనం మొదలైనవి ఉంటాయి. బ్రహ్మవిద్య వీరికి అంటడం అంత సులువు కాదు. అంటినా, దానికి అవసరమైన క్రమశిక్షణ అలవడడం అంత తేలిక కాదు. కనుక వర్మగారికి మాస్టరుగారు ఇచ్చే శిక్షణ, కొంత కటువుగానే ఉంటుంది. అంత శిక్షణ పొందారు గనుకనే వర్మగారు నేడున్న స్థితికి చేరారు.

ఆయన మొదట మాస్టరు గారిని కలుసుకున్నప్పుడు మూడు వరాలు అడిగారు.

"1. Maximum possible help to a disciple must be done to me.

2. Blood polution of seven generations must be removed in me.

3. Under any circumstances, even if go away from you, you should not leave me."

(శిష్యునికి గురువు ఎంత సహాయం చేయడానికి వీలవుతుందో అంత సహాయం మీరు నాకు చేయాలి. పై ఏడు తరాల నుంచి

వస్తున్న దోషాలను నా రక్తంలో నుంచి తొలగించాలి. నేను ఏ పరిస్థితుల్లోనైనా మీ నుండి దూరమైపోయినా, మీరు మాత్రం నా నుండి దూరం కాకండి. నన్ను మీదగ్గర చేర్చుకోండి.)

"సరే" అన్నారు మాస్టరు గారు. 1968 వ సంవత్సరం ఆగష్టు 4 వ తేదీన వర్మగారి యింట్లో మాస్టర్ సి. వి. వి. జయంతి ఉత్సవం వైభవంగా జరిపారు. పూజ అయిన తర్వాత మాస్టరు గారు వర్మగారితో ఇలా అన్నారు. "This is the house, where from the world is to be re-organised" (ప్రపంచం అంతా తిరిగి పునర్వ్యవస్థీకరించ బడడం ఈ యింటి నుంచే జరగ వలసి ఉంది.)

## అపూర్వమైన స్నానం

ఆ తర్వాత వర్మగారికి పాకలపాటి గురువుగారితో పరిచయం అయింది. విశాఖజిల్లా నర్సీపట్నం అవతల చింతపల్లి ఏజన్సీలో పాకలపాటి గురువుగారు ఆశ్రమం నిర్మించుకుని, కొండ వాళ్ళను చేరదీసి, వారిమధ్య తాను నివసిస్తూ ఉండేవారు. లోకమంతా వెనుకబడిన జాతులు అని చిన్నచూపు చూసే ఆ కొండ ప్రజలకు ఆయన తన సాన్నిధ్యం ప్రసాదించారు. ఆ ప్రాంతాల ఉన్న వారికి ఆయనను గురించిన విశేషాలు బాగా తెలుసు. అయితే చాలామంది పెద్దలు ఆయనను తమ స్వార్థం కోసం వినియోగించు కోవడానికి ప్రయత్నించారే గాని, వారిలోని వెలుగును తమలో వెలిగించుకోలేకపోయారు. ఆయన తోడి పరిచయం ఒక విధంగా వర్మగారి అదృష్టమే అని చెప్పాలి. ఆయన వర్మగారికి ఎన్నో ఆధ్యాత్మిక రహస్యాలను వివరించారు. సృష్టి రహస్యాలను దర్శనం చేయించారు. ఇరవై ఆరు వేల సంవత్సరాల ప్రణాళికను ఆయన వర్మగారికి వివరించారు. "వర్మబాబూ! నీవు అమెరికాలో అడుగు పెట్టిన నాటినుంచీ ఒక నూతన శకం ప్రారంభమవుతుంది." అని దీవించారు. ఒకనాడు ఆయన ర్మగారికి అపూర్వమైన

స్నానం చేయించారు. ఉదయం అయిదు గంటలకి ప్రారంభమైన స్నానం సాయంత్రం ఎనిమిది గంటలకి ముగిసింది. ఆయన వర్మ గారికి భ్రూమధ్యాన బొట్టుపెట్టి, తన పాదాలకు నమస్కారం చేయమన్నారు. నమస్కారం చేసిన తర్వాత, "నీకేం కావాలో కోరుకో" అన్నారు.

"నాకెందుకు వరం?"

"నేను ఇస్తానంటున్నాను గనుక."

"నాకు అవసరం లేదు"

"అయినా అడుగు"

"I want the globe on my five fingers in the service of my master. (నాగురువుకు నేను చేసే సేవలో యావత్ భూగోళం నా మునివేళ్ళ మీదుగా తిరగాలి.)

"తప్పకుండా అలాగే జరుగుతుంది" అని ఆయన అనుగ్రహించారు.

"మీరు నాకు చెప్పిన ఇరవై ఆరువేల సంవత్సరాలూ నేను ఒకే ప్రజ్ఞలో జీవించాలి" అన్నారు వర్మగారు.

"అలాగే! ఒక పని నీవు చేయడం మొదలుపెట్టు. మిగిలినది నిన్ను నడిపించే గురువులు చూసుకుంటారు."

## పరమగురువుల ప్రణాళిక

వర్మగారు పరిణామ క్రమాన్ని గురించి యిలా చెప్పారు. "లోహవర్గంలోనుంచి వృక్షవర్గంలోనికి, వృక్షవర్గంలోనుంచి జంతు

వర్గంలోనికి, జంతువర్గంలోనుంచి మానవవర్గంలోనికి జీవపరిణామం జరుగుతోంది. జంతు కక్ష్యలోనుంచి మానవ కక్ష్యలోనికి అడుగు పెట్టడానికి ఒక ప్రత్యేకమైన కాలం నిర్ణయించబడుతుంది. కృష్ణుని కాలంలో ఈ తలుపు తెరిచి, అర్హతగల జీవులను జంతు కక్ష్యలో నుండి మానవ కక్ష్యలోనికి పంపారు. ఈ కార్యక్రమం జరిపినవాడు శ్రీకృష్ణుడు. ఆయన తనకు అనుచరునిగా, సాధనంగా మైత్రేయ మహర్షిని స్వీకరించారు. కృష్ణుడు శరీరం వదిలే సమయానికి అతని వద్ద ఉన్నది మైత్రేయులే! కృష్ణుడు ఆయనకి భాగవతాన్ని ఉపదేశించి, రాబోయే కాలంలో జరగవలసిన కార్యక్రమం తాలూకు పథకాన్ని సమగ్రంగా ఇచ్చాడు. (ఈ విషయాలకు వివరాలు దివ్య జ్ఞాన గ్రంథాల్లో కొన్ని లభిస్తాయి. కొంతవరకు భాగవతం లోను, విష్ణుపురాణంలోను ఉన్నాయి.) ఆనాడే కృష్ణుడు మైత్రేయునిలో అంశగా ప్రవేశించాడు. మైత్రేయ మహర్షి అవసరమైన సమయాల్లో, అవసరమైన చోట్ల శరీరం ధరిస్తూ నాటినుంచి నేటి వరకు ఆ కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నారు.

ఈ కార్యక్రమంలో ఆయనకు సహకరించే మరి యిద్దరు ఋషులు ఉన్నారు. వారు మరువు, దేవాపి అనే పేర్లుగల పరమ గురువులు. వారినే దివ్యజ్ఞాన సంప్రదాయం వారు మాస్టర్ మోరియా, మాస్టర్ కుత్ హూమీ అంటారు. ఇద్దరూ క్షత్రియులే కాని మోరియా రాజఋషిగాను, కుత్ హూమి బ్రహ్మర్షిగాను మారారు. రాబోయే కాలంలో యావత్తు మానవ జాతికీ చక్రవర్తిగా మరువు, మంత్రిగా దేవాపి రాగలరని విష్ణుపురాణం చెబుతోంది. ఈ యిద్దరికీ శిష్యుడు జ్వాలాకూలుడు, లేక మాస్టర్ జ్వాల్ కూల్. జిజ్ఞాసువులైనవారిని యోగమార్గానికి ఆకర్షించడం, వారిచేత సాధన చేయించి, పరమగురువుల మార్గానికి నడిపించడం, వారిని వ్యక్తిగత కర్మనుంచి, జాతికర్మనుంచి విడిపించి, సాముహిక కర్మలోనికి అడుగు పెట్టించడం, మానవ కక్ష్యకు పైన ఉన్న

దేవతల కక్ష్యలోనికి మానవులను నడిపించడం ఆయన కార్య క్రమాలు. ముఖ్యంగా, ప్రాచీన గ్రంథాల్లోని ఆచరణకు సంబంధించిన అంశాలు, ఉపదేశాలకు సంబంధించిన విషయాలు సులువైన పద్ధతిలో ఇంగ్లీషు భాషలో 24 గ్రంథాలు వ్రాశారు. మన మాస్టరుగారు కూడా మనకు తెలిసినంతవరకు అదే కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నారు. మాస్టరుగారిలోని దివ్య ప్రజ్ఞను, వారి దివ్య కార్యక్రమాన్ని సంపూర్ణంగా తెలుసుకోవడం మనకి సాధ్యంకాదు. మనకి తెలిసినది, తెలుసుకోగలిగినది చాలా స్వల్పం. ఇంకా తెలియవలసినది ఉంటే అది మాస్టరుగారు దర్శనం చేయించ వలసిందే! తనకు అంటూ ఏదీ లేని మాస్టరుగారు నడుపుతున్న మహాయజ్ఞంలో వర్మగారు ఒక సాధనంగా రూపొందారు.

శ్రీ కృష్ణుడు ఈ భూమిపైన ఏడు ఆధ్యాత్మిక కేంద్రాలకు బీజాలు వేశాడు. వాటిలో ఒకటి ఉత్తరధ్రువం వద్ద ఉంది. ఆ మండలంలో వ్యాసుడు, అంబరీషుడు, నారదుడు మొదలైన మహానుభావులు సూక్ష్మ శరీరాలతో ఉన్నారు. త్రివేణీ సంగమానికి పైన ఒకటి, నీలగిరి పర్వతాలపై ఒకటి అలాంటి ప్రదేశాలున్నాయి. హిమాలయాలలో శంబళ, కలాప అనే గ్రామాలు ఉన్నాయి. ఇవన్నీ భౌతికంగా ఉన్న గ్రామాలు కాదు. పాత్రత, అర్హత సంపాదించుకున్న శిష్యులు ఇందులో ప్రవేశం చేయడానికి పరమ గురువుల అనుమతి లభిస్తుంది.

ప్రఖ్యాత చిత్రకారులు రోరిక్, లెడ్ బీటర్, బ్లావెట్ స్కీ మొదలైనవారు ఈ గుహలను దర్శించి, తమ అనుభవాలను గ్రంథస్థం చేశారు. కులూలోయ ప్రాంతంలో శ్రావస్తి అనే పేర ఇలాంటిదే మరో కేంద్రం ఉంది. పరమ గురువులు అక్కడ నివాసం ఏర్పరచుకొని, అక్కడనుంచే తమ కార్యక్రమాలు అన్నీ నడుపు తున్నారు. అక్కడ పరమ పవిత్రమైన గ్రంథాలయం ఒకటి ఉంది.

ప్రపంచంలో ఇప్పటివరకు వ్రాయబడిన గ్రంథాలు—అచ్చు అయినవీ కానివీ—అన్నీ అక్కడ ఉన్నాయి. ఈ గ్రామం, గ్రంథాలయం సూక్ష్మ లోకాలకు సంబంధించినది గనుక సామాన్యుల దృష్టికి అందదు. స్విట్జర్లాండులో ఉన్న ఆల్ప్స పర్వతాలనుండి హిమాలయ పర్వతాలవరకు సూటియైన బాట ఒకటి ఉంది. ఈ భూగోళంపైన మానవజాతి కళ్యాణమే కార్యక్రమంగా పెట్టుకుని, జీవితాలను దానికే అంకితంచేసిన మహానుభావులు 14,400 మంది ఉన్నారు.

ఇన్ని కేంద్రాల్లోను ఒకే కార్యక్రమం జరుగుతోంది. ఇంత మంది మహాత్ములూ ఒకే లక్ష్యంకోసం ప్రయత్నం చేస్తున్నారు. శిష్యులకి శిక్షణ యిచ్చి, ఈ మార్గాన నడిపిస్తున్నారు. ఇదే కార్య క్రమాన్ని చేపట్టి, ప్రపంచం నలుమూలలా తన వాక్కు ద్వారా, సాన్నిధ్యం ద్వారా వ్యాపించినవారు మన మాస్టరుగారు. ఆయన మనలో ఒకరుగా మెలగుతూ ఉండడం, ఆత్మీయతతో చనువుగా మాట్లాడడం, మనం చెప్పేవన్నీ ఓపిగ్గా వింటూ ఉండడంవల్ల మనకి మాస్టరుగారి విశ్వరూపాన్ని దర్శించడం చేతకావడం లేదు. కృష్ణావ తారంలో జరిగినదీ యింతేగదా! యుద్ధభూమిలో విశ్వరూపాన్ని చూసేసరికి అర్జునుడు వణికిపోయాడు. "ఇంతకాలం నిన్ను సఖుడ వని, బావ అని చనువుగా మాట్లాడాను. ఛలోక్తులు విసిరాను. కాని నీవెవరో నాకు నేడు అర్థమవుతోంది." అని సాష్టాంగపడ్డాడు. అటువంటి సాక్షాత్కారం మనకందరికీ కూడా కలగాలని కోరు కుంటున్నాను.

ప్రపంచంలో ప్రస్తుతం ఉన్న ముఖ్య కేంద్రాలు మూడు. ఒకటి అమెరికాలో ఉంది. మరొకటి యూరపులో ఉంది. మూడవది భారతదేశంలో ఉంది. ఈ మూడూ ఒక త్రికోణంగా ఏర్పడి, ప్రపంచంయొక్క గమనాన్ని నడుపుతున్నాయి. కాబోయే వ్యక్తు

సంవత్సరాల్లోనూ ఊహించని మార్పులు జరుగుతాయి. 1985–95 మధ్య సరిక్రొత్త పథకాలు రూపు దిద్దుకుంటాయి.

ధాన్యం పండాలంటే ముందు విత్తనాలు జల్లాలి. దానికి ముందు నారుమడి సిద్ధం చేసుకోవాలి. కృష్ణుడు, కర్మభూమి అయిన మన దేశాన్ని నారుమడిగా పదునుచేసి, విత్తనాలు చల్లాడు. ఇవి మొలకెత్తిన తరువాత తీసుకువెళ్ళి అవసరమైన చోట్ల నాటుతాడు. అంటే ఇక్కడ శిక్షణ పొందినవారిని మిగిలిన దేశాలకు పంపి ఈ జ్ఞాన జ్యోతిని వెలిగిస్తాడు. ఈ కార్యక్రమం నిర్వహిస్తున్నవారు మైత్రేయులు, మాస్టరుగారు మొదలైనవారు. సూర్యుడు ఉదయించి, ప్రభాత కిరణాలను ప్రసరింపజేసేది తూర్పుదిక్కు నుంచి గనుక, ఆధ్యాత్మికత ప్రసారం జరగాలన్నా తూర్పు దేశాల నుంచే జరగాలి. ఇంతవరకు అలాగే జరిగింది.''

వర్మగారు, దాంపత్యాన్ని గురించి, సంతానోత్పత్తిని గురించి కొన్ని ముఖ్యమైన విషయాలు చెప్పారు. పరాశర మహర్షి ఒక నాడు యమున దాటుతూ ఒక్కసారి గ్రహగతులను గమనించాడు. అది ఒక దివ్యపురుషుడు ఆవిర్భవించడానికి తగిన సమయం అని గ్రహించాడు. బెస్తరాజు కుమార్తె అయిన సత్యవతిని, వివాహ మాడి, వేదవ్యాసుని జన్మకు కారణమైనాడు. రాబోయే శతాబ్దాలలో కూడా సంతానోత్పత్తి విషయంలో ఇటువంటి విధానం అవలంబించబడుతుంది. కాలం వలన పిల్లలు పుట్టడం సంభవిస్తుంది. అట్టి స్థితికి చేరుకోని మానవులను మరో గ్రహానికి తరలిస్తారు. వారిని ఆశ్రమాల చుట్టుప్రక్కలకు రానివ్వరు. ప్రస్తుతం మానవునికి గల మర్మావయవం కేవలం విసర్జకావయవంగానే ఉపయోగ పడుతుంది. వైద్య విధానంలోనూ చాలా మార్పులు వస్తాయి. కేవలం రంగు, ధ్వని, భావం – వీటివల్లనే చికిత్స జరుగుతుంది. ప్రస్తుతం ఫిలిప్పైన్ దీవులలో, ఆపరేషను చేసే పరికరాలు లేకుండానే ఆపరేషను చేసే విద్య తెలిసినవారు చాలామంది ఉన్నారు.''

ఇలాంటి విషయాలు వర్మగారు ఎన్నో చెప్పారు. ప్రస్తుతం ఆయన విదేశాలతో వాణిజ్యం చేస్తున్నారు. మిలియన్లలో డబ్బు గడించి, మాస్టరుగారు సంకల్పించిన కార్యక్రమాన్ని జయప్రదంగా కొనసాగించాలని ఆయన సంకల్పం. "డబ్బు మానవుడు సృష్టించుకున్నది. ధనసంపాదన మనస్వార్థం కోసం కాకపోతే, ఎంత డబ్బు అయినా దానంతట అదే వస్తుంది. డబ్బువలన ఎంతో ప్రయోజనం ఉంది. మనం వినియోగించుకునే తీరునుబట్టి ఉంటుంది." అంటారు వర్మగారు.

"మాస్టరుగారు నన్ను చాలా కఠినంగా తిట్టినరోజులు చాలా ఉన్నాయి. ఒక్కోసారి వాటికి తట్టుకోలేక నాలో నేనే ఎంతో ఘర్షణ పడేవాడిని. కాని ఎటువంటి పరిస్థితిలోనైనా సాధించదల్చుకున్నది సాధించనిదే విడువనని, ఆయనను వదలిపెట్టనని నా ప్రతిజ్ఞ. మాస్టరుగారు ఏది చేసినా మన మంచికే. మనలో తొలగిపోవలసినవి, కరగిపోవలసినవి ఎన్నో ఉంటాయి. ఒక్కొక్కరికి ఒక్కొక్క రకం శిక్షణ యిస్తుంటారు. తట్టుకుని నిలబడ గలగడమే మనం చేయగలిగింది. కురుపులో ఉన్న రసిని పిండుతుంటే బాధగానే ఉంటుంది. అయినా సహించక తప్పదుకదా!" అంటారాయన.

"భారతీయ సోదరుల కంటె, ఐరోపావారు మాస్టరుగారి ప్రణాళికను గురించిన వివరాలు బాగా గ్రహించారు. గ్రహించడమే కాదు, ఆ ప్రజ్ఞయందు జీవిస్తున్నారు. మనం మాస్టరుగారి సాన్నిధ్యాన్ని సక్రమంగా వినియోగించుకోలేక పోతున్నాం. నేటి భారతీయులు విదేశీయుల వద్దకు ముష్టివారిలాగా, సహాయాన్ని అర్థించి వెడుతున్నారు. రాజకీయ నాయకులు, మతప్రచారకులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు – అందరూ అంతే! కాని మేము వెడుతున్నది వారి సహాయాన్ని అర్థించి కాదు. వారి అభ్యర్థనను మన్నించి, వారిలో ఆధ్యాత్మిక జ్యోతి వెలగించాలనే ఉద్దేశ్యంతో, మైత్రేయుల ప్రణాళికలో ఒక భాగంగా వెడుతున్నాము.

మాస్టరు సి. వి. వి. గారిని గురించి ఆయన శిష్యులకే చాలా మందికి తెలియదు. వరుణుని దివ్యానుగ్రహం వలన భూమిపై ఉదయించిన ఒక జ్ఞాన సూర్యుడాయన. ప్రధానంగా ఈ 20వ శతాబ్దంలో వరుణుని అనుగ్రహం మన సౌరకుటుంబం పై ప్రసరిస్తున్నది. ఈ భూమిపై గల మానవుల ప్రజ్ఞల సంకుచితత్వాన్ని బ్రద్దలుకొట్టి, విశ్వ ప్రజ్ఞలోనికి నడిపించే గ్రహం అది. కనుకనే సి. వి. వి. గారు సామూహిక ప్రార్థనలను ప్రవేశ పెట్టారు. ఈ మార్గంలో ఒంటరిగా చేసే వ్యక్తిగత సాధనకు స్థానం లేదు. స్వార్థపరులు ఇందులో ఇమడలేరు. తనను తాను సమర్పణ చేసుకుని, జాతి పురోగమనానికి సహాయపడటానికి సంకల్పించిన సాధకులు మాత్రమే ఈ మార్గంలో నిలువగలరు. 'నాది, నావారు' అనే స్వార్థతత్వం ఇందులో నిలువలేదు. ఆయనకు నమస్కరించిన ఎవ్వరైనా, ఇంక ఎక్కడా తలవంచవలసిన పనిలేదు. ఎవరినీ సహాయం అర్థించవలసిన పనిలేదు. అలాంటి అవసరం కలిగిందంటే, శిష్యుడు ఇంకా సర్దుకోవలసింది ఏదో ఉన్నదన్న మాట. మనం చేయవలసినది ఒక్కటే - మాస్టరుగారిని అనుసరించడం; ఆయనను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం కంటె, ఆయనను సర్వాంతర్యామిగా దర్శించడం; ఎన్ని జన్మలకైనా ఆయనతో కలిసి పని చేసే భాగ్యాన్ని ప్రసాదించమని ప్రార్థించడం." అంటారు వర్మగారు.

ఇంత శరణాగతుడు గనుకనే వర్మగారు జెనీవాలో నీలి కాంతుల మధ్య క్రీస్తును దర్శించ గలిగారు!



# మాస్టరుగారు
# - కృష్ణస్వామి

కృష్ణస్వామిగారు, ఖర్గపూరు కామేశ్వరరావుగారు, సత్తి బాబు వీరంతా మాస్టరుగారి యెడల సమర్పణకు, ఆనందమునకు కర్మయోగానికి సంబంధించినవారు. అందుకే మాస్టరుగారి వద్దకు వచ్చిన వారు చాలమంది తమకు తెలియకుండా వీరి వద్దకు వచ్చి వీరి వద్ద నుండి మాస్టరుగారి ఉపదేశాలను పొందటం, మాస్టరు గారి వెలుగులోనికి ప్రవేశించటం జరుగుతుంది. మాస్టరుగారి సంకల్పాన్ననుసరించి సాటి సోదరులకు సహాయం చేయటంలో నిరంతరం వారు కాలం గడపటమే దీనికి కారణం కావచ్చును. వ్యక్తిగతములైన సమస్యలకు మనస్సులో తాపీయక, మాస్టరు గారి స్మరణలో ఉత్సాహాన్ని, బలాన్ని తెచ్చుకొని ఎప్పుడూ నిండుగా, తృప్తిగా నవ్వుతూ ఉంటారు. కృష్ణస్వామిగారిని గూర్చి ఆయన జీవితంలో జరిగిన కొన్ని సంఘటనలను గూర్చి సోదరులకు తెలియజేయటం చాల ఉపయోగ మనిపించింది.

కృష్ణస్వామిగారు యిరవైఅయిదు సంవత్సరముల యువకుడు. ఆంధ్రా యూనివర్సిటీలో M. A. చదువుతుండగా మాస్టరుగారితో పరిచయమయింది. మాస్టరుగారితో పరిచయం కాకముందు ఒక మహా విప్లవం లేవదీయాలని, దేశంలో ఉన్న అరాచకాన్ని, అసమానత్వాన్ని తొలగించాలని ఆదర్శావేశంతో ప్రయత్నం

చేసేవారు. కానీ విప్లవం నడిపించే నాయకులు, సంస్థలు స్వార్థం తోను, అసూయలతోను ప్రవర్తించే తీరు గమనించేసరికి ఆయనకు విప్లవ మార్గంపై విరక్తి కలిగింది. మాతృదేశానికి సహాయపడలేని తన నిస్సహాయత ఆయనను ఆత్మహత్యకు పురికొల్పింది. ఆత్మ హత్య చేసుకోవటానికి సిద్ధపడే సమయంలో దైవానుగ్రహంగా క్లాసు పిల్లలంతా పిక్నిక్ ఏర్పాటు చేశారు. మాస్టరు గారిని తీసుకురమ్మని కృష్ణస్వామిగారిని పంపారు. మాస్టరుగారి యిల్లు వెతుక్కుంటూ వెళ్ళి ఆయనను పిలిచారు. అప్పటికి మాస్టరుగారు మందులు యిస్తున్నారు. ఉన్నవారు ఉన్నట్టుగానే లేచి వచ్చేశారు. కృష్ణస్వామిగారికి ఆశ్చర్యం వేసింది; ఏమిటి ఈయన కనీసం యింటిలో అయినా చెప్పకుండా వచ్చేస్తున్నారే అని! మాస్టరుగారు అప్పుడప్పుడు సరదాగా మేజిక్‌లు చేస్తుంటారు. అందరిచేత ప్రశ్నలు వ్రాయించి, గ్లాసులో వేయించి తలపై పెట్టుకుంటారు. కనులు మూసుకొని ఒక కాగితం తీసి అందులో ఏమి వ్రాసి ఉందో చెప్పి సమాధానం చెప్తారు. దీనిని Thought Reading అంటారు. ఒక కాగితంలో "నేను కోరుకున్న ప్రపంచం ఎప్పుడు స్థాపించబడుతుంది?" అని వ్రాసి ఉంది. ఇది వ్రాసింది ఎవరు అని మాస్టరుగారు అడిగారు. కృష్ణస్వామి గారు లేచి నిలబడి "నేను" అని చెప్పారు. "నీవు కోరుకున్న ప్రపంచము నీలోనే స్థాపించబడుతుంది. 1980 నాటికల్లా కొన్ని వేల మంది శిష్యులై నీవెంట నడుస్తారు" అని చెప్పారు. పిక్‌నిక్ అయి అందరూ తిరిగి వస్తుండగా మాస్టరుగారు దారిలో కృష్ణస్వామిగారిని దింపి తనతో బాటుగా వారి యింటికి తీసికొని వెళ్ళారు. "ఈరోజు రాత్రి నీవు చనిపోదామని నిశ్చయించుకున్నావు కదూ!" అని నవ్వుతూ అడిగేటప్పటికి కృష్ణస్వామిగారు ఆశ్చర్యపోయారు. ఆ క్షణమే తన మనస్సులో ఇంత కాలం నుండి పడుతున్న ఆవేదన

మాస్టరుగారి ముందు వెళ్ళగక్కి చిన్నపిల్ల వాడిలా వెక్కి వెక్కి ఏడ్చారు. మాస్టరుగారు ఆయనను దగ్గరగా చేరదీసి "నీకు నేనున్నాను. చనిపోయి సాధించేదేముంది? బ్రతికి సాధించు. ఎవరైతే అర్థం చేసుకోలేక నిన్ను తూలనాడారో వారంతా నీ మార్గాన పయనిస్తారు. ఈ రోజునుండి నీవు నాతోనే ఉండు" అని చెప్పారు. ఆ క్షణమే కృష్ణస్వామిగారి జీవితంలో ఒక నూతన అధ్యాయం ప్రారంభం. గోపికలు కృష్ణుని కోసమై విరహపడినట్లు మాస్టరుగారి కోసము ఆయన విరహపడిన రోజులున్నాయి. మాస్టరుగారు ఒక్కరోజు మాట్లాడకపోయినా, కనిపించకపోయినా పిచ్చెక్కినట్లు తిరిగిన రోజులున్నాయి. "ఏ క్షణము నుంచయితే మాస్టరుగారు నీకు నేనున్నాను అని అన్నారో ఆ క్షణము నుండి నేను అన్నము తిన్నది, నేను బట్టలు కట్టినది, నేను మాట్లాడినది, నేను ఎదురు చూచినది, నేను నిరీక్షించినది, నేను తపించినది, చివరకు నేను బ్రతికినది ఆయన కోసమే! నా కంటి చూపు, నా దేహ స్పర్శ, నా నుంచి వచ్చే వాక్కు సమస్తం ఆయనే! ఎక్కడ చూచినా ఆయనే కనిపించటం ప్రారంభించారు. ఎవరు ఏమి మాట్లాడినా ఆయన మాటలే వినిపించటం మొదలయింది. ఎవరు నా వంక చూచినా ఆయన చూస్తున్నట్లనిపించేది. పరిసరములు, వ్యక్తులు, పరిస్థితులు అన్నీ ఆయనగా మారిపోయాయి. చివరకు నా జీవితమే ఆయనగా మారిపోయింది." అంటారు కృష్ణస్వామిగారు.

"మాస్టరు గారు ఏ కారణం కోసమైతే అవతరించారో నేను దాని ననుసరిస్తాను. మాస్టరు గారు ఏ యే కార్యక్రమాలు నడుపుతున్నారో నేను కూడా అవే నడుపుతాను. ఫోటో ఒక్కటే. సైజులు మాత్రము తేడా! ఇందు కోసమై నా ఆఖరి క్షణం వరకు ప్రయత్నిస్తాను. నాలోని ప్రియత్నం సంకల్పం ఆయనే! కనుక ఫలించక పోవటం ఉండదు. ఫలితానికై ఆశించక కర్తవ్య మాచరించటం మన విధి అయినా ఇంతవరకూ నాకు పనులు జరుగక

పోవటం అనేది లేదు. ఇది నా సామర్థ్యం కాదు. దాని వెనుక నున్న ఆయన అనుగ్రహం." ఇవి కృష్ణస్వామి గారి మాటలు. కేవలము మాటలు మాత్రమే కాదు. ఆయన చేసి చూపించినవి.

విశాఖపట్టణం జనకులంలో టీచరుగా పనిచేస్తుండగా సూర్య కుమారి అనే విద్యార్థిని సహకారంతో అక్కయ్యపాలెంలో విద్యాలయాన్ని స్థాపించారు. దానికి బృందావనం అని పేరు పెట్టారు. కాని కొన్ని కారణాలవల్ల ఆయన అక్కడ నుండి తప్పుకోవలసి వచ్చింది. దానికి ఆయన ఇలా చెప్పారు.

"ఎంత వరకు నా సహాయం వారికవసరమైందో అంత వరకు నేను అందించ గలిగాను. ఇక నా సహాయం ఎక్కడ అందాలని మాస్టరు గారు సంకల్పిస్తారో అక్కడ చేయగలను. జీవితంలో జరిగే ప్రతి సంఘటన మనకు ఏదో ఒక క్రొత్త పాఠాన్ని నేర్పటానికి వస్తుంది. మానవుడు అనుకున్నవి అనుకున్నట్లుగా జరిగితే ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేడు పరిణామ క్రమంలో. అంతకు ముందు అనుభవించని క్రొత్త సంఘటనలు ఎదురైన నాడు వాటిని తట్టుకోవటం కోసం చేసే ప్రయత్నంలోనే తనున్న స్థితి నుండి ముందడుగు వేయగలడు. ఏ విధంగా పాఠాన్ని వివరిస్తే విద్యార్థికి అర్థమవుతుందో అన్నది విద్యార్థికన్న ఉపాధ్యాయునికి ఎక్కువగా తెలుస్తుంది. అలాగే జీవితంలో ఏ సంఘటన వలన మానవుడు ఉద్ధరించ బడతాడో అలాంటి సంఘటనలనే ప్రకృతి కల్పిస్తుంది. పరాజయం, మృత్యువు, తిరస్కరించ బడటం, దారిద్ర్య స్థితి చెందటం మొదలైన వన్నియు దీనికి చెందిన వే!"

కృష్ణస్వామి గారి దృక్పథమంతా యిలాగే ఉంటుంది. పైకి మాత్రము చాలా సున్నితంగా, అమాయికంగా ఉన్న ఆయన మనస్సు మాత్రము దృఢమైనది. ఎన్ని అవాంతరాలు వచ్చినా ఆయన చిరునవ్వుతో మాస్టరు గారి పైన భక్తితో స్వీకరిస్తారే గాని చలించరు.

స్వగ్రామమైన కోడూరులో కొంత మంది సోదరులను కూర్చుకొని ఒక విద్యాలయాన్ని, ఒక వైద్యాలయాన్ని నడుపుతున్నారు. సాధారణంగా తమ ఊరిలో పుట్టిన వాడు, తమ కుటుంబములో పుట్టిన వాడెంత ఉత్తముడైనా వాడిని దగ్గర వారు ఆదరించరు. కాని కృష్ణస్వామి గారు తమ స్వగ్రామంలోనే కొన్ని వందల మందిచేత గురువుగా పూజింప బడటం ఒక విశేషమే.

ఈయన యిచ్చిన ఉపన్యాసాలువిన్నవా రెవరైనా మాస్టరు గారి ఉపన్యాసాలు విన్నట్లుగానే భావిస్తారు. కోడూరులో క్రిందటిసారి గురుపూజలు జరిపి నపుడు మాస్టరు గారు ఆఖరిరోజు బస్సుకి టైము అవుతుందని ఆరున్నర గంటలకే బయలు దేరారు. తరువాత ప్రసంగం కృష్ణస్వామి గారు చేశారు. మరుసటి రోజు ఆ ఊరి ప్రజలు కొంతమంది దూరం నుండి విన్నవారు కృష్ణస్వామి గారి వద్దకు వచ్చి "రాత్రి 8 గంటల వరకు మాస్టరు గారు చేసిన ప్రసంగము చాల అద్భుతంగా ఉన్నది. షాపులో కూర్చోవలసి రావటంవలన దగ్గరకు రాలేకపోయాము. కానీ ఉపన్యాసము విన్నంతసేపు అందులో కరిగిపోయాము" అని చెప్పారు. అయితే వారెవ్వరికి తాము విన్నది కృష్ణస్వామి గారి ఉపన్యాసమని తెలియదు.

"మానవులందరూ దైవ స్వరూపులు. వారిని సేవించటం దైవాన్ని సేవించటం. గురువును సేవించటం. నా మనస్సు సమస్యల తోను, దుఃఖంతోను నిండి ఉండగా మాస్టరుగారు తన చల్లని స్పర్శచే నాకు శాంతిని చేకూర్చారు. నేనుకూడ మాస్టరుగారి స్పర్శను లోకానికి అందచేయాలని ప్రయత్నం చేస్తున్నాను. మాస్టరుగారు నాకు మందులు వేసి శారీరక, మానసిక ఆరోగ్యాల ప్రసాదించారు. తిరిగి మందులు వేసి ఆయన ఋణం తీర్చుకోలేను

గదా! ఆయన ఋణం తీర్చుకొనుట అంటే సాటివారి అస్వస్థతను తొలగించటం. అందుకే నేను హోమియోపతి వైద్యం అభ్యాసము చేస్తున్నాను. వెనుక మాస్టరుగారి అభయ హస్తముంది. అందరికీ శారీరిక మానసిక ఆరోగ్యాలను చేకూర్చటం, వారిలో అంధకార మున్నచోట మాస్టర్ అను వెలుగును వెలిగించటం, నిరాశ ఉన్న చోట మాస్టర్ అను ఆశాజ్యోతిని వెలిగించటం, అజ్ఞానమున్నచోట మాస్టర్ అను జ్ఞాన జ్యోతిని వెలిగించటం, పగ, కక్ష, క్రోధము ఉన్నచోట మాస్టర్ అనే ప్రేమజ్యోతిని వెలిగించటం, నేను చేయాలని సంకల్పించినవి. చేయటానికి ప్రయత్నిస్తున్నవి. నా అనుకొన్న వారందరికి నేను బోధిస్తున్నవి, అందరూ ఆచరించి తరించవలసినవి"

ఈ మాటలవలన కృష్ణస్వామిగారి ప్రణాళిక అర్థమవుతుంది. ప్రపంచంలో మాస్టరుగారి దివ్య కార్యక్రమంలో కృష్ణస్వామిగారిలా ఇలా ఎంతమంది తయారవుతున్నారో, తయారయినారో, తయారవ వలసి యున్నారో తెలుసుకొనటమే అదృష్టం. మాస్టరుగారిని దర్శనం చేయటం అంటే భూగోళంపై ఆయన సాగిస్తున్న కార్యక్రమాలనుండి ఆయనను దర్శించటం తప్ప వేరొక మార్గం లేదు.



# మాస్టరుగారు
## - పి. కామేశ్వరరావు

మాస్టరుగారిని కలుసుకొనటానికి రమ్మనమని కామేశ్వరరావు గారిని ఈయన బావగారు సత్యనారాయణగారు చాలసార్లు బలవంతం చేశారు. “మాస్టరుగారు నన్ను చూసే టైము ఇంకా రాలేదు. వచ్చిన తరువాత తప్పక నేనే కలుస్తాను” అని కామేశ్వరరావు గారు అనేవారు. ఒకరోజు అనుకోకుండా ఈయన మాస్టరుగారి ఉపన్యాసానికి వెళ్ళటం తటస్థించింది. ఉపన్యాసంలో మాస్టరుగారు రామపట్టాభిషేక సమయంలో ఆంజనేయుని కోతిచేష్టలను గూర్చి ఒక కథ చెపుతూ రామునిపై ఆంజనేయునికిగల భక్తి, ప్రేమ, సమర్పణలను గూర్చి వివరిస్తున్నారు. ఏ విచిత్రమైన క్షణములో రామాంజనేయుల మధ్య గల సంబంధం ఈయన మనస్సున ముద్రించ బడిందో గాని, ఆనాటి నుండి కామేశ్వరరావుగారు ఆంజనేయునిలో గల కార్యదీక్షను, భక్తిని తనలో నింపుకొని, ఆయన అవిగా మారి పోయారు. మాస్టరుగారు సంకల్పించటమన్నా, చెప్పటమన్నా, ఈయన చేయుటమన్నా ఒకటి అనే స్థితి ఆనాటినుండి సిద్ధించింది.

ప్రకాశరావుగారింట్లో మాస్టరుగారితో మొదటి సారిగా మాట్లాడడం జరిగింది. మాస్టరుగారు “ఈరోజునుండి నీవు నా కుటుం బంలో ఒకడివి” అన్నారు. ఆయన కళ్ళలో ప్రేమ, ఆయన మాటలలో వాత్సల్యము ఆ క్షణాలలో కామేశ్వరరావుగారిలో

మాస్టరుగారిపట్ల పితృభావాన్ని నింపాయి. "మాస్టరుగారి కుటుంబ మంటే ఆయన భార్య, పిల్లలు అనుకున్నా నా రోజు. కాని ఈ వసు ధంతా ఆయన కుటుంబమేనని ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నాను. ఇకముందు తెలుసుకోవలసింది యింకెంత ఉందో" అంటారు కామేశ్వరరావుగారు.

కామేశ్వరరావుగారికి మాస్టరుగారు C. V. V. ఫొటో యిచ్చారు. "నీవు ఏమైనా నాతో మాట్లాడదలచుకుంటే ఈఫొటో ముందు కూర్చుని మాట్లాడు. నాకు వినిపిస్తుంది". అని చెప్పారు. ఒక White Lotus Day రోజున మాస్టరుగారు సముద్రపు ఒడ్డు నకు తీసుకువెళ్ళి యిలా చెప్పారు. "నేటి నుండి నీవు నేను చెప్పినట్లు చేస్తూండు. దేశం, కాలం, మన కడ్డురావు. ఈ క్షణమునుండే నీలో నేను, నాలో నీవు ఉండటం జరుగుతుంది. నీ కుటుంబ భారం నాది" అని చెప్పారు. ఆ రోజునే జ్వాల్‌కూల్ గారు వ్రాసిన "Discipleship in the new age" రెండవ భాగం చదవమని యిచ్చారు.

మాస్టరుగారి ఆ దే శం పై న నే కామేశ్వరరావుగారు ఖర్గపూర్‌లో 1972 నుండి పురుషసూక్తం, రామాయణం, భాగ వతం మిగిలిన సోదరబృందానికి ప్రబోధము చేస్తున్నారు. మంత్ర జాలమనే పుస్తకాన్ని ఈయన సోదర బృందానికి వివరించటమే గాక, మంత్రజాల ప్రదర్శకుడు, మంత్రగాన లోలుడైన కృష్ణుని మాస్టరుగారి యందు దర్శించి ఆ దర్శనంలోనే తన జీవితాన్ని సాగిస్తున్నారు. 1974లో మాస్టరుగారు పిలిచి "ఈ రోజు నుంచి మందులు నీవు స్వయముగా ఈయవచ్చు" అని అనుమతి యిచ్చారు. ఆరోజునుండి వైద్యసేవకూడ తన జీవితములో ఒక భాగంగా చేసు కున్నారు. 1975 కృష్ణాష్టమి రోజుల్లో ఖర్గపూర్‌లో గురుపూజా మహోత్సవాలు జరిగాయి. మాస్టరుగారిని గూర్చి ఆయన యిచ్చిన సందేశం పాఠకు లందరికి ఉపయోగిస్తుంది.

"గురువు అనగా శరీరాన్ని ధరించిన ఒకవ్యక్తి కాదు. ఒక మహాచైతన్యం. ప్రేమ, జ్ఞానం, కరుణ, వాత్సల్యం, సంకల్పం, వివేకం గురువుయొక్క రూపాలు. గురువు బ్రహ్మ, గురువు విష్ణువు, గురువు మహేశ్వరుడు. గురువు పరబ్రహ్మ. ఈ విధంగా ధ్యానం చేసినపుడు మాత్రమే గురువుయొక్క అనుగ్రహం మనకు లభిస్తుంది.

కోడిపెట్ట గుడ్డును పొదగగా లోన పిండము కోడిపిల్లగా తయారవుతుంది. లోననుండి పిల్ల బయట ప్రపంచంలోకి రావటానికి చేసే ప్రయత్నంలో డిప్పను ముక్కుతో తట్టుతుంది. అప్పుడు తల్లి కోడి పెంకును పగలగొట్టి పిల్లను బయటకు తీస్తుంది. ఇదే శిష్యునకు, గురువుకు గల సంబంధం. మనకు జ్ఞాన మార్గాన్ని బోధించటం, ఆ మార్గాన పయనించటానికి మనం సిద్ధమైన తరువాత తనతోపాటుగా మనలను తీసికొని వెళ్ళటం గురువు చేస్తాడు. ఆ మార్గాన పయనించటానికి మాత్రం మనం సిద్ధపడాలి. ఇది ఆత్మసమర్పణ వలననే సాధ్యమవుతుంది. గురువు చెప్పినట్లు చేయటం, గురువుయెడల వినయ విధేయతలతో మెలగటం, గురువును చూసి భయపడటం మొదలైనవి గాక గురువునందు జీవించటంఅని ఒకటి ఉంది. గురువు ఏది ఎప్పుడు ఎందుకు చేసినా అది మన శ్రేయస్సు కోరియే అని గుర్తుంచుకోవాలి. ఎల్లవేళలా యిది మనస్సు నందుంచుకోవాలి. గురువునందు జీవించటం, సాటి సోదరులను ప్రేమించటం, సేవించటం వలన మాత్రమే సాధ్యమవుతుంది. ప్రతి జీవియందు గల దివ్యలక్షణములను భక్తితో గమనించి సర్వాంతర్యామియైన గురువును వారియందు దర్శనం చేయాలి. ఇదే నేను చేస్తున్నది. మాస్టరుగారిపైన నాకెట్టి అభిప్రాయము లేదు. ఉన్న భావన ఒక్కటే! ఆయన సాక్షాత్తు మంద్రజాల ప్రదర్శకుడు, మంద్రగాన లోలుడు అయిన కృష్ణ భగవానుడు" అంటారు కామేశ్వరరావుగారు.

# మాస్టరుగారు

## -రవిశర్మ

1969 వ సంవత్సరం డిసెంబరు నెలలో చివుకుల రవిశర్మ ఆంధ్రాయూనివర్సిటీ తెలుగు డిపార్టుమెంటుకి వచ్చాడు. అక్కడ మాస్టరుగారు కనిపించారు. "అందరిలాగానే ఆయనా ఒక లెక్చరరే గాని, కొంత వర్చస్సు ఉన్నవారు! అనిపించింది నాకు. అప్పటికే నేను తెలుగు సాహిత్యాన్ని క్షుణ్ణంగా చదివేశానని అందరూ అనుకునే వారు. కాని నేను మాత్రం అలా అనుకోలేదు. చదివినంత వరకూ దాన్ని విమర్శించి, పాయింట్లు లాగి, అందరి చేతా 'అబ్బో!' అనిపించుకోవడం నాకు అలవాటు. విమర్శకుడిగా పేరు పొందాలని నా కోరిక. ఆ రోజుల్లో నేను "మహాభారతంలో ధర్మరాజు" అని ఒక విమర్శనా గ్రంథాన్ని వ్రాశాను. దాన్ని గురించి మాస్టరుగారితో ఒకసారి 'చర్చించాను.' చర్చించడం అనేది ఆనాటి నా స్వభావంలో భాగం! మాస్టరుగారు నాతో ఒకమాట చెప్పారు. "ధర్మరాజు రాజసూయం అయిన తర్వాత కృష్ణునికి శరణాగతి చెందాడు. అందుచేత తర్వాత జరిగిన ఏ పనుల్లోనూ ధర్మరాజు స్వంతం అనేది లేదు." అన్నారు. నేను లైబ్రరీ అంతా తిరగేసి చూశాను గాని, ఎక్కడా ఆ ఘట్టం కనిపించలేదు. మామూలుగా అయితే అలాంటి తప్పు చెప్పిన వారిని నేను చాలా

అసహ్యించుకునే వాడిని. కాని చిత్రంగా, నేను అసహ్యించుకునే పని చేసిన వ్యక్తి మీద నాకు చాలా గౌరవం ఏర్పడింది!

ఆ తరువాతి రెండు మూడేళ్ళకి, మాస్టరుగారు చెప్పింది వాస్తవం (fact) కాకపోయినా సత్యమే (truth) అని తెలిసింది." అంటాడు రవిశర్మ. "ధర్మరాజు వ్యక్తిగా శ్రీకృష్ణుని శరణు పొంద లేదు. తన దాయాదుల స్వరూపంలో ఉన్న వాసుదేవునికి శరణా గతి చెందాడని తర్వాత తర్వాత అర్థమైంది. ఈలోగా మాస్టరు గారితో చాలా విషయాలు ఎన్నో రాత్రిలు చర్చించాను. చర్చ లంటే మాస్టరుగారికి గిట్టవని అందరికీ తెలుసు. అయినా నాతో అంత ఓపికగా చర్చిస్తుంటే అందరికీ ఆశ్చర్యం కలిగింది. ఈసంవత్స రాలలో మాస్టరుగారు—నేను వ్యాయసకాడుగా, టైపిస్టుగా—ఎన్నో గ్రంథాలు వ్రాశారు. ఈ సాన్నిధ్య పరిభావం క్రమంగా నాపైన పడింది. తుప్పు పట్టిన ఇనుపముక్కకు తుప్పు వదలగొట్టి, అయస్కాంత స్పర్శ కలిగించడానికి మాస్టరు గారికి కొన్ని ఏళ్ళు పట్టింది. అయినా మాస్టరు గారు విసుగు చెందలేదు. మొదట్లో కేవల విమర్శకుడిగా, ఖండ ఖండాలు చేసుకొన్న సత్యాన్ని చూడ డానికి అలవాటు పడిన నేను, ఈనాడు ఏ విషయంలోనైనా, ముఖ్యంగా మహాభారతంలో ఉన్న అఖండ సమన్వయాన్ని దర్శనం చేయగలుగుతున్నా నంటే అది మాస్టరు గారి అనుగ్రహం, ఓర్మికి ఫలితమూను! విమర్శన అనే దుస్థితిలో ఉన్న వ్యక్తికి, సమ న్వయం దర్శింప జేసిన మాస్టరుగారు కరుణామయులు!"

"సమన్వయం దర్శించడమే కాకుండా, భారతంలోని ఒక్కొక్క సన్నివేశంలోను ఉన్న సత్యం నా జీవితంతో సమన్వ యించుకోవడమే నా జీవితానికి సార్థకత. దానికి ఈ జన్మ చాలదు! కేవలం సాహిత్యాభిలాషతో భారతం చదవడం మొదలు పెట్టిన మనిషి, మాస్టరుగారి దయ లేకపోతే, ఈ స్థితికి రావడం సాధ్యమా?" అని ఎంతో భక్తి వినమ్రతలతో అంటాడు రవిశర్మ.

"మాస్టరుగారు 'కవిసన్నిధి' అనే పుస్తకం వ్రాస్తున్నప్పుడు ఆయనకు వ్రాయసకాడుగా ఉండడానికి సిద్ధపడ్డాను నేను. కష్టపడి పనిచేయడం, చేసిన పనికి మెప్పుదల రావాలని కోరడం నాకుండేవి. అలా ప్రారంభమైన పరిచయంలో, క్రమంగా మాస్టరుగారి సాన్నిధ్యంవల్ల నాలోగల ఒక్కొక్క దుర్లక్షణాన్ని వదిలించుకో సాగాను. ఇలాంటి రోజుల్లో, 'గోదావైభవం కావ్యరచన సాగిన రోజులు అద్భుతమైనవి' అంటాడతను.

1971వ సంవత్సరం నవంబరులో మాస్టరుగారు 'గోదా వైభవం' కావ్యరచన ప్రారంభించారు. రెండు రోజుల తర్వాత రవిశర్మ వ్రాయడం ప్రారంభించాడు. పూర్వపు మహాకవులు తిక్కనవంటివారు ఆశువుగా పద్యాలను వ్రాయసగాండ్రకు చెబుతుండే వారని వినడమే! పెద్దనవంటి మహాకవులు కూడా జీవిత కాలం అంతటిలోనూ 700 పద్యాల కావ్యాలు ఒకటో రెండో మాత్రమే వ్రాశారు. మాస్టరుగారు వ్రాసినంత వేగంగా కావ్యం వ్రాసినవాళ్ళు ఎవరైనా ఉన్నారా? అని అనుమానం కలుగుతుంది. వేయిపద్యాల గోదావైభవ కావ్యం ఒకటిన్నర నెలల్లో పూర్తి చేయగలిగారు అంటే మాస్టరుగారి ప్రతిభ అసామాన్యమైనది! అనుకునేవాడు రవిశర్మ. అయితే, యోగసిద్ధి పొందిన సిద్ధపురుషుడు ఏ రంగంలో ప్రవేశించినా అనన్య సామాన్యంగానే ఉంటుందని తర్వాత అర్థమయింది. కావ్యరచన రాత్రివేళనే జరిగేది. సాయంత్రం ఉపన్యాసం మానేవారు కాదు. ఉపన్యాసం అయిన తర్వాత రైల్వే క్వార్టర్సులో ఒక సోదరుని యింటికి వెళ్లి కూర్చునేవారు. తొమ్మిది గంటలనుంచి రాత్రి ఒంటిగంట దాటే వరకూ రచన సాగేది. ఆ నాలుగు గంటలూ అపూర్వమైన ఘడియలు. అసలు ఈ లోకం అంటూ ఉన్నదని గుర్తు ఉండేది కాదు రవిశర్మకి. గోదాదేవి, విష్ణుచిత్తుడు, కృష్ణుడు, రంగనాథుడు— అందరూ సశరీరంగా దిగివచ్చి ఆ యింట్లో తిరుగాడుతున్నట్లుండేది.

ఆ కార్యరచన సాగినన్నాళ్ళూ కొంతమంది సోదర బృందానికి రాత్రింబవళ్ళు గోదాదేవి తప్ప మరో స్ఫురణే ఉండేది కాదు. కావ్యంలో గోదాదేవికి కృష్ణుడు కలలో కనిపించి, చేతిలో చర్నా కోల పట్టుకుని కొన్ని విషయాలు చెబుతాడు. ఆ పద్యాలను 'కొరడా పద్యాలు' అనేవారు ఈ సోదర బృందం. ఆ కొరడా పద్యాల్లో వారి జీవితాలు కరిగి పోయినాయి. రవిశర్మ రామనర సింహం అనే మిత్రునికి ఇలా వ్రాశాడు. "ఇక్కడ ఒక దివ్యలోకం మాస్టారు మాకు సృష్టిస్తున్నారు. ఆ లోకంలో విహరించ గలగ డానికి ఎన్ని జన్మలు ఎంత మహాపుణ్యం చేసుకున్నామో! ఈ కావ్యానికి వ్రాయసకాడుగా ఉండగలగడానికి నే నెన్ని జన్మల్లో తపస్సు చేసుకున్నానో! రామనరసింహం! నా జన్మ తరించి పోతున్నది!" ఈ ఉత్తరం చదివిన ఆ మిత్రుడు కావ్యం పూర్తి అయేలోగా అన్నామలైనగర్ నుంచి విశాఖపట్టణం వచ్చేసి చివరి అధ్యాయం తానే వ్రాశాడు! ఆనాటి గోదావైభవ వైభవం అలాంటిది!

మూడు అధ్యాయాలు వ్రాయడం అయేసరికి కావ్యం ముద్రణ మొదలైంది. రాత్రి ఒంటి గంటకు రైల్వే క్వార్టర్సులో వ్రాయడం పూర్తిచేసి, చిన వాల్తేరులో తన రూముకి చేరుకునే వాడు రవిశర్మ. తెల్లవారుఝామున 4-30 గంటలకి లేచి, కాల కృత్యాల తర్వాత, ఆ రోజు ప్రెస్సులో ఇవ్వవలసిన పద్యాలు ప్రెస్సు కాపీ వ్రాసి, 6-30 గంటలలోగా మాస్టరుగారికి చూపించే వాడు. ఆయన దిద్దుబాట్లు ఉంటే చేసి యిచ్చేవారు. రవిశర్మ 7 గంటలకి బయలుదేరి ప్రెస్సుకి వెళ్ళి 9-30 వరకు ప్రూఫులు చూసి, 10-30 కి ఆఫీసుకి చేరుకునేవాడు. సాయంత్రం మళ్ళీ ప్రెస్సు. 7-30 గంటలకి మాస్టరుగారి ఉపన్యాసానికి వెళ్ళేవాడు. మళ్ళీ రాత్రి ఒంటిగంట దాటేవరకూ కావ్యరచన. ఇలా రెండు నెలల పాటు రోజుకి కేవలం రెండు గంటల నిద్రతో ఎలా గడిపేవాడో

అతనికి తెలియదు. మొదట్లో కొద్ది రోజులు ఆఫీసులో కునికిపాట్లు రావడం, ఆఫీసరుచేత చివాట్లు తినడం జరిగింది. 'ఆఫీసులో కునికిపాట్లు వస్తున్నాయి మాస్టరుగారూ!'' అంటే, "ఇక రావులే!" అన్నారాయన. ఆనాటినుంచీ మళ్ళీ కునికిపాట్లు లేవు. మాస్టరుగారి అనుగ్రహమే లేకపోతే అంతటిపని - రోజుకి 22 గంటల పని - చేయడం సాధ్యం అయ్యేది కాదని అతని నమ్మకం.

అసలు మాస్టరుగారు వ్రాసిపెట్టమని కొందరిని అడుగుతుంటారు. ఆ అడగడంలో చాలా కరుణామయ దృష్టి ఉంది. ఒకనాటి సాయంత్రం 6 గంటలకి "ఒక పుస్తకం వ్రాయాలోయ్!" అన్నారు. అప్పటికి రెండు నెలల నుంచీ రవిశర్మ తీవ్రమైన జ్వరంతో బాధపడుతున్నాడు. ఆ స్థితిలో వ్రాయమన్నారు మాస్టరుగారు! రాత్రి 12 గంటలవరకు అలాగే వ్రాయించారు. ఆ మరునాటినుంచీ అతనికి జ్వరం తగ్గకపోయినా తీవ్రత, శరీరంలో బాధ కొంతవరకు తగ్గాయి.

అలాగే మరో రోజున రవిశర్మ ఆఫీసుకి ఫోను చేశారు మాస్టరు గారు. "నావాణి వ్యాసాలు వ్రాసిపెట్టవోయ్!'' అని అడిగారు. అడగడం అతన్ని అనుగ్రహించడానికే నని తెలియడం కష్టమే! సాయంత్రం 6 గంటల నుంచి 9 గంటల వరకు వ్రాయించారు. ప్రారంభించే ముందు అతనికి ఓపిక లేదు. పెన్ను కూడా చేతిలో నిలవడమే లేదు. అలాంటిది, వ్రాయడం పూర్తి అయేసరికి శరీరంలోకి ఎన్నో వందల కాలరీల శక్తి ప్రవేశించినట్లు, చాలా ఉత్సాహంగా ఇంటికి చేరుకున్నాడతను; ఇవి మహిమలు (miracles) అని అనుకుంటే భ్రమపడ్డామన్నమాటే! అన్ని మహిమలకూ, మాయలకూ మూలభూతమైన ఒక దివ్య తేజస్సు, భగవత్సాన్నిధ్యం మాస్టరుగారి సన్నిధిలో మనకు లభిస్తుంది. అందుకే మాస్టరుగారివద్ద వ్రాయసకాడుగా, టైపిస్టుగా పనిచేయడానికి అందరూ ముందుకి వస్తారు.

# మాస్టరుగారు
## - సత్తిబాబు

మాస్టరుగారిని ఆనంద స్వరూపులుగా భావించేవారు, వారి జీవితాల్లో కూడా ఆనందాన్ని నింపుకుంటారు - తమ తోటి వారిని, సాటివారిని కూడా తమ మాటలతోనూ, చేష్టలతోనూ ఆనందపరుస్తారు. ఇట్టి ఆనంద స్వరూపుడే చిరంజీవి సత్తిబాబు. మాస్టరుగారి ప్రసంగాలు ఇతగాడికి ఉపదేశాలు - ఉపదేశాలు ఇతగాడికి శాశ్వత సత్యాలు - ఈ శాశ్వత సత్యాలే ఇతగాడికి ధర్మ సూత్రాలుఅందుకే మాస్టరుగారి ఉపదేశాలు "ఉపదేశవాణి"గా, ఆ మాస్టరుగారి ప్రసంగాలు, "ధర్మ సూక్ష్మములు"గా, మాస్టరు గారి ఆదేశాలు "శాశ్వత సత్యాలు"గా ఇతని రచనలుగా వెలువడ్డాయి. ఈ పుస్తకముల పట్ల సోదరులకుగల ఆదరాభిమానాలే సత్తిబాబుకి మాస్టరుగారిపై గల ప్రేమాభిమానాలకు చిహ్నం.

మాస్టరుగారి కలంనుండి వెలువడిన రచనలు సంచిలో వేసుకొని మాస్టరుగారు ఎక్కడికి వెళ్ళినా అక్కడికి వెంటపోతాడు ఇతడు. ఆ ప్రచురణలు, అందులోని విశేషాలు అందరికీ వివరించి వాటిని అందరికీ అందజేస్తుంటాడు. ఇదీ అతని జీవిత పరమావధి.

మాస్టరుగారితో అతడు చేసిన కొన్ని ప్రసంగాలు, యాత్రలలో అతనికిగల దర్శనాలు వీటి సంకలనము, సమన్వయము సోదరుల కుపయోగకరమని వ్రాస్తున్నాను.

"ఉపన్యాసాలకని, ఔషధసేవకని, ప్రారంభోత్సవాలకని ఎందరో మాస్టరుగారిని తమ ప్రాంతాలకు తీసుకు వెళ్తుంటారు. వారు ఏ రూపంగా తీసుకువెళ్ళినా వారు కోరేది, వారికి లభించేది మాస్టరుగారి దివ్య సాన్నిధ్యమే! ఆ సాన్నిధ్యాన్ని చవి చూచిన వారేమంటారో తెలుసా, "మాస్టరుగారిని చూస్తుంటే ఏదో నిండుతనము మాకు కలుగుతుంది. వెతుక్కోవలసింది, తెలుసుకోవలసింది ఇంకేముంది అనిపిస్తుంది. చదువు, తెలివి, జ్ఞానము, తర్కము ఇవేమీ లేకపోయినా మాస్టరుగారి ఈ దివ్యానుగ్రహములకు అర్హులమగుట, మా అదృష్టమే! ఈ అర్హత మేము సాధించుకున్నది కాదు, ఆయన ప్రసాదించినది." ఇలా అందరూ అంటుంటే నేను వింటూ ఉంటాను. వారి ఆనందంలో నేను భాగం పంచుకుంటాను. మాస్టరుగారిని గురించి అనేక విషయాలు చెప్పి నేనూ వారిని ఆనందపరుస్తుంటాను. ఇదే నాకు ఆనందం అంటాడు సత్తిబాబు. ఒకసారి మాస్టరుగారు సత్తిబాబుతో అన్నారట– "నీవు రోడ్డుమీద నడిచి వెళ్తుంటే ఎవరైనా ఒక పిల్లవాడు నిన్ను నిలదీసి నీవు ఏం చేస్తున్నావు అని అడిగితే, నేను పదిమందికి పనికి వచ్చే పని చేస్తున్నానని నిర్భయంగా చెప్పగలిగేలా ఉండు – అలా చెప్పగలగాలంటే నీవు రోజూ ఓ పని చేస్తుండు – అదే (open) ఓపెన్‌గా ఉంటూండు – ఓపెన్ చేస్తూండు". మాస్టరుగారు అతనితో ఏం మాట్లాడినా, మాస్టరుగారు మరెవ్వరితో ఏం మాట్లాడుతున్నా వెంటనే వాటిని గ్రంథస్తం చేయటం, వాటిని పరిశీలించి పరిశోధన చేయటం ఇతని కార్యక్రమాలలో ఒకటి. దానికి ప్రతిఫలమే అతను వ్రాసిన చెణుకులు.

మాస్టరుగారు పల్లెలకు, గ్రామాలకు తరచుగా వెళ్తుంటారు. ఆయన అవసరం, అసలైన ప్రయోజనం, జరుగవలసిన కార్యక్రమం అంతా పల్లెలలోనే ఉంది. పల్లెలే జాతి మనుగడకి జీవనాధారాలు. అందుకే విదేశాలకు వెళ్ళినా మాస్టరుగారు పల్లెలను సందర్శించి వస్తుంటారు. జాతియొక్క సహజ స్వరూపం అక్కడనే ప్రతిబింబిస్తుంది. మాస్టరుగారు ఒకసారి మిథిల వెళ్ళినపుడు రాత్రి తొమ్మిది గంటలకు ఆ పరిసర ప్రాంతాల ప్రజలు ఆ రాత్రి సమయంలో, గడ గడ వణికించే చలిలో రోడ్డుమీద కాచుకొని ఉన్నారు. మాస్టరుగారు వారిని పలకరించి ఇంత చలిలో కూర్చుని ఉన్నారేమిటి అని అడగగా, "తమరు మళ్ళా మళ్ళా రారుకదా బాబూ! మిమ్మల్ని చూసే అదృష్టం మళ్ళా మాకెప్పుడు కలుగుద్ది" అన్నారట వారు. వారు చల్లని మజ్జిగ ఇస్తూ "చలికాలం-చల్లని మజ్జిగ-వేడిగా కాఫీ అయినా బాగుండేది" అందట ఒక ముసలావిడ. దానికి మాస్టరుగారు నవ్వి "ఆ కాఫీ నీళ్ళకంటె అభిమానంతో నువ్విచ్చిన ఈ చల్లని మజ్జిగే నయం" అన్నారట. ఇలాంటివారిని చూస్తుంటే మాస్టరుగారి పట్ల వారికుండే ఆదరాభిమానాలు, మాస్టరుగారికి వారిపై ఉండే ప్రేమ, వాత్సల్యం మనకు దర్శనమిస్తాయి. ఆ క్షణాలే జీవితంలో నిజమైన ఆనందానిచ్చే క్షణాలు. ఆ పల్లె ప్రజలలో ఉండే మాస్టరుగారు వేరు, మామూలుగా కనిపించే మాస్టరుగారు వేరు.

ఒకమారు సత్తిబాబుని అడిగాను "ఏం నాయనా! మాస్టరుగారితో తిరుగుతుంటావుగదా! ఏమయినా విశేషాలు చెప్పు" అని. అతను అన్నాడు "మాస్టరుగారి విశేషాలు అశేషాలు, విషయాలు వికాసాలు, భావాలు విభావాలండీ" అని. ఒకసారి మాస్టరుగారితో కలిసి అతను బత్తిలి అనే గ్రామం వెళ్లినపుడు అతనికి కలిగిన అనుభూతిని వివరించాడు.

"ఆ పల్లెప్రజలు రెండు వరుసలుగా బారులుదీరి మంగళ వాద్యాలతో, హరేరామ, హరేకృష్ణ అని గానం చేస్తూ మాస్టరు గారికి స్వాగతం చెప్పిన దృశ్యం ఎప్పటికీ మరపురానిది. వారి గానం ఒకనాదమై మమ్ములను తనలో కరిగించుకుంది. ఆ ఊరిలో నున్న రామకృష్ణాశ్రమానికి మాస్టరుగారిని తీసుకొని వెళ్తుండగా సుమారు రెండు ఫర్లాంగుల దూరండున్న ఆ బాటలో ప్రతిఇంటిలో నుండి గృహిణులు పరుగు పరుగున వచ్చి మాస్టరుగారి నుదుట కుంకుమ దిద్ది, హారతులిచ్చిన దృశ్యం ద్వారకాపుర వీధులలో కృష్ణభగవానుని పాదసంచారంలా అనిపించింది. ఆనాటి గీతోపన్యాసంలో ఆయన "మీ ఊరిలో గీతాచార్యుని వెలుగు నిండి ఉంది. మీపవిత్రమైన హృదయాలతో నాకు అనన్యమైన సంబంధ మేర్పడింది. కృష్ణభగవానుని నుండి వెలువడిన గీత ఈనాడు మీ నాలుకలద్వారా ప్రవహించింది. ఆ భగవానుని అనుగ్రహం మీకు లభిస్తుంది." అని ఆశీర్వదించారు.

ఆ క్షణంలో నాలో కలిగిన భావమిది :

రామమంత్రము రూపు కట్టెనో
గురువు హృదిలో స్వామి నిల్చెనో!
రామకాంతితో విరాజిల్లుతూ
ఆదికాంతిని సిరిగా తాను
ప్రసాదించెనో ప్రసారమ్ముగా!

మరొకమారు ఇప్పిలి అనే గ్రామం వెళ్ళాం – ఆ ఊరిలో ఒక శివలింగం ప్రతిష్ఠించి ఉంది. మాస్టరుగారు అభిషేకం చేసి ఇలా చెప్పారు. "పూజ, శుచి, నీతి, నియమాలు, ఇవన్నీ మాన

వుని పవిత్ర జీవనానికి మార్గాలు. ఈ మార్గంలో నడిచిన వారి జీవితం ఆనందమయ మౌతుంది.'' అని చెబుతూ మాస్టరుగారు దూరంగా ఉన్న కొబ్బరిచెట్లను చూపించారు. ''ఆ చెట్లు కాయలు కాస్తున్నాయి. మనకు అందిస్తున్నాయి. ఆశ్రియం ఇస్తున్నాయి. అలాగే మీరూ మీవారికి ఆశ్రియం ఇవ్వండి - ఆదరించండి - ప్రకృతిని గమనించండి. మన కోసం ఆవులు, కొండలు, చెట్లు ఎలా తమను తాము అర్పించుకుంటున్నాయో చూసి మీరుకూడా ఒకరి కొకరు సహకరించుకోండి - ఈ సహకారంలోనే సంఘం నిలబడు తుంది. ఇది తెలుసుకోండి-''

ఈ మాటలు వారి జీవితాలకు ఒక క్రొత్త రూపాన్ని కల్పించాయి. అంతేకాదు. శివలింగంమీద ఒక శివాలయం రూపు కట్టుకొంది మరుసటి సంవత్సరానికి. మాస్టరుగారు నడిచిన బాట తీర్చి దిద్దబడింది. రాజకీయవేత్తలు రాజయోగ సాధకులుగా మలచబడ్డారు. జిజ్ఞాసువులు, ఆర్తులు కర్మయోగులై పరిసర ప్రాంతాలవారికి మార్గదర్శకు లయ్యారు. మాస్టరుగారి వాణి, ఆయన సాన్నిధ్యం అనుభవించగలవా రెవరి జీవితపథమైనా ఇంతే!''

ఇంతేకాదు-మాస్టరుగారు సత్తిబాబు కిచ్చే శిక్షణ పరిశీలించ తగ్గది. ఇతరులకు మార్గదర్శక మయింది. మాస్టరుగారిచ్చే ప్రతి సందేశంలోనూ, ఆయన నుండి వెలువడే ప్రతి వాక్యంలోనూ ఒక ప్రయోజన ముంటుంది. అది మన పురోగమనానికి, జాతి పురో గమనానికి సంబంధించినది'' అని నమ్మి, ఆ విశ్వాసంతో జీవించే వాడు సత్తిబాబు. ఒకమారు అతను మాస్టరుగారితో పాలకొల్లు వెళ్ళటానికి ప్రయాణమై స్టేషనుకి మాస్టరుగారి కంటె ఆలస్యంగా వచ్చాడు. కారణం అడిగితే స్కూటర్ రిపేరు వచ్చింది అని చెప్పాడు. మాస్టరుగారు ''రైలు బయలుదేరే టైముకి ముందుగా మనం రావాలి అని తెలియటానికి

నవసరం లేదు. రైలు ఎక్కడానికి వచ్చిన వాళ్ళందరికీ స్కూటర్లు లేకపోయినా వారు నీకంటే ముందుగానే వచ్చారుకదా! అయినా రైలుకి ఏం తెలుస్తుంది నీ స్కూటర్‌కి రిపేరు వచ్చిందని? చేయవలసిన పని చేయవలసిన టైములో చేయటం అలవాటు చేసుకో'' అని హెచ్చరించారు.

ఇటువంటి సంఘటనలు, సంభాషణలు సత్తిబాబు డైరీలో వ్రాసుకొంటాడు-తరువాత పుస్తకాలలో ఎక్కిస్తాడు. ఆపుస్తకమే ''చెణుకులు''. ఒకరోజు దీపావళికి తన పుట్టినరోజున మాస్టరు గారి చేతికి తన డైరీ అందించి ఏమైనా వ్రాయమన్నాడు.

''వ్రాతల నుండి చేతలలోకి అడుగుపెట్టు'' అని వ్రాశారు. ఇది అతగాడొక్కడికే కాదు. మనకి కూడా సందేశమే!

# జీవనజ్యోతి

వైజ్ఞానికంగా అభివృద్ధిచెందిన మానవజాతి శాంతికి బదులు స్పర్థను పెంచుకుంటున్నది. రాజకీయంగా పురోగమించిన మానవ జాతి సమైక్యతకు బదులు వర్గపోరాటాలను సృష్టించుకున్నది. మను గడయే ఒక సమస్యగా చేసుకొంటున్నది. సామాన్య మానవుడి ఆకలిబాధలు, సమస్యలు అప్పటికీ, ఇప్పటికీ సమస్యలుగానే మిగిలిపోయాయి. నానాటికి అభివృద్ధి చెందుతున్న వైద్య శాస్త్రంతో పాటు వ్యాధుల సంఖ్య, అభివృద్ధి చెందుతున్న హాస్పిటల్స్‌తో పాటు రోగుల సంఖ్యకూడా పెరుగుతూనే ఉన్నది.

ఇక ఏ రంగంలో మానవుడికి శాంతి? ఇక మానవుడికి నిజ మైన శాంతి ఎక్కడ లభిస్తుంది?

అందరి హృదయాలలో నుండి ఇదే ప్రశ్న!

అందరి హృదయాలలోనూ ఇదే ఆవేదన!

నేటి మానవజాతి ఒక పరిష్కారాన్ని కోరుకొంటున్నది! తమ జీవితాలలో ప్రేమను నింపే ఒక ప్రేమమూర్తిని కోరు కుంటున్నది. ఆ ప్రేమమూర్తి కరుణామయ దృష్టిలో చల్లని స్పర్శలో తాము ఊరటచెందాలని పరితపిస్తున్నది – కారుచీకటి నిండిన తమ జీవితాలను వెలిగించే ఒక జీవనజ్యోతికోసం ధ్యానిస్తున్నది. ఆ జీవనజ్యోతి అవతరించింది.

తమ జీవితాలను వెలుగు మయం చేయమని కోరిన వారి జీవితాలను వెలిగించింది. ఆ వెలుగుకు తమ చేతులు అడ్డం పెట్టని వారు అందరూ ఆ జీవన జ్యోతిని దర్శించారు. ఆ వెలుగులో తమ జీవితాలను వెలిగించుకునే ప్రయత్నంలో, లోకంలోనూ వెలుగునింపే ప్రయత్నంలో ఈ గ్రంథం అందిస్తున్నారు.